# రాయలసీమ పదకవులు



డా॥ కె. జనార్ధనం

రాయలసీమ పదకవులు
ప్రథమ ముద్రణము
అక్టోబర్ 1990
ప్రతులు : 1000
వెల : 40/— రూ॥లు

*This book is published with the financial Assistance of Tirumala - Tirupati Devasthanams under their scheme "AID TO PUBLISH RELIGIOUS BOOKS"*

ప్రతులకు :
శ్రీమతి కె. సుచరిత
పాశిగుంట గ్రామం
కార్వేటినగరం [పోష్టు]
చిత్తూరు [జిల్లా] – 517 582

ముద్రణ :
శ్రీసత్యసాయి ప్రింటర్స్
6-2-151-సి, టి. నగర్, తిరుపతి.

# అంజలి

"రాయలసీమ పదకవులు" అనే అంశంపై పరిశోధన చేయడానికి అవకాశమిచ్చి పి.హెచ్.డి. పట్టాను ప్రదానం చేసిన తెలుగు అధ్యయన శాఖకు ..

నా పరిశోధనకు పర్యవేక్షక బాధ్యతను స్వీకరించి ఈ సిద్ధాంత గ్రంథానికి రూపురేఖలు దిద్దిన ప్రొ. కె. సర్వోత్తమరావు గారికి.. .....

నా పరిశోధనకు తగు సహాయ సహకారాలందించిన మిత్రులకు..

ఈ పుస్తక ప్రచురణార్థం ఆర్థిక సహాయం అందజేసిన తిరుమల తిరుపతి దేవస్థానం వారికి . . . . .

ఈ పుస్తకాన్ని అందంగా ముద్రించి యిచ్చిన శ్రీ సత్యసాయి ప్రింటర్స్ యాజమాన్యానికి మరియు సిబ్బందికి అందరికి కృతజ్ఞతలు.

తిరుపతి
అక్టోబర్, 1990



డా॥ కె. జనార్దనం



# విషయసూచిక

—o—

# రాయలసీమ పదకవులు

## ప్రస్తావన

ఏ సాహిత్యంలోనైనా పద్యంకంటే ముందు పదం పుట్టిందనడంలో అభిప్రాయభేదం లేదు ఈ పదకవిత్వం పండితుల మోద ముద్రనెంతమాత్రం పొందకపోయినా, రాజగౌరవం పొందకపోయినా దానిదారినదినడుస్తూ అభివృద్ధి చెందుతూ వుంది అంతమాత్రాన పండితులకు పదసాహిత్యం వల్ల కేవలం తిరస్కార భావముందని చెప్పలేం ఆయా కవులు తమ తమ రచనలలో ప్రాస్తావికంగా ప్రాస్తావించియున్నారు

పదసాహిత్యం నన్నయ్యకు పూర్వం నుండి తెలుగులో ఉన్నట్లు తెలుస్తుంది ప్రాఙ్నన్నయ్య యుగశాసనాలలో దేశీ ఛందోరీతులైన తరువోజలు, సీసపద్యాలు, మధ్యాక్కరలు, రగడలు కన్పిస్తాయి[1]

నన్నయ (క్రీ శ 11వ శతాబ్ది) తన భారతంలో పదాలను ప్రస్తావించకపోయినా గానానుకూలంగా ఉండే దేశి ఛందస్సులైన తరువోజ (ఆ వ 5_145, 6_250) మధ్యాక్కర (ఆ వ 4_103, 142) లను వాడాడు

నన్నెచోడుడు (క్రీ శ 12వ శతాబ్ది) తన కుమారసంభవములో అంకమాలికలు (3_38), ఊయల పాటలు (4_88) అలతులు (4_112) గౌడు గీతాలు (6 85) రోకటి పాటలు, దంచుపాటలు (6_87) మొదలైన జానపద గేయరీతుల్ని ప్రస్తావించాడు

పాల్కురికి సోమన (క్రీ శ 12వ శతాబ్ది) తన పండితారాధ్య చరిత్రలో ఏలలు(పు 433) తుమ్మెద, ప్రభాత, పర్వత, ఆనంద, శంకర నివాళి, వాలేశు, గొబ్బి, వెన్నెల, (వ 513) పదాలను బసవపురాణంలో కోలాటం, వాంగుబళా (పు 22) జోల (పు 68) మొదలైన దేశి గేయ రీతుల్ని పేర్కొన్నాడు

కృష్ణమాచార్యులు (క్రీ శ 14వ శతాబ్ది) దేశిరీతికి చెందిన అని బంధవదాల్ని వ్రాశాడు అతడు వచన సంకీర్తనం, నృసింహనామాలు రామనామ సంకీర్తనం, రామనామాలు వ్రాశాడు తరువాతి వాగ్గేయ కారులకు భావంలో, రచనా పద్ధతిలో, సంప్రదాయ పాలనలో, మార్గ దర్శకంగా నిలిచిపోయాడు

నాచనసోమన (క్రీ శ 14వ శతాబ్ది) తన వసంతవిలాసంలో జాజర పాటలను ప్రస్తావించాడు 2

పోతన (క్రీ శ 15వ శతాబ్ది) తన భాగవతంలో బాలుసంకీర్చి పాడే పాటల్ని (10 355) గోవిందు మీది పాటల్ని (10_505) ప్రస్తావించాడు

శ్రీనాథుడు (15 వ శతాబ్ది) భీమేశ్వర పురాణంలో యక్ష గాన సరణి (3 69) ని పేర్కొన్నాడు

పదకవులు ఆంధ్రదేశమంతటా అన్నికాలాలలో కన్పిస్తారు ఎడ్ల రామదాసు, నిట్టల ప్రకాశదాసు, శివరామదీక్షితులు, కాలువకొటప్ప, తూము నరసింహదాసు మొదలైనవారు సర్కారు ప్రాంతపు పదకవులు కుమ్మరి సిద్ధప్ప, ఖ్వాజా అహమదొద్దీన్, సయ్యదాలీ మొదలైనవారు తెలంగాణా పదకవులు అన్నమయ్య, పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య, సారంగపాణి, గోవిందసామయ్య, తరిగొండ వేంగమాంబ, పోతులూరి వీరబ్రహ్మం, దూదేకుల సిద్ధయ్య, ఈశ్వరమ్మ, యాగంటి కవులు, గుంటుపల్లి కోటిలింగయ్య మొదలైనవారు రాయలసీమ పదకవులు

శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రి గారు, శ్రీరాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు, శ్రీగౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు, శ్రీఉదయగిరి శ్రీనివాసాచార్యులు గారు, శ్రీ పి టి జగన్నాథరావుగారు, శ్రీబాలాంత్రపు రజనీకాంతారావుగారు, మొదలైనవారు రాయలసీమ పదకవుల సాహిత్యంపై విశేషమైన కృషిచేశారు వీరేగాక ఆచార్య జాస్తి సూర్యనారాయణగారు డా॥ ఎస్ గంగప్ప గారు, డా॥ కె సర్వోత్తమరావు గారు, మొదలైనవారుకూడా విశేషంగా తాళ్లపాక కవుల పదసాహిత్యంపై ప్రత్యేకించి కృషిచేశారు

రాయలసీమ పదకవుల సాహిత్యంపై విశ్వవిద్యాలయస్థాయిలో చాల పరిశోధనలు జరిగాయి

ఉస్మానియా విశ్వవిద్యాలయంలో డా॥ వేటూరి ఆనందమూర్తి గారు- "విజయనగరయుగంలోని వైష్ణవాంధ్ర వాఙ్మయం తాళ్లపాక కవుల సాహిత్యంపై ప్రత్యేక పరిశీలన అనే అంశంమీద కృషిచేసి

పి హెచ్ డి పట్టాపొందారు

శ్రీ ఎస్ నిగుణ గారు - అన్నమాచార్యుని సంకీర్తనలు స్త్రీ సంబంధి పాటలు" అనే అంశంమీద యం ఫిల్ పట్టాపొందారు.

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో లోగడ డా॥ కె వాణి గారు "తాళ్ళపాక అన్నమాచార్యుల పదకవితల్లోని "అలంకారాల పరిశీలన" డా॥ పి లీలావతిగారు - "అన్నమయ్య సంకీర్తనల్లో జానపదగేయ ఫణితులు , డా॥ వై సూర్యకాంతం గారు - "తాళ్ళపాక పెదతిరుమలా చార్యుని కృతులు - ఒక పరిశీలన", డా॥ సి గోవిందరాజు గారు - "తాళ్ళపాక అన్నమయ్య సంకీర్తనల్లో ఉత్సవ విశేషాలు", డా॥ డి శివప్పగారు - "తాళ్ళపాక అన్నమయ్య సంకీర్తనలలో తెలుగునాడు" అనే అంశాలపై కృషిచేసి పి హెచ్ డి పట్టాపొందారు అలాగే శ్రీమతి ఉమాదేవి గారు "తాళ్ళపాక సాహిత్యంలో కవిసమయాలు", శ్రీమతి ఇంద్రాణిగారు "తాళ్ళపాక అన్నమయ్య వైదుష్యం" అనే అంశాలపై పి హెచ్ డి సమర్పించనున్నారు డా॥ కె జె కృష్ణమూర్తి గారు - "తరిగొండ వెంగమాంబకృతులు - విమర్శక పరిశీలనము"అనే అంశంపై పి.హెచ్ డి పట్టా పొందారు

అలాగే శ్రీమతి ఓరుగంటి సీతారామమ్మగారు - "తాళ్ళపాక పెద తిరుమలయ్య కృతుల సవిమర్శక పరిశీలన", శ్రీ యమ్ శ్రీహరిగారు "అన్నమాచార్యుని బాలకృష్ణ సంకీర్తనలు", శ్రీమతి ఉమాదేవి గారు "తాళ్ళపాక సాహిత్యంలోని కవిసమయాలు", ప్రస్తుత వ్యాసరచయిత "యాగంటి వారి పదాలు - ఒక పరిశీలన" అనే అంశాలపై కృషిచేసి యం ఫిల్ పట్టాపొందారు

ఆంధ్రవిశ్వవిద్యాలయంలో డా॥ ఎ విద్యావతిగారు "తాళ్ళపాక కవుల సాహిత్యసేవ"అనే అంశంపై కృషిచేసి పి హెచ్.డి పట్టాపొందారు

మద్రాసు విశ్వవిద్యాలయం లో డా॥ ఎస్ ఎస్ మోహన్‌నాయుడు గారు - అన్నమాచార్యుల శృంగార సంకీర్తనలు - సాహిత్య దృక్పథం", డా॥ జి సాంబశివరావు గా రు "అన్నమాచార్యుని సంకీర్తనల్లో వర్ణనలు", డా॥ మేడసాని మోహన్ గారు — "అన్నమాచార్యుని కృతుల్లో భాషా విశ్లేషణ", డా॥ బి దివాకర్‌గారు - "అన్నమాచార్యుని సంకీర్తనలు - సమాలం" అనే అంశాలమీద కృషిచేసి పి హెచ్ డి పట్టా పొందారు

కృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం డా॥ జి రమేష్‌కుమార్ గారు "పదకవితా పితామహుని సంకీర్తనల్లో శృంగారం"అనే అంశంపై కృషి చేసి పి హెచ్ డి పట్టా పొందారు 3

మైసూరు, బెంగుళూరు విశ్వవిద్యాలయాల్లోకూడ పదసాహిత్యం మీద తులనాత్మక పరిశోధనలు జరిగాయి ఇవేగాక తెలుగు విశ్వవిద్యాలయంలో "భక్తిపదకవితాశాఖ"లో తాళ్లపాక సాహిత్యంపై పరిశీలన ముందుకు సాగిపోతూంది

విడివిడిగా ఆయా పదకవులకు సంబంధించిన పరిశోధన సాగింది కాని రాయలసీమ పదకవులందరి మీద ఏకకాలంలో పరిశోధన ఇంతవరకు సాగలేదు

రాయలసీమ పదకవులమీద పరిశోధన చెయ్యడానికి ముఖ్యంగా కారణాలు రెండు

సంకీర్తనల సంఖ్య దృష్ట్యా రాయలసీమ పదకవులు ఎక్కువగా వ్రాయడం మొదటిది

రాయలసీమ పదకవుల పదాల్లో విశిష్టమైన సాహిత్య శిల్పం ఉండడం రెండవది

ఈ సిద్ధాంత వ్యాసంలో మొత్తం ఆరు ప్రకరణాలున్నాయి

మొదటి ప్రకరణం ప్రస్తావన

రెండో ప్రకరణం – "రాయలసీమ పదకవులు – జీవిత విశేషాలు" ఈ ప్రకరణంలో రాయలసీమ పదకవుల బాల్యం, నివాసం, కాలం మొదలైన అంశాల్ని సంగ్రహంగా వివరిస్తూ రాయలసీమ పదకవుల రచనల్ని పేర్కొనడం జరిగింది

మూడో ప్రకరణం – "రాయలసీమ పదకవులు – మతధృక్పథం" ఈ ప్రకరణంలో వైష్ణవ, శైవ పదకవులనే విభాగంతో రాయలసీమ పదకవుల మతాసక్తిని వివరించడం జరిగింది

నాలుగో ప్రకరణం – "రాయలసీమ పదకవుల కవితాశిల్పం" ఈ ప్రకరణంలో పదకవుల వర్ణనాత్మక శిల్పం, నీతి, వైరాగ్య, మార్మిక తత్త్వ విశ్లేషణ సంకీర్తనల్లోని భాషా విశేషాలు స్థూలంగా పరిశీలించడం జరిగింది

ఐదో ప్రకరణం – "రాయలసీమ పదకవులు – పదప్రయోగ విశేషాలు" – ఈ ప్రకరణంలో పదకవులు సంకీర్తనలలో కన్పించే లక్షణాల్ని పేర్కొనడం జరిగింది అంతేగాక పదాల్లో కన్పించే జానపద గేయరీతుల్ని గుర్తించి పరిశీలించడం జరిగింది

ఆరో ప్రకరణం – "రాయలసీమ పదకవుల్లో సమాజం" ఇందు రాయలసీమ పదకవుల సాహిత్యంలో ప్రతిబింబించే రాజకీయ, సాంఘిక సాంస్కృతిక వ్యవస్థల్ని వివరించడం

ఉపసంహారంలో సిద్ధాంత వ్యాసంలో పేర్కొన్న విశేషాల్ని సంగ్రహంగా వివరించడం ప్రధానాంశం

## సంఖ్యా సూచిక

| | | | |
|---|---|---|---|
| తరువోజ | — | అద్దంకి శాసనం | (9వ శతాబ్దం) |
| సీసం | — | ధర్మవర శాసనం | ( ,, ) |
| మధ్యాక్కర | — | యుద్ధమల్లుని బెజవాడశాసనం | (10వ ,, ) |
| రగడలు | — | కోరుమిల్లు శాసనం | (11వ ,, ) |

"వీణాగానం వెన్నెల తేట
రాణ మీరగా రమణుల పాట
పేరు చెప్పిన పిన బ్రాహ్మణపాట
జాణలు మెత్తురు జాజర పాట"

తాళ్లపాక కవుల పదసాహిత్య విజ్ఞాన సూచిక (అముద్రితం)

## రాయలసీమ పదకవులు - జీవిత విశేషాలు

కవి జీవితచరిత్ర నిర్ణయానికి ఆ కవి వ్రాసిన కృతులు ఆ కృతులననుసరించి వ్రాసిన ప్రతులు, కవి వంశావళి, కృతి భర్త వంశావళి, ఇతర కవుల ప్రశంసలు, శాసనాలు మొదలైనవి ఉపకరిస్తాయి కాని పదసాహిత్యం వ్రాసిన వారి కాలనిర్ణయం చేయడంలో పై సాధనాలు చాలా తక్కువ ఉన్నవికూడా అస్పష్టం కావడంవల్లను కాల నిర్ణయం చేయడంలో కొన్ని ఇబ్బందులున్నాయి రాయలసీమ పదకవుల జీవితచరిత్ర నిర్ణయంలో కూడ ఇదే ఇబ్బంది ఎదురౌతుంది

రాయలసీమ పదకవుల్ని క్రింది విధంగా విభజించవచ్చు

1 కడప జిల్లా పదకవులు
2 చిత్తూరు జిల్లా పదకవులు
3 కర్నూలు జిల్లా పదకవులు

2 1 కడపజిల్లా పదకవులు

కడపజిల్లాలో క్రింది పదకవులున్నట్లు గుర్తించవచ్చు **తాళ్లపాక అన్నమయ్య, తాళ్లపాక పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య, పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి, దూదేకుల సిద్ధయ్య, ఈశ్వరమ్మ**

2 1 1 తాళ్లపాక అన్నమయ్య

**అన్నమయ్య తాళ్లపాక వంశంలో ప్రథముడు ఈ వంశం వారిని తాళ్లపాకవారని, తాళ్లపాకము వారని, తాళులపాక వారని, తాళపాక వారని, తాళమపాక వారని అనేక విధాలుగా ఎలుస్తారు**

2 1 1 1 వ్యవహార నామములు

తాళ్లపాక అన్నయ్యంగారు, అన్నమయ్యంగారు, అన్నమాచార్యులు, అన్నయ్యగురు, అన్నయార్య, కోనేటి అన్నమయ్యగారు అని వ్యవహారనామములు

2 1 1 2 బిరుదాలు :

పద కవితాపితామహుడు, సంకీర్తనాచార్యుడు, హరికీర్తనాచార్యుడు, ద్రావిడాగమసార్వభౌముడు అనేవి అన్నమయ్య బిరుదాలలో ప్రసిద్ధమైనవి

2 1 1 3 బాల్యం

అన్నమయ్య కడపజిల్లా రాజంపేట తాలూకా తాళ్లపాక గ్రామంలో జన్మించాడు ఈ గ్రామం పేరే ఈ వంశీయులకు ఇంటిపేరుగా నిలిచింది

శ్రీవేంకటేశ్వరస్వామి అనుగ్రహంవల్ల నందకాంశంలో అన్నమయ్య భారద్వాజస గోత్రుడైన నారాయణసూరికి భార్య లక్కమాంబలకు జన్మించాడు అన్నమయ్య చిన్నప్పటి నుండి శ్రీవేంకటేశ్వరుని పేరు చెప్పందే ఉగ్గుపాలు కూడ త్రాగేవాడు కాదు వెంకన్న పేరుచెప్పి జోలపాడందే నిద్రపోయేవాడు కాదు

2 1 1 4 కాలం

అన్నమయ్య కాలం గురించి సాహిత్య లోకంలో అభిప్రాయ భేదాలున్నాయి

శ్రీసాధు సుబ్రమణ్యం శాస్త్రిగారు - అన్నమాచార్యులు అవతరించిన సం॥ము క్రోధి (1424 AD) అని తెలియనగును"[1] అని అభిప్రాయపడ్డారు

కీ॥ శే॥ వేటూరి ప్రభాకరశాస్త్రి గారు - "అన్నమయ్య క్రీ శ 1424 క్రోధి వైశాఖ మాసమున విశాఖా నక్షత్రమున జన్మించినాడు క్రీ శ 1424 క్రీ శ 1503 దుందుభి ఫాల్గుణ బహుళ ద్వాదశి నాడాతడు దివ్యధామమందినాడు"[2] అని అన్నారు

శ్రీచాగంటి శేషయ్య గారు - "అన్నమయ్య క్రీ శ 1408 లో జన్మించినాడు"[3] అని అన్నారు. ఈ అభిప్రాయాన్ని త్రోసిపుచ్చుతూ పై రెండు అభిప్రాయాలతో ఏకీభవిస్తూ—

డా॥ వేటూరి ఆనందమూర్తి గారు - "అన్నమయ్య జననం క్రీ శ 1424 అనుటయే సమంజసం"[4] అని పేర్కొన్నారు

2 1 1 5 విద్యాభ్యాసం

అన్నమయ్యకు అయిదేండ్లు నిండగానే తల్లిదండ్రులు ఉపనయనంచేసి విద్యాభ్యాసానికి చేర్చారు అన్నమయ్య ఏకసంథాగ్రాహియై గురువు చెప్పినపాఠాల్ని ఎప్పటికప్పుడు చెప్పేవాడు అతను ఆడిన మాటెల్ల అమృత కావ్యంగాను, పాడిన పాటెల్ల పరమగానంగాను మారింది అతని విద్యాభ్యాసం కేవలం శాస్త్రమంత్రదగనే జరిగింది

2 1 1 6 తిరుపతి యాత్ర ,

అన్నమయ్యకు తల్లిదండ్రులు అప్పుడప్పుడు పనుల్ని చెబుతుండేవారు. ఒకసారి గడ్డి తెమ్మని చెప్పగా అన్నమయ్య పచ్చికకోస్తున్నప్పుడు చిటికెనవేలు తెగి రక్తం కారింది దీనికి కారకులైన బంధువులపై వైరాగ్యంతో తనకెవ్వరూ లేరని నిర్ణయించుకొని ఎడుకొండల వాని సేవింప తిరుపతి యాత్రికుల వెంట నడిచి తిరుపతి చేరాడు ఆయా దేవతల దర్శించుకొంటూ మోకాళ్ళ పర్వతం చేరాడు అన్నమయ్య బాగా అలసి సొమ్మసిల్లి ఒక రాతిబండపై పడిపోయాడు

అపుడు తలి రూపంలో— అలిమేలు మంగమ్మ ప్రత్యక్షమై అన్నమయ్యను సేదతీర్చి స్వామిని దర్శించుకొనే మార్గాన్ని చెప్పి అదృశ్యమైంది ఆ తల్లి ప్రసాదంతో అన్నమయ్య సారస్వత

ప్రవీణుడై సహజ కవితాధోరణిలో అలిమేలు మంగమ్మపై ఆశుధార. వేంకటేశ్వర మకుటంతో ఒకశతకాన్ని చెప్పాడు ఆ తల్లిఆజ్ఞానుసారం చెప్పులు వదిలి కొండనిఎక్కి అప్పటి ప్రదేశాలన్ని చూశాడు మరుస రోజు స్వామి పుష్కరిణిలో స్నానం చేసి వరాహస్వామిని దర్శించు కొన్నాడు

వేంకటేశ్వరస్వామి గుడికి వెళ్ళేసరికి ఆలయం తలుపులు మూసి వేశారు అన్నమయ్య బాధతో ఒక శతకరూపంలో స్వామిని స్తుతి చాడు ఆలయం తలుపులు వెంటనే తమంత తామే తెరుచుకొన్నాయి. వైఖానసులు అన్నమయ్యను కొనియాడి స్వామిదర్శనం చేయించి ప్రసాదాలిచ్చి ఆశీర్వదించారు

అన్నమయ్య స్వామిని సేవించి ఒక పంచతిన్నెపై ఆసీనుడై యుండగా ఘనవిష్ణువనే యతీంద్రుడు అతని దగ్గరకు వచ్చి స్వామి క్రిందటి రాత్రి స్వప్నంలో అన్నమయ్య రాకనుగూర్చి తెలిపినట్లు తెలియచేసి పంచ సంస్కారాలు నిర్వహించాడు ఆనాటి నుండి అన్నమయ్య అన్నమాచార్యుడైనాడు

2 1 1 7 వివాహం.

తన వారిని, ఇంటిని, తాను పెరిగిన ఊరు ధ్యేమీపట్టించుకోకుండా అన్నమయ్య తిరుమలలో కాలం గడుపుతుండేవాడు కొంతకాలం తర్వాత అన్నమయ్యనువెతుక్కొంటూ తల్లిదండ్రులు తిరుమలవచ్చారు దేవాలయం దగ్గర తన్మయత్వంలో గానం చేస్తున్న కుమారుని చూసి తాళ్లపాక గ్రామానికి రమ్మని ప్రాధేయపడినారు అన్నమయ్య స్వామి ఆజ్ఞానుసారం తల్లిదండ్రులతో తాళ్లపాక చేరుకున్నాడు కొంత కాలానికి అన్నమయ్య తిమ్మక్క, అక్కలమ్మ అనే ఇద్దరు కన్నెల్ని

వివాహమాడి గృహస్థాశ్రమ ధర్మం నిర్వహిస్తూ భగవదారాధనలో తన జీవితాన్ని గడపసాగాడు

2 1 1 8 రాజాశ్రయం

అన్నమయ్య వైష్ణవమతతత్త్వాన్ని సంకీర్తనలద్వారా ప్రచారం చేయసాగాడు అతని భక్తికి, సంకీర్తనల గానరక్తికి ముగ్ధులై తుంబురుడో, నారదుడో అని ప్రజలందరూ కీర్తించారు ఆ వార్త విన్న కడప మండలం ఒంగుటూరును పాలించే సాళువ నరసింగ రాయులు అన్నమయ్యను ఆహ్వానించి సకల సౌకర్యాదులు కల్పించి తనతోటే అన్నమయ్యను ఉండుమని ప్రార్థించాడు వైష్ణవధర్మ వ్యాప్తికి రాజాశ్రయం ఉపకరిస్తుందని అన్నమయ్య అందుకు సమ్మతించాడు

ఒకరోజు ప్రభువు అన్నమయ్యను ఆస్థానానికి పిలిపించి మధురమైన కీర్తన పాడి వినిపించమని సభాముఖంగా ప్రార్థించాడు అన్నమయ్య "వేంకటపతి" మీద ఒక శృంగార పదాన్ని పాడాడు ఆ పాట విని ప్రభువు సంతోషించాడు ఆ పాటలోని కవితగాని, శృంగారభావంగాని కాళిదసా ప్రముఖకవుల్లో కూడ కనిపించదని కీర్తించాడు కాంచనాంబరాలతో అన్నమయ్యను సత్కరించి తన మీద కూడ ఇలాంటి పాట ఒకటి పాడమని కోరాడు అతడు వెంటనే "హరి హరీ" అని చెవులు మూసుకొని హరిని కీర్తించే నా నాలుక నరుని కీర్తించలేదని రాజును తిరస్కరించాడు ఆ మాటకు చిన్నబుచ్చుకున్నరాజ అవమానంతో కుతకుతలాడుతూ, అతనిని "మూరు రాయరగండ సంకెలబంధించి" చెరసాలలో వేయించాడు అన్నమయ్య వేంకటేశ్వరుని గూర్చి ఒక పాట పాడేసరికి సంకెళ్ళూడి క్రింద

వచ్చాయి ఆ వార్త విన్న రాజు ఉగ్రుడై తన సమక్షంలో మరల సంకెళ్ళు వేయించాడు కాని అన్నమయ్య ఒక పాటపాడి విముక్తుడు అయ్యాడు

సాళ్వ నరసింగరాయలు తనతప్పు తెలిసికొని అన్నమయ్యను శరణు జొచ్చాడు అన్నమయ్య ప్రభువును అనుగ్రహించాడు అన్నమయ్య రాజాశ్రయానికి ఇష్టపడక మళ్ళీ తిరుమల క్షేత్రాన్ని చేరుకున్నాడు

అన్నమయ్య మహనీయుడైన శఠకోప మునీంద్రుని ఆశ్రయించి, సకల వేదాంతసారాన్ని అభ్యసించాడు

2 1 1 9 సంతతి

అన్నమయ్యకు తిమ్మక్కవల్ల నరసింహకవి జన్మించాడు అక్కలమ్మ వల్ల పెద తిరుమలాచార్యుడు, నరసమ్మ, తిరుమలమ్మ జన్మించారు ఈ వంశంలోని వారు మూడుతరాల వరకూ పండితులుగా వాగ్గేయకారులుగా ప్రశస్తిగాంచారు ఇప్పటికి ఆ వంశం తామర తంపరగా నిలిచివుంది

2 1 1 10 కృతులు

అన్నమయ్య శృంగార, ఆధ్యాత్మ సంకీర్తనలు, శృంగార మంజరి, పంద్రెండు శతకాలు, ద్విపద రామాయణం, వేంకటాచల మాహాత్మ్యం, సంకీర్తన లక్షణం మొదలైన కృతుల్ని వ్రాశాడు

ద్విపద విశేషమైన మంజరి వృత్తంలో "శృంగార మంజరి" కావ్యం వ్రాశాడు పంద్రెండు శతకాల్లో ఒక "శ్రీవేంకటేశ్వర శతకం" తప్ప తక్కినవి అలభ్యాలు "వేంకటాచల మహాత్మ్యం సంస్కృత

రచన ఇదికూడ అలభ్యం "సంకీర్తన లక్షణం" లక్షణ గ్రంథం సంస్కృతంలో వ్రాసిన ఇది అలభ్యం "ద్విపద రామాయణం" కూడ అలభ్యం

శృంగార కీర్తనలు, ఆధ్యాత్మ సంకీర్తనలు షుమారు ముప్పది రెండు వేలు అన్నమయ్య వ్రాసినట్లు చెప్పవచ్చు అయితే దొరికినవి సుమారు 14,369

2 1 2 తాళ్లపాక పెద తిరుమలయ్య

అన్నమాచార్య, భార్య అక్కలాంబకు జన్మించినవాడు పెద తిరుమలాచార్యుడు

2 1 2 1 వ్యవహారిక నామాలు ,

పెద తిరుమలయ్యకు, పెద తిరుమలయ్యంగారు, అన్నయ తిరుమలార్య, పెరియతిరుమలయ్యంగారు, తిమ్మయ్య, తిమ్మయార్య, తిరుమలాచార్య, తిరుమల గురు, తిరుమల దేశికులు, వేంకటపతి యోగి, తాళ్లపాక తిరుమలయ్య, తిమ్మడు అని వ్యవహార నామా లున్నాయి

2 1 2 2 బిరుదులు ;

"శ్రీమద్వేదమార్గ ప్రతిష్ఠాపనాచార్య, శ్రీరామానుజ సిద్ధాంత స్థాపనాచార్య, కవి తార్కిక కేసరి, శరణాగత వజ్రపంజర అనేవి పెద తిరుమలయ్య బిరుదాలు

2 1 2 3 కాలం ,

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు "1500 ప్రాంతముల జన్మించిన చిన తిరుమలయ్య తండ్రి యప్పటి కిర్వదేండ్ల వాడే యనుకొన్నను

1470 ప్రాంతములో జన్మించిన వారగుట ఇతని నిండు యౌవనము శ్రీకృష్ణదేవరాయల వారి కాలమున గడిచినది"[5] అని చెప్పారు

వేటూరి ఆనందమూర్తి గారు – "అన్నమాచార్యుడు చిన తిరుమలాచార్యునకు బ్రహ్మోపదేశము చేసినాడను అంశమునుబట్టి చిన తిరుమలయ్య జననం క్రీ. శ 1488-90 ప్రాంతమగుననియు, అప్పటికి పెద తిరుమలయ్య గారి వయస్సు 30 ఏండ్లనుకొనినను ఆతని జననము క్రీ శ 1458 ప్రాంతం కాదగుననియు"[6] అని స్పష్టం చేశారు

శాసనాల్ని పరిశీలిస్తే 7 కృష్ణదేవరాయల కాలానికి అతడు పండు బారిన వయసు గలిగినవాడై ఉన్నట్లు తోస్తుంది కాబట్టి పెద తిరుమలయ్య జననం 1458-60 ప్రాంతం అనడం సమంజసం

పెద తిరుమలాచార్యుడు వేదాంత విద్యాప్రవీణుడు సంగీత సాహిత్య సార్వజ్ఞత్వ మంగళ సామ్రాజ్య సుహితుడు వైష్ణవమత ప్రచారదృష్టితో సాహిత్యాన్ని సాధనంగా చేసుకొన్న ధురంధరుడు

2 1 2 I కైంకర్యాలు

మహారపులలో గాని, పదకవులలోగాని దాన్యాలు పుచ్చుకొన్న వారు కనిపిస్తారు గాని, దానకైంకర్యాదులు చేసినవారు అరుదుగా కనిపిస్తారు. వారిలో పెద తిరుమలయ్య ఒకడు ఇతడు దాదాపు 18 శాసనాల్ని వేయించాడు మొదటి శాసనం 30-11-1517 ప్రాంతం నాటిది చివరిశాసనం 10-6-21548 నాటిది మొత్తం శాసనాల్లో రెండు తెలుగు శాసనాలు మిగిలినవి తమిళ శాసనాలు వీటి ఆధారంగా పెద తిరుమలయ్య చేసిన కైంకర్య వివరాల్ని తెలుసుకోవచ్చు కైంకర్యాల్ని నాల్గురకాలుగా విభజించవచ్చు 1) దాన కైంకర్యాలు 2) ఉత్సవ

కైంకర్యాలు 3) నిర్మాణ కైంకర్యాలు 4) ఇతర కైంకర్యాలు 2124 ఒన కైంకర్యాలు .

దాన కైంకర్యాలకు సంబంధించి శాసనాలు పది ఉన్నాయి.

క్రీ శ 1530 శాసనం 8

రాయల్పాడు (అవుకుసీమ) సోమయాజులపల్లె (కొలవాయ్ సీమ) కత్తెంవారిపల్లె (తూపూర్ కంచిగుంటసీమ), తిప్పనపల్లె, ఎర్ర గుండయపల్లె (సిరివోలుసీమ) - సగం గ్రామం మాత్రమే,ఈ నాల్గు నృర గ్రామాల్ని స్వామివారికి దానం చేయడం ఈ శాసనాంశం వీటిద్వారా వచ్చే ఆదాయంతో స్వామివారి ఆలయంలోను, తమ ఇటి ముందును రెండు మంటపాల్ని కట్టించాడు ఆ మంటపాల్లో ఉత్సవ మూర్తికి బ్రహ్మోత్సవ సమయల్లో "ఊంజల్" సేవలు, నైవేద్యాలు జరుగుతుండేవి

క్రీ శ 1532 శాసనం 9

పూండి, సంగమకోట గ్రామాల్ని విజయనగరచక్రవర్తి అచ్యుత రాయలు 1532 కు పూర్వం పెద తిరుమలయ్యకు రాగిశాసనం చేయించి దత్తం చేశాడు ఆ గ్రామాల్ని తిరుమలయ్య 1532 లో తిరువేంగళ నాదునికి దానం చేశాడు అంతేకాక ప్రతిరోజు అళ్ళగప్పిరానార్, తిరుమంజనయప్పుడు 40 తిరుపొంకాలు, 3 యజ్ఞోపవీతాలు, శుక్రవారం సంకీర్తన సమయంలో ఒక పన్నిరుబుడ్డి సమర్పించునట్లు ఏర్పాటు చేయడం ఈ శాసన సారాంశం

క్రీ శ 1539 శాసనం 10

తూపూరు కంచిగుంటసీమలోని వళ్లిపురం గ్రామాన్ని బుక్కరాజు తిమ్మరాజు వద్దకొని పెద తిరుమలయ్య స్వామివారికివ్వడం, దానిమీద వచ్చే 133 వరహాల ఆదాయంతో నిత్యం గోధుమ పణ్యారం స్వామికి

సమర్పించేటట్లు ఏర్పాటు చేయడం ఈ శాసనాంశం

క్రీ శ 1541 శాసనం 11

శ్రీ భండారానికి 450 రేఖల ధనాన్ని దానం చేయడం, కుప్పం, కిలంగుణ్ణం గ్రామాల్ని స్వామివారికి దానం చేయడం ఈ శాసన సారాంశం

క్రీ శ 1544 శాసనం 12

స్వామి వారి భండారానికి 1020 రేఖల ధనాన్ని దానం చేయడం, ఈ ఆదాయంతో 'సాత్తుమురై' ఉత్సవాన్ని నిర్వహించేటట్లు చేయడం ఈ శాసనాంశం

క్రీ శ 1545 శాసనం 13

ముత్యాలవట్టు గ్రామాన్ని స్వామివారికి ఇవ్వడం, దానిద్వారా వచ్చే 280 రేఖల ఆదాయంతో తవపెర కొన్ని ఉత్సవాలు జరిగేటట్లు చేయడం, ఈ శాసనసారాంశం రాజకీయ కలహాల వల్ల అచ్యుత రాయల తర్వాత ఈ గ్రామం మీది ఆదాయం శ్రీభండారానికి చెందకుండా ఆగిపోయింది తిరుమలయ్య ఈ విషయాన్ని అప్పటి ప్రభువులు సదాశివరాయలకు, వ్యవహారజ్ఞుడగు అళియరామ రాయలకు విన్నవించుకొని ఆ గ్రామం మీది ఆదాయన్ని యధావిధిగా క్రీ శ 1545లో శ్రీభండారానికి చెందేటట్లు అనుమతి పొందాడు, ఆ నడుమ కాలంలో 388 రేఖల్ని తన శిష్యుడు శ్రీపతి కొండయ్య 70 రేఖల్ని అదంగా ఇచ్చి పూర్వం జరిగే ఉత్సవాలతో పాటు మరికొన్ని ఉభయాలు కూడా నిర్వహించేటట్లు 1545 జూలై 8వ తేది ఏర్పాటు చేయడం కూడ ఈ శాసనం పేర్కొంటుంది

క్రీ శ 1545 శాసనం,

1545 ఆగస్టు 2వ తేది గండమ తిమ్మాపురం అనే గ్రామన్ని దానం చేడయుడం ఈ శాసన విషయం

క్రీ శ 1517 శాసనం[15]

శ్రీభండారానికి 1500 రేఖల ధనాన్ని దానం చేయడం ఈ శాసన విషయం

క్రీ శ 1531 [16]

విజయనగరాన్ని దర్శించి విఠలస్వామి ఆలయానికి కొంత ధనం దానం చేయడం ఈ శాసనాంశం

క్రీ శ 1534 శాసనం[17]

అచ్యుతరాయల అనుమతితో ఉదయగిరి రాజ ప్రతినిధిగా ఉండిన రామభట్లయ్యచే కడపజిల్లా నందలూరి ఆలయానికి 'అందపూరు' గ్రామం చెండేటట్లు చేయడం ఈ శాసన విషయం

2 1 2 4 2 నిర్మాణ కైంకర్యాలు[1]

నిర్మాణ కైంకర్యాలకు సంబంధించి 8 శాసనాలున్నాయి

క్రీ శ 1535 శాసనం[18]

తిరుమలలో పుష్కరిణి నడుమనున్న నీరాళిమంటపాన్ని కట్టించడం, దాని చుట్టూ ప్రదక్షిణ మంటపాల్ని కట్టించి పరిసరాల్ని బాగు చేయించడం ఈ శాసనాంశం

క్రీ శ 1535 శాసనం[19]

తిరుమల వరాహస్వామివారి ఆలయప్రాకారాన్ని కట్టించడం ఆగ్నేయ దిక్కున ఒక గోపురం కట్టించడం ఈ శాసన విషయం

క్రీ శ 1537 శాసనం[20]

మన్నసముద్రం వద్ద ఒక పొంగలి మంటపాన్ని నిర్మించడం

మంటపంలో ఉత్సవమూర్తి కి బ్రహ్మోత్సవ సమయంలో ఊంజల్ సేవలు నైవేద్యాలు జరిగేటట్లు చేయడం ఈ శాసన సారాంశం

క్రీ శ 1539 శాసనం 21

పుష్కరిణి గట్టుపై ఒక రాతి దీపస్తంభాన్ని నిలబెట్టడం, ప్రతి గురువారం అందు దీపం వెలిగించుటకై జీతగాండ్లను నియమించడం, ముక్కోటి ద్వాదశినాడు ముప్పది రెండు దీపాల్ని పుష్కరిణి గట్టున వెలిగించుటకై ఏర్పాటు చేయడం ఈ శాసన విషయం

క్రీ శ. 1541 శాసనం 22

తిరుమలలో స్వామివారి బంగారు వాకిలికి సమీపములో సంకీర్తన భాండాగారాన్ని నెలకొల్పడం అందు తాళ్లపాక వారి సంకీర్తనల్ని రాగి రేకులపై భద్రపరచడం ఈ శాసనాంశం

క్రీ శ 1545 శాసనం 23

కొండమీద కార్తీకమాసంలో వనభోజనానంతరం ఉత్సవమూర్తి ఆలయానికి వచ్చినప్పుడు పూజ నైవేద్యాలు అందుకోవడానికి స్వామి ఆగుటకై శ్రీభండార నిర్వాహకులు పండ్రెండు గురిపేరిట పంద్రెండు కట్టించడం మంటపాల్ని ఈ శాసన విషయం

క్రీ శ 1535 శాసనం 24

తిరుమల వరాహస్వామి ఆలయంలోని మంటపాన్ని మరమ్మత్తు చేయించడం ఈ శాసన సారాంశం

క్రీ శ 1546 శాసనం 25

ఆళ్వారు తీర్థంలో తీర్థవారి మంటపాన్ని నిర్మించగం గోవింద స్వామి పుష్కరిణి గట్టున సుదర్శన చక్రాన్ని ప్రతిష్ఠించడం ఈ శాసనాంశం.

2 1 2 4 3 ఉత్సవ కైంకర్యాలు :

ఉత్సవ కైంకర్యాలకు సంబంధించి నాలుగు శాసలున్నాయి

క్రీ శ, 1537 శాసనం 26

తిరుమలయ్య కార్తిక మాసంలో 'వనభోజనోత్సవం' జరిపించే వాడు ఈ సందర్భములో తిరుమలయ్య బంధుమిత్రులతో వైష్ణవ సమాజంతో వలస వెళ్లి వనభోజనోత్సవం జరుపుకోవడం ఈ శాస నాంశం

క్రీ శ 1539 శసనం, 27

12 రోజులు జరిగే బ్రహ్మోత్సవాన్ని తిరుమలయ్య 13 రోజులు జరిపించడం, ఆ ఆదిమాసంలో తిరుమలయ్యపేర ఒక ప్రత్యేక బ్రహ్మో త్సవమే ఏర్పాటు కావడం, అచ్యుతరాయలు మొదలగు వారిపేరిట జరిగే బ్రహ్మోత్సవ సమయాల్లో ఇతని పేర కొన్ని ఉభయాలు జరి పించడం ఈ శాసన వివరాలు.

క్రీ శ 1545 శాసనం 28

తిరుమలలోను తిరుపతిలోను 'ఉరి–అడి' అను ఉట్లు కొట్టి వేడు కను నిర్వహించుచుండిరి కొండమీద కాళ్లపాకవారి ఇంటిముంగిటనున్న వేణాడు కృష్ణునకు, తిరుపతిలో గోవింద–కృష్ణునకు పెదతిరుమలయ్య నిర్వహించడం ఈ శాసన విషయం.

క్రీ శ 1533 శాసనం 29

కాంచీ నగరంలో 'అరుళాళ్ పెరుమాళు' నకు పెద తిరుమలయ్య' చిన తిరుమలయ్య కొన్ని ఉత్సవాలనేర్పరిచి నైవేద్యాలు జరిగేటట్లు ఏర్పాటు చేయడం ఈ శాసనాంశం

2 1 2 4 4. ఇతర కైంకర్యాలు !

దీనికి సంబంధించిన శాసనాలు రెండు

క్రీ శ 1536 శాసనం, మరియు 1537 శాసనాలు 30

సాళువ తిమ్మరుసు, ఇతని సోదరుడు గోవిందరాజులు విడివిడిగా వేంకటేశ్వరస్వామికి ఏర్పాటు చేసిన ప్రసాదపు హక్కును వీరిద్దరూ కలిసి తిరుపతి గోవిందరాజస్వామికి ఏర్పాటు చేసిన ప్రసాదపు హక్కును పెద తిరుమలయ్య ,11703 పణాలకు కొనుగోలు చేసి తన శాశ్వతసేవకు నిర్ణయించడం ఈ శాసనాంశం.

క్రీ శ 1536 1537 శాసనాలు 31

గ్రీష్మోత్సవ సమయాల్లో 20 రోజులపాటు 12 రేఖల ఖర్చుతో 'సంకీర్తన అరుళుపాడు'ను ఏర్పాటు చేయడం, ఆ సమయంలో భక్తులకు పన్నీరుబుడ్లు, చందన తాంబూలాదులు ఇచ్చే ఏర్పాటు చేయడం ఈ శాసన విషయం,

2,1 2 5 సంతతి

తిరుమలయ్యకు భార్య తిరుమలమ్మకు చినతిరుమలాచార్యుడు, అన్నయ్య, పెద తిరువేంగళనాథుడు, చిన తిరువేంగళనాథుడు అను అయిదుగురు పుత్రులు. వీరందరూ తండ్రిలాగే సాహిత్యాలలో పేరు గడించారు

2 1 2.6 కృతులు

పెద తిరుమలయ్య శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనలు, వెంకటేశ్వర వచనాలు, శృంగార దండకం, చక్రవాళమంజరి, శృంగార వృత్త శతకం, వేంకటేశ్వరోదాహరణం, నీతి సీసశతకం, సుదర్శన

రగడ రేఫఱకారనిర్ణయం, భగవద్గీత తెలుగు వచనం (ఆంధ్రి వేదాంతం), ద్విపద హరివంశం, సంకీర్తన లక్షణ వ్యాఖ్య, శ్రీవేంక టేశ్వర ప్రభాతస్తవం మొదలైన కృతులిచ్చి వ్రాశాడు

ఇందులో భగవద్గీత తెలుగు వచనం (ఆంధ్రివేదాంతం), ద్విపద హరివంశం, సంకీర్తన లక్షణవ్యాఖ్య అను మూడు కృతులు అలభ్యాలు' మిగిలినవి ప్రకటించడం జరిగింది

అన్నమయ్య వ్రాసిన 'సంకీర్తన లక్షణ' గ్రంథానికి పెద తిరు మలయ్య 'సంకీర్త లక్షణ వ్యాఖ్య' అనే వ్యాఖ్యాన గ్రంథం రాశారు ఇది నేడు అలభ్యం, అంతేగాక తిరుమలయ్య దండకం శతకం, ద్విపద, ఉదాహరణం, రగడ, వచనాలు మొదలైన ప్రక్రియల్లో రచ నలు చేసినట్లు స్పష్టమవుతుంది 'రేఫఱకార నిర్ణయం' అనే లక్షణ గ్రంథాన్ని కూడా వ్రాశాడు

తండ్రి లాగే ఇతడు సంకీర్తనలు కూడా వ్రాశాడు ప్రస్తుతం లభించిన సంకీర్తనలు సుమారు 9 6

పెద తిరుమలాచార్యులు తమిళంలో కూడ కవిత చెప్పగల సమ ర్థుడుగా తోస్తుంది తిరుమల తిరుపతి దేవస్థాన శాసనాలు 4–48 సంఖ్య గల శాసన విషయం చక్కని తమిళ కవితలో నుండడం గుర్తించ దగినది.

2.1 3 తాళ్లపాక చిన తిరుమలయ్య '

తిరుమలాంబ, పెద తిరుమాచార్యుల కుమారుడు చిన తిరుమలా చార్యుడు ఇతనికి అన్నమాచార్యుడే బ్రహ్మోపదేశం (ఉపనయనం) గావించినాడని క్రింది కీర్తనవల్ల స్పష్టమవుతుంది.

తాళ్లపాకన్నమాచార్య దైవమవు నీవు మాకు
మేళ్లమే శ్రీహరిగన నెరవానతిచ్చితివి

గురుడవు నీవే సుమ్మీ కుమతినైన నాకు
సరవి బ్రహ్మోపదేశము సేసితివి
పరమ బంధుడవైన పరికింప నీవే సుమ్మీ
వరుసనేజెడకుండ వహించుకొంటివి (16-1-39)

2 1 3,1 వ్యవహారనామాలు :

చిన తిమ్మయ్య, చిన తిమ్మదీక్షితులు, చిన తిరుమలాచార్యులు చిన తిరుమల దీక్షితులు, చిన తిమ్మ, చినతిరుమలయ్య చిన తిమ్మన్న, చిన తిరుమలయ్యం గారు, పిన తిమ్మదేశికులు, సిరుతిరుమలై అయ్యంగారు, తిరుమల వేంకట దీక్షితులు అని వ్యవహార నామాలు

2 1 3 2 బిరుదాలు

ఇతడు సంస్కృతాంధ్ర భాషలందు మహాకవి మహా విద్వాంసుడు, అష్టభాషాకవి చక్రవర్తి " బిరుదాంకితుడు.

2 1 3 3 కాలం ,

చిన తిరుమలయ్యకు ఉపనయనం చేసినట్లు తెలియవచ్చిన ఆధారాన్ని బట్టి ఇతడు క్రీ శ 1488-90 ప్రాంతంలో జన్మించినాడని చెప్పవచ్చు.

2 1 3 4 కైంకర్యాలు :

చిన తిరుమలయ్య మూడు శాసనాల్ని వేయించాడు వీటి ద్వారా ఇతడు చేసిన కైంకర్యాలని క్రింది విధంగా విభజించవచ్చు, 1) నిర్మాణ కైంకర్యాలు 2) ఉత్సవ కైంకర్యాలు.

2 1 3 4 1 నిర్మాణ కైంకర్యాలు

నిర్మాణ కైంకర్యానికి సంబంధించి రెండు శాసనాలున్నాయి.

క్రీ. శ. 1540 శాసనం 32

తమ అగ్రహారమగు మంగాపురం వేంకటేశ్వర దేవాలయాన్ని మరమ్మత్తు చేయించడం అర్చకులతో, భాష్యకార్లతో, దేశికులతోటాటు తన తాతగారగు అన్నమయ్య విగ్రహాన్ని కూడా ప్రతిష్ఠించడం. పూజా నైవేద్యాలు కూడా ఏర్పాటు చేయడం ఈ శాసన విషయం

క్రీ. శ. 1547 శాసనం 33

తిరుపతి సమీపగ్రామమగు తిరువేంకటాపురంలో "అచ్యుతరాయ పెరుమాళ్ పేట" ఉత్సవ సందర్భములో ఉండుటకై ఒక మంటపాన్ని కట్టించడం, ఈ మంటపంలోని ఒక స్థంభం మీద రఘునాథుని విగ్రహాన్ని చెక్కించడం ఈ శాసనాంశం

2 1 3.4.2 ఉత్సవ కైంకర్యాలు :

ఉత్సవ కైంకర్యానికి సంబంధించి రెండు శాసనాలున్నాయి క్రీ.శ. 1547 శాసనం 34, ఈ శాసన విషయం

తిరుపతిలో గోవిందరాజునకు వైవాహికోత్సవాన్ని వైభవంగా నిర్వహించడం, ఈ శాసనంలో అయిదు రోజుల ఉత్సవ విశేష కార్యక్రమాలుచానికై కావలిసిన సంభారాల వివరాలున్నాయి ఈ ఉత్సవాన్ని వైభవంగా నిర్వహించేందుకు చిన తిరుమలయ్య "సేదియం" అనే గ్రామాన్ని త్రీలండానికి దానం చేయడం కూడ ఈ శాసనం పేర్కొంటుంది

క్రీ. శ 1547 శాసనం 35

చిన తిరుమలయ్య "ఊరి ఆడి" ఉత్సవాన్ని దిగువ తిరుపతిలో ఏర్పాటు చేయడం ఈ శాసనాంశం

2135 సంతతి

చిన తిరుమలయ్య పెద మంగమ్మల కుమారుడు తిరువెంగళప్ప చిన తిరుమలయ్య మత ప్రచారం కొనం సంకీర్తన ప్రచారాన్ని చిత్తూరు, అనంతపురం, కడప, కర్నూలు, నెల్లూరు, గుంటూరు మండలాల్లో చేసినట్లు చెప్పవచ్చు

2136 కృతులు

శృంగార, ఆధ్యాత్మిక సంకీర్తనల్ని, అష్టభాషాదండకం, సంకీర్తన లక్షణం అనే కృతుల్ని చిన తిరుమలయ్య వ్రాశాడు

చిన తిరుమలయ్య సంకీర్తనల సంఖ్యసుమారు 179 అన్నమయ్య వ్రాసిన సంకీర్తన లక్షణానికి తిరుమలయ్య వ్రాసిన సంకీర్తన లక్షణ వ్యాఖ్యానానికి కలిపి "సంకీర్తన లక్షణం" అనే లక్షణ గ్రంథాన్ని తెలుగులో అనువాదం చేశాడు ఇది, అష్టభాషాదండకం కూడ లభ్యం

21.4 పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి

తెలుగులో వేమన యోగి తర్వాత వీరబ్రహ్మం అంతటివాడు, వీరబ్రహ్మం కంసాలి కులస్థుడు.

2141 బాల్యం

వీరబ్రహ్మం బ్రహ్మాండపుర నివాసియైన పరిపూర్ణాచార్యులు ప్రకృతాంబలకు జన్మించాడు కర్నాటకలోమున్న నందికొండ గ్రామ వాసులైన "అనమరల" వీరభోజాచార్యులు వీర పాపమాంబల దత్త పుత్రుడు బ్రహ్మం మొదటి పేరు "వీరనారాయణ" వీరనారాయణ బాల్యంనుండి అతి సూక్ష్మంగా వేదాల్ని అభ్యసించేవాడు అతడు సూక్ష్మగ్రాహి ఎప్పుడు మౌనంగా ఒంటరిగా కూర్చొని ఆలోచించేవాడు

### 2.1.4.2 నామాంతరాలు

వీరబ్రహ్మంగారికి వీరంభట్లు, వీరప్ప, బాలవీరప్ప, వీరనష్టి వెంకటవీరప్ప, వీరాచారి, వీరన్నయ్య, బ్రహ్మము, వీరబ్రహ్మము, వీరబ్రహ్మేంద్రస్వామి, పోతులూరయ్య, శివపోతులూరయ్య, విరాట్ పోతులూరి వీరబ్రహ్మము, వీరగురు పోతులూరి వీరన్న, వీరయ్య దాసు, వీరయ్య, పోతులూరి సుబ్రహ్మణ్యం, వీరలింగయ్య, వీరాస్వామి అనే నామాంతరాలున్నాయి

### 2.1.4.3 కాలం

వీరబ్రహ్మం కాలం వివాదాలతో ముడిపడిన విషయం కొండూరు వీరరాఘవాచార్యులుగారు- "బ్రహ్మం గారి జననం క్రీ.శ 1604 జీవ సమాధి కాలం క్రీ.శ 168..88 అగును దాదాపు క్రీ.శ 1690లో ఆయన జీవితం ముగిసియున్నది"[36] అని అన్నారు

కొడాలి లక్ష్మీనారాయణగారు "క్రీ.శ 1608లో బ్రహ్మంగారు జన్మించి క్రీ.శ. 1693లో జీవసమాధి చెందినట్లు"[37] స్పష్టం చేశారు.

యస్. గోపి గారు- "బ్రహ్మం గారు కర్నూలు, కడప, సిద్ధవట్టం నవాబుల్ని కలిశాడు. ఇది చరిత్రలో ఉంది 17వ శతాబ్దం తొలిరోజుల దాకా కర్నూలు కోట మహమ్మదీయుల వశం కాలేదు అప్పటిదాకా రామలాయుల మనుమడు గోపాల రాజు దాన్ని పాలిస్తున్నాడు బీజ్ పూర్‌సుల్తాన్ పంపిన అబ్దుల్ సాహెబ్ ఖాన్ కర్నూలు ఆక్రమించాడు అతడు పచ్చినుతవాది అతని తరువాత అతని తమ్ముడు మహమ్మద్ రాజ్యానికి వచ్చాడు 1686లో ఇంగ్లీషు వారు వచ్చి ఆక్రమించికునే దాకా బీజపూర్ ప్రతినిధులే కర్నూలును పాలించారు ఈ నవాబుల్లో ఎవరినో ఒకరిని బ్రహ్మం కలిసి ఉంటాడు.

తాళికోట యుద్ధం తర్వాత కడప పరాస్ నవాబులచేతికి వచ్చింది 1713లో అబ్దుల్‌వలీఖాన్ అనే వాడు కడప నవాబు ఇతడు నిజాము నుండి స్వతంత్రించాడు 1640 నాటికి కడప నవాబుల పాలన మొదలైంది 1713నాటికి వలీఖాన్ అనే అతడు తాత మధ్యలో ఉన్నతండ్రి చరిత్రలేదు బ్రహ్మం తండ్రినో, తాతనో కలిసిఉంటాడు 1759 వరకు ఈ నవాబుల పాలన సాగింది

సిద్ధవటాన్ని గోలకొండ నవాబుల ప్రతినిధి పాలించినాడు పై విషయాల ఆధారంగా వీరబ్రహ్మంగారు 17 వ శతాబ్దం చివరిదాకా జీవించినాడని నిర్ణయం చేయొచ్చు"[38] అని వివరించారు

వీరబ్రహ్మం కాలాన్ని గురించి వేర్వేరు అభిప్రాయభేదాలున్నప్పటికి 17వశతాబ్దం మధ్యభాగంలో జీవించినాడనిరాళ్ళపల్లి తేల్చారు[39]

2 1 4 4 నానాదేశసంచారం 1

కాలజ్ఞానంలో "నేనుఉత్తరం ఉద్భవమై 12 సం॥ నందికొండపై తపస్సు చేసి తరువాత ప్రకాశింపగలను" అని ఉంది

వీరబ్రహ్మం తన పండ్రెండవఏట తీర్థయాత్రలకు బయలుదేరాడు

తల్లి నివారిస్తే తన బోధలతో ఆమెను మెప్పించాడు రామేశ్వరం, ధనుష్కోటి, చిదంబరం మొదలైన పుణ్యక్షేత్రాలని దర్శించి కంచి చేరుకొని సూర్యోపాసన చేస్తూ అక్కడ తపస్సుచేసాడు అక్కడ నుండి శ్రీశైలం, మహానంది యాగంటి మొదలైన క్షేత్రాల్ని దర్శించి కర్నూలు జిల్లాలోని బనగానపల్లెకు చేరుకొని అక్కడ "అచ్చమ్మ"గారి వద్ద పశువుల్ని మేపుతుండేవాడు

2 1 4 5 గృహస్థాశ్రమం

బ్రహ్మం తన 31వఏట కడపజిల్లా బద్వేలు తాలూకా కందిమల్లారెడ్డి

పల్లెలో నివాసం ఏర్పరచుకొన్నాడు. అక్కడికి దగ్గరి పెదకొమర్ల గ్రామనివాసి అనుదానవంశస్థుడు, శివకోటయ్య కుమార్తె గోవిందమ్మ వివాహమాడి గృహస్థుడయ్యాడు.

2 1.4 6 సంతతి

బ్రహ్మం గారికి సిద్ధలింగయ్య, గోవిందయ్య, శివరామయ్య, ఓంకారయ్య, పోతులూరయ్య అనే అయిదుగురు కుమారులు వీర నారాయణమ్మ కుమార్తె కుమారులందరికి ఉపనయనం చేయించి విద్యాభ్యాసాలు చేయించి పెళ్ళిచేశాడు.

2 1.4 7 శిష్యులు :

బ్రహ్మం గారి ప్రధానశిష్యుడు దూదేకుల సిద్ధయ్య, ఇతడు కాక బ్రహ్మం శిష్యులు పండ్రెండుగురు

పూదోట రామన్న, చిత్తూరు నరశింహదాసు కొలువ కొటయ్య, మస్తూరి వీరరాఘవులు, కాడిచెర్ల చలమయ్య, కాడిచెర్ల శేషయ్య, గానకరయ్య, దయుతో అహోబలదాసు, సున్నపుగుంట రాఘవులు, మహమ్మదు హుస్సేన్, తరిగొండ భ్రమరాంబ నరహరి, జక్కులేటి కంచిగిరి ఘంటయ్య మొదలైన వారు.

2 1.4 8 కృతులు :

బ్రహ్మం రవ్వలకొండ, యాగంటి గుహలలో (గృహల్లో) కాల జ్ఞానాన్ని వ్రాశాడు అందులోని కొంతభాగం ముద్రితమైంది

బ్రహ్మం సంస్కృతాంధ్ర, కర్ణాటక, ఉర్దూ భాషలు నేర్చిన పండితుడని కొడాలి గారి అభిప్రాయము 40 వీరగురుడు సాంకేతిక యోగ పరిభాషను తేటతెమగున వ్రాయడమే కాక ఆ కాలపు పల్లెల్లో

ఉన్న మూఢవిశ్వాసాన్ని ఖండించడానికి మనోరంజకమగు పాటలు, గేయాలు సంవాదరూపకంగా రచించాడు 41

మేడపాటి వేంకటరెడ్డి గారు — "కాళికాంబ హంస కాళికాంబ"అనే మకుటంతో ఉన్న పద్యాలు "సిద్ధకాళి" అన్న సంబోధనాలతో ఉన్న పద్యాలు సుప్రసిద్ధాలైనట్టివి గోవిందవాక్యాలు, కాలజ్ఞానతత్త్వాలు ప్రజల హృదయాల్లో హత్తుకుపోయినట్లు అందరికితెలుసు ఈనాటి కాలజ్ఞానంలో 12 ఆశ్వాసాలు ఉన్నాయి అని అభిప్రాయపడ్డారు.42

క్రీ శ 1693 వైశాఖశుద్ధదశమి మధ్యాహ్న సమయంలో స్వామి జీవసమాధి ప్రవేశం చేసినాడు

2 1 5 దూదేకుల సిద్ధయ్య

యోగులందు యెన్న వేమన యోగి
యోగి శిష్యులందు పరిపూర్ణ సిద్ధమూర్తి
గురువులందు గురువు వీరగురువే గురువు

వేమనలాంటి యోగిలేడు, సిద్ధయ్య లాంటి శిష్యుడు లేడు, బ్రహ్మ లాంటిగురువు లేడు.

2 1 5 1 బాల్యం

వీరబ్రహ్మం గారి ముఖ్యశిష్యులు ఇద్దరు ఒక్కరు కక్కయ్య మరొకరు సిద్ధయ్య. సిద్ధయ్యనే సిద్ధప్ప అనికూడా అంటారు.

కడప జిల్లా ముడుమాల గ్రామనివాసి పీరుసాహేబు అదంబీబీ లకు సిద్ధయ్య జన్మించినాడు ఇతని మొదటి పేరు సయ్యదు సాహెబ్ గురువులొసగిన పేరు సిద్ధయ్య ఇతడు "షేక్"తెగకుచెందిన మహమ్మ దీయుడు, మహమ్మదీయుడైనా బ్రహ్మం బోధలకు ఆకర్షింపబడి అతని అత్యంత ప్రీతిపాత్రుడైన శిష్యుడైనాడు. హైందవమత ప్రబోధలకు తలఒగ్గిన ఇతనికి ఇస్లామీయుల బాధ తప్పలేదు

బ్రిహ్మం సిద్ధయ్యకు ఎందూ తత్వాల్ని నేర్పి మతభ్రిష్టుణ్ణి చేశా డని కొందరు మహమ్మదీయులు సిద్దవటం నవాబుకు ఫిర్యాదు చేశారు నవాబు బ్రహ్మం గారిని ఆస్థానానికి పిలిపించారు అనేక పరీక్షల తర్వాత బ్రహ్మం తేజస్సుకు, కాలజ్ఞానమహిమలకు ఆకర్షితుడై శిష్యుడై నాడు బ్రహ్మంలాగే సిద్ధయ్య కూడా అవతార పురుషుడని ప్రతీతి

2 1 5 2 పూర్వజన్మ

సిద్ధయ్య మొదటి జన్మంలో కాశీపాలకుడైన విజయ్‌సింగ్‌కు ఆనందసింగ్ అనే పేరుతో పుట్టాడు ఆనందసింగ్ ఒకరోజు వేటాడబోయి ఆవుపై దూకుతున్న పులిని చంపబోయి పొరపాటున ఆవును చంపాడు ఆదోష నివృత్తికోసం బ్రహ్మచర్యం స్వీకరించి సన్యసించి ఆనంద భైరవయోగి, ఆనందయోగి అనే పేర్లతో తీర్థయాత్రలుచేశాడు "హరి హర" అనేచోట అతడు వీరబ్రహ్మ యోగిని కలిశాడు వీరబ్రిహ్మం అతణ్ణి శివాంశసంభూతునిగా భావించి గోహత్యదోషకారణంగా మరు జన్మంలో దూదేకుల సాయిబుల కులంలో జన్మిస్తావని చెప్పాడు అతడే సిద్దప్ప

2 1 5 3 కాలం

సిద్ధయ్య క్రీ శ 1665లో జన్మించినట్లు చెప్పవచ్చు అతడు 16వ యేట బ్రిహ్మంగారి వద్దకు వెళ్ళి ఉపదేశం పొంది 12 ఏండ్లుగా గురు శుశ్రూష చేశాడు క్రీ శ 1693 వరకు గురువుతోబాటు ఉన్నట్లు తెలుస్తుంది 43

సిద్ధయ్య వీరగురుని సమాధి వార్త విని తలబాదుకొనగ బ్రహ్మం దర్శనమిచ్చి యోగదండం, పాదుకల్ని ప్రసాదించి గృహస్థుడవు కమ్మని ఆదేశించాడు సిద్ధయ్య కందిమల్లయ్యపల్లె వదలి "ముదు మూల" గ్రామం చేరాడు

2154 గృహస్థాశ్రమం.

సుదుమాల చేరిన కొంతకాలానికి గురువొసంగిన రాజయోగ సందేశం తలపునకు వచ్చినది అతడు వివాహమాడ నిశ్చయించు కొన్నాడు యచ్చాంబీ అనే సుందరిని వివాహమాడడానికి ఎందరో వచ్చారు కాని సిద్ధయ్యనే వివాహమాడడానికి ఆమె నిశ్చయించుకొంది సిద్ధయ్య తల్లి దండ్రులా విషయం సిద్ధయ్యకు తెలిపారు. సిద్ధయ్య యచ్చాంబీని వివాహమాడి గృహస్థుడైనాడు

2155 సంతతి

యచ్చాంబీ సిద్ధయ్యల కుమారుడు పెదవీరయ్య ఈ నామ కరణం గురువు ఆజ్ఞానుసారమే జరిగింది ఇతన్నే పెదవీరయ్య అని కూడా వ్యవహరిస్తారు పెదవీరయ్య తపస్సు చేసి అనేక మహిమలు ప్రదర్శించాడు పెదవీరయ్య తండ్రిలాగే యోగవేదాంత విషయాలు సమగ్రంగా నేర్చాడు కందిమల్లయపల్లె సమీపం కొత్తపల్లిలో ఇతని మఠం ఉంది

2156 మరో సిద్ధప్ప

దూదేకుల సిద్ధప్పగాక మరో సిద్ధప్ప ఉన్నాడనే అభిప్రాయం పండితలోకంలో ఉంది

పెండ్యాల వేంకట సుబ్రహ్మణ్య శాస్త్రిగారు–"యోగేశ్వర విలాసము అనే మూడు ఆశ్వాసాల ద్విపద కావ్యాన్ని సిద్ధప్ప అనే అతను వ్రాశాడు దూదేకుల సిద్ధప్ప, "యోగేశ్వర విలాస" కర్త సిద్ధప్ప అభిన్నులని" 44 అభిప్రాయపడ్డారు

డా॥ తూమాటి దొణప్పగారు– 'దూదేకుల సిద్ధప్పకు, "యోగేశ్వర విలాస" కర్త యగు సిద్ధప్పకు నామసామ్యమే కాని వీరు భిన్నులని, అన్నారు

2157 కృతులు

బ్రహ్మంగారి వలెనే సిద్ధయ్యకూడా యోగవిశేషాలతో తత్త్వాలు చెప్పాడు సిద్ధయ్య గారి తత్త్వాలు పూర్తిగా లభించడం లేదు కొన్ని తత్త్వాలు మాత్రం ముద్రితం 46

సిద్ధయ్య సిద్ధేశ్వరస్వామి అని ప్రసిద్ధి చెంది తన గురువులాగే జీవసమాధి పొందాడు ముడుమాల గ్రామంలో సిద్ధయ్యగారి మఠం ఉంది.

బ్రహ్మంగారి యోగసాహిత్యాన్ని అదే రీతిగా అందించిన వారిలో మహమ్మద్ హుస్సేన్ ఒకరు బ్రహ్మంగారి శిష్యుల రచనల్లో సిద్ధయ్య మరికొందరి రచనలే నేడు లభిస్తున్నాయి

21.6 ఈశ్వరమ్మ :

ఈశ్వరమ్మ వీరబ్రహ్మం మనుమరాలు, తాతగారికి పలు విష యాల్లో సాటిలేని సలహాలిస్తూ వేదాంత ప్రచారానికి తోడ్పడిన యోగిని ఈమె

216.1. బాల్యం :

కందిమల్లయపల్లె వాస్తవ్యులు గిరియమ్మ గోవిందయ్యల పెద్ద కుమార్తె ఈశ్వరమ్మ ఈమెకు నలుగురు చెల్లెండ్రు, ఒక సోదరుడు చిన్నవయసులోనే మూడురోజులుగా సమాధి నిష్ఠలో నున్న తండ్రిని దాకచక్యంగా మేల్కొలిపింది, ఈమె సాక్షాత్తూ పరమేశ్వరి అవతారం, ఈశ్వరమ్మకు దైవచింతన తప్ప వేరే ధ్యాస లేదు

ఈశ్వరమ్మ చాల అందగత్తె, ఈమెను రాజంపేట తాలూకా "నాగిరపాడు" జమిందారు కుమారుడు రంగరాజు ప్రేమించాడు, అతని

కోరిక తీరకపోగా అగ్నిగుండంలో దూకి ఆత్మాహుతి కావించుకొన్నాడు ఈశ్వరమ్మ అజన్మబ్రహ్మచారిణిగా కాలం గడిపింది

2.1 6 2 కాలం

ఈశ్వరమ్మ కాలానికి సంబంధించి సాహిత్యలోకంలో అభిప్రాయ భేదముంది

చాటకొండ సుబ్బయ్య శిష్టిగారు ఈశ్వరమ్మ గారు సమాధియై సుమారు 130 ఏండ్లుగా నిర్ణయమగుచున్నది అంతకుముందు ఆమె జననము 100 సంవత్సరములు ఈశ్వరమ్మగారు బ్రహ్మంగారు జీవ సమాధి అయిన తరువాత 10 ఏండ్లకు జన్మించినట్లు, స్వామి జీవిత కాలములో ఈమె పుట్టలేదని, ఆమె కాలము క్రీ శ 1705–1803 అని స్పష్టపడుచున్నది 46A అని అభిప్రాయ పడ్డారు

కాలజ్ఞానంలో ఈశ్వరమ్మ జననకాలం కలియుగ సం॥ 4776 అని ఉన్నది, బ్రహ్మంగారు జీవ సమాధి అయినప్పటికి ఈశ్వరమ్మ వయసు 10, 12 సం॥లు

కడియాల వీపూరయాచార్యులు గారు కూడ ఈశ్వరమ్మ బ్రహ్మం సమాధి కాకముందే పుట్టినదని నిర్ణయించారు 46B

ఈశ్వరమ్మ క్రీ శ 1803వ సం॥ మార్గశిర బహుళ నవమి మధ్యాహ్న సమయం "కందిమల్లయపల్లె"లో జీవసమాధి అయ్యింది వీరబ్రహ్మం మఠం సమీపంలోనే ఈశ్వరమ్మ సమాధి

2.1 6 3 కృతులు

ఈశ్వరమ్మ గద్య పద్యగేయ వచనాత్మకాలైన తాత్త్విక సార స్వతాన్ని నిర్మించింది స్త్రీ జనాభ్యుదయానికి అనువయిన పాటలు ఏలలు వ్రాసింది తన తాత లాగే కొంత కాలజ్ఞానం వ్రాసింది మంగా

వాఙ్మయమంతా వ్యవహారిక భాషలో ఉండి పండిత పామరుల ప్రశంస నందుకొంది దేశసంచారం చేసి నలుదిక్కుల జ్ఞాన దీపాల్ని వెలిగించింది

2 2 చిరు జిత్తూల్లా పద కవులు ,

సారంగపాణి, గోవిందసామయ్య, తరిగొండ వెంగమాంబ మొదలైన వారు చిత్తూరు జిల్లాలో పదకవులు

2 2 1 సారంగపాణి '

తెలుగు పదకవుల్లో క్షేత్రయ్య తర్వాత చెప్పదగినవాడు సారంగపాణి ఇతడు చిత్తూరుజిల్లా కార్వేటి నగర రాజులచే సత్కారాలందిన పదకవి

2 2 1 1 కాలం

సారంగపాణి కాల నిర్ణయంలో కూడ భేదాభిప్రాయాలున్నవి మండపాక పార్వతీశ్వర శాస్త్రిగారు- 1963లో ప్రకటించిన సారంగపాణి పదాలకు పమీక్ష వ్రాస్తూ సారంగపాణి 1830 సం॥ వాడని, చిన్నయసూరి సమకాలికుడని అభిప్రాయపడ్డారు 47

నిడదవోలు వెంకటారావుగారు-సారంగపాణి క్రీ శ 1700 ప్రాంతం వాడని పేర్కొన్నారు 48

బాలాంత్రపుర జనీకాంతరావుగారు - సారంగపాణి 1680-1710 ప్రాంతం వాడని చెప్పారు 49

విమర్శకుల అభిప్రాయాల్ని పరిశీలిస్తే సారంగపాణి కాలం 1680-1750 అని నిర్ణయించవచ్చు అని స్పష్టం చేశాడు 50

డా॥ ఎస్, గంగప్పగారు చూపించిన ఆధారాల్ని పరిశీలిస్తే అతని అభిప్రాయం సమంజసమైందిగా చెప్పవచ్చు

3.2.1.2 నివాసం :

కవికాలం లాగే కవి నివాసం కూడా వివాదగ్రస్తమైందే ప్రప్రథమంగా వాగ్గేయకార చరిత్ర వ్రాసిన సుబ్బరామ దీక్షితులుగారు– సారంగపాణి ఉత్తర దేశీయుడైన తెలుగు బ్రాహ్మణుడు గోవిందసామయ్య కూవనసామయ్యలు సారంగపాణి సోదరులని, వారు కార్వేటి నగర వాస్తవ్యులని తెలిపారు. 51

బాలాంత్రపు రజనీకాంతరావుగారు– గోవిందసామయ్య, కూవనసామయ్యలకు సమకాలికుడు, సహచరుడు అయిన సారంగపాణి పేరు ప్రసిద్ధ పదకర్తగా క్షేత్రయ్య పేరుతో బాటు వినిపిస్తూంటుంది 52 అని అన్నారు

కె.జె. కృష్ణమూర్తిగారు–సారంగపాణి చెన్నపురికి దరిదాపుల్లోని పొన్నేరి ప్రాంతానికి చెందినవాడని, చిన్నవయస్సులోనే కార్వేటి నగరం చేరుకొని అచటి వేణుపాలుని పై పదాలు చెబుతుండేవాడనీ, 53 పేర్కొన్నారు

డా॥ ఎస్. గంగప్పగారు–పై రెండు అభిప్రాయలతో ఏకీభవిస్తూ పొన్నేరిలో జన్మించిన సారంగపాణి కార్వేటినగర వాస్తవుడయ్యాడు 54 అని స్పష్టం చేశారు

దివి నరసింహాచర్యులుగారు–సారంగపాణి నివాసం దివి ఘంటసాల పురము 55 అని పేర్కొన్నారు దీన్ని డా॥ ఎస్. గంగప్పగారు త్రోసి పుచ్చారు

పై అభిప్రాయాలన్నీ క్రోడీకరిస్తే సారంగపాణి పొన్నేరి గ్రామానికి చెందిన వాడుగనే నిర్ధారించవచ్చు.

2 2 1 3 సంతతి

సారంగపాణికి పుత్రసంతానం కలిగినట్టు కన్పించదు కాని ఒక అమ్మాయి మాత్రం కలిగినట్లుతెలుస్తుంది. ఇతని దౌహిత్రుడు గరిమెళ్ళ వెంకటసుబ్బయ్య

2 2 1,4 కృతులు :

సారంగపాణి సంస్కృతాంధ్ర భాషా సాహిత్య నిపుణుడనీ, సంగీతాభినయాల్లో సిద్ధహస్తుడనీ అతని పదాల్నిబట్టి చెప్పవచ్చు సారంగపాణి పదాలు 195 మాత్రం ముద్రితం

2 2 2 గోవిందసామయ్య

గోవిందసామయ్య చిత్తూరు జిల్లా కార్వేటినగరం వాస్తవ్యుడు తెనుగు బ్రాహ్మణుడు ఇతనిని కార్వేటినగరాధిపుడు వేంకటపెరుమాళ్లు రాజు బహుకరించాడు ఆస్థాన కవిగా నియమించాడు

2 2 2 1 కాలం *

ఎంజమూరి వరహానరసింహాచార్యులుగారు–"గోవిందసామయ్య కాలం క్రీ.శ 1660 - 1710 అని చెప్పవచ్చు"57 అని అన్నారు

సుబ్బరామ దీక్షితుల గారు– గోవింద సామయ్య కూవన సామయ్య కార్వేటినగర వాస్తవ్యులనీ, సోదరులనీ, సారంగపాణికి సమకాలికులనీ వీరందరు 660 1710 కాలానికి చెందినవారని అభిప్రాయపడ్డారు 58

2 2 2 2 రాజాశ్రమం :

గోవిందసామయ్య తౌర్యత్రికాత్మిక సంగీతంలో అమిత ప్రజ్ఞావంతుడు భరతనాట్య ప్రవీణుడు. ఈయన పదవర్ణన రచనల్ని చేస్తూ నటకులకు మార్గదర్శకుడుగా ఉండేవాడు ఈ పదవర్ణాల్లోని తాళదీక

డల్ని జతులమార్పుల్ని అనుసరించే జతిస్వరరీతులు ఆశ్చర్యం కలి గించేవిగా ఉండేవట "మోహనరాగం"లో "సరిగాదాని" అనేపదవర్ణం వేంకట పెరుమాళ్ళు రాజేంద్రునిదగ్గర నృత్యంతో అభినయించి సన్మానం పొందినట్లు తెలుస్తుంది 59 ఈ వర్ణంగూర్చి మరొక సంగతి — కార్వేటి నగర సంస్థానాధీశుడు వేంకట పెరుమాళ రాజు గారు అతడు వేంకటగిరి రాకుమార్తెను పెండ్లాడనాడు ఆమె వెంకటగిరిలోనే కొంతకాలం రిగ పింది ఎ కారణంవల్లనో వేంకటపెరమాళు రాజు ఆమెను చేర్చుకోలేదు

వేంకటగిరి రాకుమార్తె గురుడు గోవిందసామయ్య, తన "రా కుమార్తె" సంసారం చక్కబడటటం కోసం అతడు రాకుమారిచే మగ వేషం వేయించాడు మోహనరాగంతో కొలువున రాజు గారిని మురి పించాడు రాకుమార్తె నాట్యానికి, గోవిందసామయ్య గానానికి రాజు ముగ్ధుడయ్యాడు

2 2 2 3 కృతులు ‘

గోవిందసామయ్య కేదార, గౌళ రాగాల్లో నవరోజు, ముఖారి రాగాల్లో పదవర్ణాలు చేసి నృత్యం చేసినట్లు తెలుస్తుంది

ఈయన తమ్ముడే కూవన సామయ్య, ఇతడు నాట్యకురింజి రాగంలో "ఇంత అలుక" అనే పదవర్ణన చేశాడు

2 2 3 తరిగొండ వెంగమాంబ

తెలుగులో వెలసిన రచయిత్రుల్లో రచనా బాహుళ్యంచేత భక్తి వేదాంత తత్త్వాలు రమ్యంగా ప్రబోధించడంచేత కవయిత్రుల్లో సాటి లేని మేటి కీర్తి ఆర్జించిన కవయిత్రి తరిగొండ వెగమాంబ

2 2 3 1 బాల్యం :

చిత్తూరు జిల్లా (వాయుల్పాడు తాలూకా) గుఱ్ఱంకొండ మండలం

తరిగొండ గ్రామ వాస్తవ్యులు కృష్ణయార్యుడు మంగమాంబ విరికి శ్రీ వేంకటేశ్వరఅనుగ్రహఫలంగా వెంగమాంబ జన్మించింది ఈమె మొదటి పేరు వెంగమ్మ

చిన్ననాటినుండి వెంగమాంబకు దైవభక్తి అలవడింది తండ్రి వెంగమాంబకు బాల్యవివాహం చేశాడు కొంతకాలానికే ఆమె భర్త చనిపోయాడు,

2 2 3 2 కాలం

సి పి బ్రౌనుదొరగారు–"The Dwipada Bhagavatham ద్విపద భాగవతము also was written by poetess who was living the year 1840"[60] అని అన్నారు వీరేశలింగంపంతులు, వంగూరి సుబ్బారావు పై అభిప్రాయాన్ని సమర్థించారు [61]

కాని తరిగొండ వెంగమాంబ కృతులు – సవిమర్శక పరిశీలనము అనేఅంశంమీద పరిశోధనచేసిన కె జె కృష్ణమూర్తి గారు– వెంగమాంబ స్వీయరచనల ఆధారంగా క్రీ శ 1817వరకు జీవించివదని అభిప్రాయ పడ్డారు

2 2 3 3 తిరుపతి యాత్ర :

వైధవ్యం సంప్రాప్తించిన తరువాత వెంగమాంబ తరిగొండ వదిలి తిరుపతి క్షేత్ర సమీపంలోని "సందెకాపు మొగలిపెంట" అనే కోనను చేరింది,[62] అక్కడ శ్రీవేంకటేశ్వరస్వామిని గూర్చి తపస్సు చేసింది ఒకనాడు శ్రీవేంకటేశ్వరుడు ప్రత్యక్షమై తన సన్నిధికి రావల సిందని ఆనతిచ్చినట్లు ఆమెకు అనుభూతి కలిగిందట, ఆమె తరువాత తిరుమల చేరింది

తాళ్ళపాక తిరుమలాచార్యుల వంశీయులు వెంగమాంబ భక్తి

మహిమల్ని కవితావైశిష్ట్యాన్ని విని సంతోషించి తమ నివాసగృహానికి ప్రక్కనున్న చిన్న ఇంటిని ఆమెకు ఉచితంగా ఇచ్చారు. తాళ్ళపాక వారి పొరుగున ఉండుటవల్ల వారి పూర్వీకుల రచనలతో పరిచయ అవకాశం వెంగమాంబకు కలిగింది.

నేటికి కూడా వెంగమాంబ పేరుతో తిరుమలలో పూజానైవేద్యాలు జరుగుతున్నాయి

2 2 3 4 కృతులు

తరిగొండ వెంగమాంబ రచనలు పదునెనిమిది. ఆమె రచించిన ద్విపద భాగవత అవతారికలో తన కృతుల్ని ఈ విధంగా తెలిపింది

అటు గానఁగనారసింహాంకిత శతక
మటమీద౨నారసింహ విలాస కథయు
నట౩శివనాటకం బదియును గాక
నట౪రాజయోగ సారాఖ్య సద్ద్విపద
నట౫కృష్ణనాటకం బదియును గాక
నట౬పారిజాతాపహరణ సత్కృతియు
నట౭రమాపరిణయంబను పెండ్లి పాట
యటుల౮చెంచునాటకం బను నొక్క కథయు
మఱియును౯శ్రీకృష్ణమంజరి యవల
నిరుపమ౧౦౧౧శ్రీరుక్మిణీ నాటకంబు
కర మొప్పనల౧౨గోపికా నాటకంబు
విరచించి భక్తితో వేంకటశైల
వరమందు తరిగొండ వాసుడై నన్ను
పరిపాలనము సేయు ప్రభువై తనర్చి
కరుణార్ద్ర దృష్టితో గడతేర్తు ననుచు
సరస విజ్ఞాన లక్ష్యము నిచ్చినటి

శ్రీ వాసస్వామి శ్రీ పాదములకు
యూని యర్పించి శివప్పుడు సంతసమునే
ఫలితార్థమైన౼శ్రీభాగవతంబు
నల ప్రథమ స్కంధమాది జేసికొని
క్రమముగా ద్వాదశ స్కంధముల్ వరుస
సమరరచియింతు నంటి నా స్వామి"

వెంగమాంబ తరిగొండ నృసింహశతకం, కృష్ణమంజరి, చెంచునాటకం బాలకృష్ణనాటకం, పారిజాతాపహరణము, శివనాటకం, గోపికానాటకం, రాజయోగసారం, రమాపరిణయం, నారసింహవిలాసం, శ్రీరుక్మిణీ నాటకం, శ్రీభాగవతము రచించినట్లు పై ద్విపదపంక్తులవల్ల తెలుస్తుంది ఆవియేగాక వెంకమాంబ వేంకటాచల మహాత్మ్యము, అష్టాంగయోగ సారము, జలక్రీడావిలాసము, ముక్తికాంతా విలాసము, తత్త్వకీర్తనలు వ్రాసింది

నృసింహశతకం, నారసింహవిలాసం, శివనాటకం, రాజయోగ సారం, కృష్ణనాటకం అనే కృతుల్ని తరిగొండలోను మిగిలిన వాటిని తిరుమల క్షేత్రంలోను రచించింది

వీటిలో నారసింహవిలాసం, రుక్మిణీనాటకం, గోపికానాటకం, ద్విపద భాగవతంలో చివరి ఆరు స్కంధాలు అలభ్యాలు మిగిలినవిలభ్యం

వీటిలో నృసింహశతకం, కృష్ణమంజరి అను రెండు శతకాలు శ్రీభాగవతం పురాణం, రాజయోగసారం, రమాపరిణయం, వాసిష్ఠ రామాయణం, వెంకటాచల మహాత్మ్యం అష్టాంగయోగసారం కావ్యాలు, మిగిలినవి యక్షగానాలు

పై చెప్పబడిన రచనలే గాక వెంగమాంబ ఆయా సందర్భాల్లో ఆశువుగా కూడ పాటలు పాడినట్లు తెలుస్తుంది.

2 3 కర్నూలు జిల్లా పదకవులు

ఈ జిల్లాలో యాగంటికవులు, గుంటువల్లి కోటిలింగయలున్నారు.

2 3 1 గార్లపాటి లక్ష్మణయ్య

యాగంటిపదాలకు కర్త గార్లపాటి లక్ష్మణయ్య ఇతడు వీరశైవుడు

2 3 1 1 కాలం

లక్ష్మణయ్య కాలాన్ని గూర్చి అభిప్రాయభేదం పండితలోకంలో ఉంది

శ్రీచాగంటి శేషయ్య గారు – లక్ష్మణయ్య కాలం తెలియదని బహుశః అతడు 16 వ శతాబ్దివాడు కావచ్చునని అన్నారు 63

శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు – "యాగంటి పదాలలోనున్న "ఆదియే భేవరి చరిత్ర" అను పాటలోని మాటలకూర్పు, భావం, తీర్పు, అన్నమాచార్యాదుల వైరాగ్యపదాల్ని జ్ఞప్తి కి తెస్తున్నాయని అందువల్ల యాగంటివారు తాళ్ళపాక వారికి మునుపటి వారు కావచ్చునని" 64 అభిప్రాయపడ్డారు

డా॥ బాలాంత్రపు రజనీకాంతారావు గారు పై అభిప్రాయాన్ని సమర్థించినా – "పోలికలున్నంత మాత్రాన మునుపటి వారని చెప్ప సాహసింపలేం గాని తాళ్ళపాక వారికి సమీపకాలంలో వారని గాని తరువాతి వారని గాని అనడానికి ఇబ్బంది ఉండదు"65 అనిభావించారు

ఆచార్య బిరుదురాజు రామరాజు గారు – "యాగంటి కవులు కాగి తీయుల కాలంనాటి వారు"66 అని అభిప్రాయపడ్డారు

డా॥ వేటూరి ఆనందమూర్తి గారు – వెఱ్ఱులాల మీకు వేడుకకలిత తేను, అబ్బురంచి తడుకల్లంగ రాదా" అనే పాటలోని అన్నమాచార్యుల గర్హించిన వారిలో యాగంటి వారు కూడ ఒకరు కావచ్చునని, కాబట్టి

గార్లపాటి లక్ష్మయ్య అన్నమయ్యకు సమకాలీనుడు కావచ్చునని ఊహించారు 67

డా॥ ఎస్ గంగప్ప గారు – "గార్ల లక్ష్మణయ్య పాల్కురికి సోమనాథునికి, అన్నమయ్యకునడిమివాడనేసిద్ధాంతాన్నిస్పష్టంచేశారు 68

డా॥ గోపగారు- దూదేకుల సిద్ధయ్యలాగే యాగంటి లక్ష్మయ్యకూడ వీరబ్రహ్మం గారి శిష్యులలో ఒకడై ఉండవచ్చునని ఊహించినారు 69

పండితయ్యను దలచి కీర్తన చేసి
గుండయ్య కొనియాడి కోరికలరా
దండిగ శంకరదాసుమయ్యను దలచి
ఒండారు బసవన్న బొండవే మనసా" (– 2489)

యాగంటి పదాల ప్రతిలోని పైపదాన్ని పరిశీలిస్తే యాగంటి వారు కాకతీయుల కాలంనాటి వారని చెప్పవచ్చు

పై అభిప్రాయాలన్నింటిని క్రోడీకరించగా గార్లపాటి లక్ష్మణయ్య కాలం 14వ శతాబ్దమనే వాదానికే బలమైన అధారాలున్నవి

2 3 1,2 నివాసం :

కవికాలంలాగే కవి నివాసంకూడ వివాదాస్పదంగా ఉంది కారణం గార్లపాడు అనే గ్రామం ఆంధ్రదేశంలో పలుచోట్ల ఉండటం

గార్లపాడు గ్రామం కర్నూలు జిల్లా నందికొట్కూరు తాలూకాలో ఉంది గుంటూరు తాలూకాలో ఒక గార్లపాడు ఉంది, పల్నాడుతాలూకాలో ఒక గార్లపాడు ఉంది కర్నూలు జిల్లా బనగానపల్లె తాలూకాలో యాగంటిపల్లె యాగంటి అనే గ్రామాలు ప్రక్కప్రక్కనే ఉన్నాయి

గ్లారపాడు, యాగంటి రెండును కర్నూలు జిల్లాలోనే ఉన్నాయి

యాగంటి పదాల్ని లక్ష్మణయ్య యాగంటి నంజేశ్వరునికి అంకితం చేశాడు ఈయాగంటి గ్రామంలో "ఉమామహేశ్వరస్వామి"ఆలయముంది ఇతరత్రా వేరే దేవాలయం లేదు

పై కారణాలవల్లనే కర్నూలు జిల్లా బనగానపల్లె తాలూకాలో నున్న యాగంటిపల్లెలో స్థిరపడిన గార్లపాటి లక్ష్మణయ్య గారికి ఉత్తరోత్తరా యాగంటి లక్ష్మణయ్య అనే పేరు వచ్చియుంటుందని డా॥ ఆరుద్ర అభిప్రాయం [10]

2 3 1,3 యాగంటి కవులు

యాగంటి పద ల్ని వ్రాసిన కవులు ఒకరా లేక పలువురా అనే భేదాభిప్రాయం పండితలోకంలో ఉంది దీనికి కారణం యాగంటి పదాలలో రకరకాల ముద్రలుండడమే

1 యాగంటి గురుడు
2 యాగంటి శివుడు
3 యాగంటి లింగడు
4 యాగంటి హరుడు
5 యాగంటి పతి
6 యాగంటి ప్రభువు
7 యాగంటి వరదా
8 యాగంటి శంభుడు
9 యాగంటి నంజేశుడు
10 పిడుపర్తి గురుడు
11 యాగంటి సిద్ధయ్య

పై ముద్రల వల్ల తెలిసే అంశాలు మూడు

1 ఒక యోగి అనేక ముద్రలతో పదాలు వ్రాయడం కావచ్చు

2 భిన్నవాగ్గేయకారులు వివిధ ముద్రలతో పదాలు వ్రాసి ఉండవచ్చు

3 ఒకే వ్యక్తికి పర్యాయ పదాలు కూడ రావచ్చు

పై ముద్రల్లో యాగంటి వంశేశుడు, పిడుపర్తి గురుడు, యాగంటి సిద్ధయ్య అనే మూడు ముద్రలు భిన్నంగా కన్పిస్తాయి వీరు భిన్న వక్తలు కావచ్చు ఇది కేవలం ఊహాసిద్ధాంతం మాత్రమే

యాగంటి పదాల్లో ఎక్కువ భాగం యాగంటి లక్ష్మయ్య వ్రాయడం వల్ల అవి అతని పేరు మీదనే చలామణి అవుతున్నవి

శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలోని "యాగంటి మంగళహారతి" తాళపత్రప్రతి (డి-నెం-2486) ఉంది ఇందులో చివరి చరణంలో

అరుదొంద వృషభవాహనుడు యాగంటీశు
డరయ లక్ష్మీభక్త వరదుడగుచు
వరికింప నేలిన ప్రమథగణ

వరద సాయుజ్య శివ సమూహమునకు_ అని ఉన్నది ఇందులో "లక్ష్మీభక్తవరదు" దనడాన్ని లక్ష్మణయ్యగా ఆరుద్రగారు భావించారు 71

2 3 1 1 కృతులు

మనకు ఈనాడు లభించే అతిప్రాచీన గేయాలల్లో యాగంటి లక్ష్మణయ్య వచనాలే బహుళ ప్రచారంలో ఉన్నవి అవి శైవ సంబంధమైన పదాలు వీటికి సంబంధించి శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారంలో ఆరుతాళ పత్ర ప్రతులున్నాయి 27

మద్రాసు ప్రభుత్వప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారంలో ఆరు కాగితం ప్రతులున్నాయి 73

గార్లపాటి లక్ష్మణయ్య "వీరభద్ర చరిత్ర"ను వ్రాసినట్లు శ్రీబోలిశెట్టి లింగన కవి తన నవ చోళ చరిత్రలో స్పష్టం చేశాడు

వీరభద్రేశ్వరు విజయసాహసమున
వీర రసమున విరచించి తానె
దాతయై కవులకు ధాత్రిలో నుతవి
దాతయై మతి నెఱదాతయై మిగుల
బాటల సద్భక్తి వరులు నుతిసేయు
బాటి కెక్కిన గార్లపాటి లక్ష్మణుని
వెలయగా వినుతించివిజ్ఞానమునను"

(ప్రథమాశ్వాసం, ద్విపద పంక్తులు, 80-87)

గుంటుపల్లి కోటిలింగయ్య

2 3 2 1 కాలం

గుంటుపల్లి నివాసులు అంబరకేసు దూపబసవయ్య, పుత్రుడు కోటిలింగయ్య

కర్నూలు జిల్లాలో మూడు గుంటుపల్లెలుండడం గమనించదగ్గ విషయం బేతంచర్ల మండలంలో ఒకటి, ద్రోణాచలం మండలంలో ఒకటి, వెల్దుర్తి మండలంలో ఒకటి

కృతులు కోటిలింగయ్య వ్రాసిన తత్త్వాలు ముప్పది లభిస్తున్నాయి

సంఖ్యాసూచి

1 TTD Epigraphical Report, Page 280

2 అన్నమాచార్య చరిత్ర పీఠిక, పు 2, 3
3 ఆంధ్రకవిత తరంగిణి, (సంపుటం-8) పు 123
4 తాళ్లపాక కవుల కృతులు-వివిధ సాహితీప్రక్రియలు పు 63, 65
5 అన్నమాచార్య చరిత్ర పీఠిక పు 84
6 తాళ్లపాక కవుల కృతులు-వివిధ సాహితీప్రక్రియలు పు 66
7 (ఎ) తి తి దే శా సం 5-71, క్రీ శ 1546
(బి) తి తి దే శా సం 5-159, క్రీ శ 1558
8 No 6 (No 589 TT) TTD Inscriptions Vol IV Page 14
9 No 14 (No 588 TT) TTD Inscriptions Vol IV, Page 28
10 No 122 (No 587TT) TTD Inscriptions Vol IV Page 223
11 No 155 (No 406 TT)TTD Inscriptions Vol IV, Page 265
12. No 34 (No .93 GT) TTD Inscriptions Vol V Page 87
13 No 47 (No 681 TT) TTD Inscriptions Vol V, Page 104
14 No 55 (No 450 TT) TTD Inscriptions Vol V, Page 141
15 No 122 (No 76 TT) TTD Inscriptions Vol III Page 265
16. (No 8 of 1904)TTD Epi report. Page 283
17 (No 607 of 1907) TTD Epi report Page 291
18 (a) No 40 (No 497 TT) TTD Inscriptions Vol IV, Page 82
(b) No. 41 (No 372 TT) TTD Inscriptions Vol IV Page 83

19 No 1041 (No 497 372 TT) TTD Inscription vol iv Page 83

20 No 100 (No 683 TT) TTD Inscriptions vol iv, Page 191

21 No 129 (No 457 TT) TTD Inscriptions vol iv Page 232

22 No 155(No 155 *TT*) *TTD* Inscriptions vol iv Page 265

23 No 47A (No 397 GT) *TTD* Inscriptions vol v Page 11[illegible]

24 No*4*(No 372 *TT*)*TTD* Inscriptions vol iv Page 83

25 No 68 (*No* **394** " " vol v Page 174

26 *No* 100(*No* 683 ") " vol iv Page 191

27 *No* I29(*No* 457 ") " vol iv Page *232*

*28* *No* 47 (*No* 681 ") " vol v Page 104

*29* (*No* 496 of 1919 ***TTD*** Epi Report Page *291*

*30*, *31* *No* 72 74, 93 of vol iv, ***TTD*** Incsriptions

*32* *No* 144 (*No* 429 *TT*) *TTD* Inscriptions vol iv Page *265*

*33* *No* 99 (*No* *354 TT*) " vol v Page *285*

*34* " " "

*35* " " "

36 కార్మిక యోగి వీరబ్రహ్మం ఆంధ్రపత్రిక దినపత్రిక, జూన్ జూలై మాసాలు.

37 చారిత్రిక దృక్పథంలో శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి,

38 కార్మిక యోగి వీరబ్రహ్మం ఆంధ్రప్రభ దినపత్రిక జూన్, జూలై మాసాలు.

39 వేమన పు 132

10 11 చారిత్రక దృక్పథంలో శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి
12 తెలుగు యోగులు పు 94
13 తెలుగు యోగులు పు 141
44 విస్మృత దత్తమండలకవులు
45 ఆంధ్ర సంస్థానములు- సాహిత్యపోషణము పు 290
46 (a) సుజ్ఞాన రత్నావళి యను వేదాంత కీర్తనలు పు 29
(b) కాలజ్ఞాన తత్త్వములు పు13
46A బ్రహ్మంగారి సంతాన చరిత్ర (5వ ప్రకరణం)
46B బ్రహ్మంగారి నాటకము (యక్షగానము)
47 సారంగపాణి పదములు - సమీక్ష పు 10
48 తెలుగు విజ్ఞానసర్వస్వము- (3వ సంపుటం) పు 1173
49 ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర పు 317
50 సారంగపాణి పదసాహిత్యం పు 8
51 సంగీత సంప్రదాయ ప్రదర్శిని (మొదటి సంపుటం) పు 25, 30
52 ఆంధ్రవాగ్గేయకార చరిత్రము పు 316
53 సారంగపాణి పదాలు స్రవంతి డిశం 1975 పు 10
53ఎ అజ్ఞాతవాగ్గేయ కారుడు-సారంగపాణి-ఆంధ్రపత్రిక డిశ 5 1976
54 సారంగపాణి పద సాహిత్యం. పు 9
55 కృష్ణాస్రవంతి పు 119
56 తెలుగు విజ్ఞాన సర్వస్వం (3వ సంపుటం) పు 1173
57 గోవిందసామయ్య, ఆంధ్రపత్రిక 1945-46 పు 48
58 సంగీత సంప్రదాయ ప్రదర్శిని, (ప్రథమసంపుటం) పు 25, 34
59 గోవిందసామయ్య ఆంధ్రపత్రిక 1945-46 పు 48-49
60 బ్రౌణ్య తెలుగు ఇంగ్లీషు నిఘంటువు 1966, పీఠిక, పుXIX
61ఎ ఆంధ్రకవులచరిత్ర తృతీయభాగం పు 575

ఆ శతక కవుల చరిత్ర పు 128

ఆకోవ నేడు యుద్ధకళ తీర్థమని చెప్పబడి స్థలానికి సమీపంలో ఉంది

ఆంధ్రకవి తరంగిణి పు 233

యోగంటి వచనాల కాలం భారతి (నవం 1961), పు 91, 92

ఆంధ్రవాగ్గేయ కార చరిత్రము పు 452

తెలుగు జానపద గేయ సాహిత్యము పు 417

తాళ్లపాక కవుల పదకవితలు భాషాప్రయోగ విశేషాలు ద్వితీయ భాగం, పు 40-43

తెలుగులో పదకవిత పు. 64

ప్రజాకవి వేమన పు 390

మన వేమన పు 49

మన వేమన పు 52

డి-1785, డి-2230, డి-2190, డి-2491, డి-2495; డి-ఆర్-925

-2189, డి-2491, డి-2192, డి-2193; డి-2196, డి-2498

భారతీయ సాహిత్య శరీరానికి మతమే వెన్నుపూస ఆ కారణం వల్లనే ఆయా మతాల వారు మత ప్రచారానికి సాహిత్యాన్ని ఒక సాధనంగా స్వీకరించారు.

మతమంటే విశ్వాసం మానవునిలోని ఈ విశ్వాసమే పుణ్య పాపాల్ని, స్వర్గనరకాల్ని సృష్టించి మానవునిలోని లౌకిక దృక్పథాన్ని అలౌకికం వైపు మళ్లించి మోక్షాసక్తిని కలిగించింది మోక్షసాధనకు రకరకాల దైవాల్ని ఆరాధించడం వల్ల వివిధమతాలు ఏర్పడ్డాయి

31, ప్రసిద్ధ గ్రంథాల్లో "మతం" నిర్వచనాలు -

ENCYCLOPAEDIA BRITANNICA

'Man s relation to that which he regards as 'holy' need not to be thought of an Supernatural which less as personal, and if the word God be

defined in personal or supernatural terms, It follows that religion includes for more than the relation to God Similarly the them relation' to the holy may be concierned of in a variety of forms

OXFORD ENCYCLOPAEDIC DICTIONARY-

"Human recognition of Super human controling power and esp, of a personal God or Gods entitled of obedience and worship effect of super recognition on conduct or mental attitude

STANDARD COMPREHENSIVE INTERNATIONAL DICTIONARY-

"A belief binding the supernatural of man to a supernatural being, as involving a feeling of dependence and responsibility together with the feelings and practices which naturally flow from such a belief"

తెలుగు విజ్ఞాన సర్వస్వం -

"Religions of the natural life, and if an animist c force

Religions of anthropomorphism and external morality

Religions of the monothesm and reconciliation

Religions of monothestic tendency and ethical dualism

మతం అంటే శాశ్వతమైన అభిప్రాయంతో పరమేశ్వరునితో మానవునికి గల సంబంధమని ఉంది. ఇంకా కోర్కెలు, ప్రవర్తనా ఆచారాలు, అభ్యాసాలు, మత సంబంధాలని అంటారు.

శబ్ద రత్నాకరం ?

అభిప్రాయము, సమ్మతి, శాస్త్రము, సమ్మతము, తలియబడినది పూజింపబడింది [హిందూమతములు-వైష్ణవము, మాధ్వము, స్మార్తము, స్వామిదాసుల-వైష్ణవము. శైవము, శాక్తము, గాణాపత్యము, సౌరము, కాపాలికమ ]

ఆంధ్రప్రదేశ్‌లో ప్రధానంగా హైందవమతంలోని వైష్ణవం, మాధ్వం స్మార్తం శైవం, శాక్తం మొదలైన శాఖలు నిలదొక్కుకున్నాయి గాణాపత్యం సౌరం కాపాలికం మొదలైన శాఖలకు అంతగా ఆదరణ కన్పించదు

3 2 వాగ్గేయకారుల "మత" ప్రశంస

రామదాసు పదకర్తల్లో అన్నమయ్య, వీరబ్రహ్మం, తరిగొండ వెంగమాంబ, యోగంటివారు తమ పదాలలో "మత" ప్రస్తావన చేశారు

అన్నమయ్య

"ఎక్కడి మతము లింకనేమి సాధించేము నేము
తక్కక శ్రీపతి నీవే దయ జూతు గాక" (2-52)
"అన్నిమతములు సరియైతేను వాసితేదా
చెన్నగు పురాణాలు చెప్పగాక" (2-170)

వీరబ్రహ్మం

ఆకాశము పెట్టినాను- పరమతములు వొక్కటేను

లోక మందున జనులు అందరు నీరు అగ్నిలో మునుగు పోదురు
(సుజ్ఞాన రత్నావళి-15)

"ఆఖు మతముల నాగ్రహయించి
ఆఖు మూటిని త్రుంచి వేసి" (సుజ్ఞాన రత్నావళి-25)

తరిగొండ వెంగమాంబ

"రతి రాజు భ9ములచే రట్టయ్యేదేమి
మతి మంతుడై తె ఈ మత భేదమేమి'' (సుజ్ఞాన రత్నావళి-76

యాగంటి కవులు

"మతములు వివిధములాయె మంచి
మతిలేక జనులకు మమతలిట్లాయె" (డి-2494)
"మత మేకమై పంచమార్గుడగు గురుమూర్తి
పతిచేత పూర్వ కర్మములు బాసి" (డి-2494)
"ఆరుమతముల మాయదారుల బోకిల్ల

పేరుల బెట్టు పెద్దలనుకుంట" (డి-2494)

"మతములన్ని ఒకటై ధురభిమానము లేకుండవలె (డి-2494)

3 3 రాయలసీమ పదకవులు - వర్గీకరణ

రాయలసీమ పదకవుల్ని మతదృష్టితో రెండు రకాలుగా విభజించవచ్చు

1 వైష్ణవ పదకవులు 2 శైవ పదకవులు

3 3 1 వైష్ణవ పదకవులు

విష్ణువుని పూజించేవారు విష్ణ్వాధిక్యతను సమర్థించేవారు వైష్ణవు

దీన్నే "వైష్ణవ" లేక "శ్రీసాంప్రదాయం" అని పిలుస్తారు శ్రీయ తే ఇతిశ్రీః భగవంతుని ఆశ్రయించునది అని, అట్లే "శ్రీయతే ఇతిశ్రీః జీవులచే ఆశ్రయింపబడునది అని 'శ్రీ' శబ్దానికి రెండు శబ్దాల వ్యుత్పత్తులు వైష్ణవులు చెబుతారు అందుకే వేదాంత దేశికులు చతుః శ్లోకిలో మొదటి శ్లోకాన్ని వ్యాఖ్యానిస్తూ 'శ్రీవిశిష్టుడు సర్వశేషి యను విష్ణువు' అని చెప్పారు (శ్రీమత యేవ సర్వ విభూతి శేషిత్వం) రామానుజాచార్యులు "శరణాగతి గద్య"లో శ్రీదేవికే శరణాగతులైనారు ఆయన రచించిన బాష్యానికి శ్రీభాష్యమని పేరు ద్వయ మంత్రంలో ప్రతిపాదింపబడిన శ్రీవిశిష్టుడైన విష్ణువే ఈ మతంలో ప్రసిద్ధుడైన దేవుడు

3 3 1 1 రాయలసీమలో వైష్ణవం

రాయలసీమలో వైష్ణవమతం ప్రాచీన కాలంనుండి ఉన్నప్పటికి విజయనగర రాజుల కాలంలో బాగుగా వ్యాప్తి చెందింది క్రి శ 15, 16 శతాబ్దాల్లో చిత్తూరు జిల్లాలోని "తిరుపతి" వైష్ణవానికి ప్రధాన కేంద్రమైంది అదే విధంగా కర్నూలు జిల్లాలోని "అహోబిలం" కూడా ప్రసిద్ధమైన వైష్ణవ కేంద్రం ఈ కాలంలో మారుమూల గ్రామాల్లో సైతం శ్రీరామాలయాలు శ్రీరామభజన మందిరాలు నిర్మించారు

వైష్ణవ భిక్షుక గాయకులు

పూజ గొల్లలు, పెద్దింటి గొల్లలు, గొల్లదాసర్లు, గొల్ల సుద్దులోళ్లు దానదలు, పూసలవాళ్లు గంగెద్దులవాళ్లు, కొమ్ముదాసరి, తప్పెట గుళ్లూ మొదలైనవారు వైష్ణవ సంబంధమైన కీర్తనల్ని, తత్వాల్ని భజనలు చేస్తూ రాయలసీమ ప్రాంతంలో అక్కడక్కడ కన్పిస్తుంటారు

3 3 1 2 రాయలసీమ పదకవుల్లో వైష్ణవులు

రాయలసీమ పదకవుల్లోని వైష్ణవ పదకవులను నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు

1. తాళ్లపాక అన్నమయ్య

2 పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య
3 సారంగపాణి
4 తరిగొండ వెంగమాంబ

1 తాళ్ళపాక అన్నమయ్య

అన్నమయ్యకు పూర్వులు నందవరీకులు వీరు చౌడేశ్వరీ ఉపాసకులు చౌడేశ్వరి తామస ప్రధానమైన దైవం కాని అన్నమయ్య "ఘన విష్ణువు" అనే యతీంద్రుని కాలంలో అతనిచేత పంచసంస్కారాలు పొంది వైష్ణవమతాన్ని స్వీకరించాడు

వచ్చితామసులైన మమ్ము అన్నమయ్య వైష్ణవాన్ని స్వీకరించి సాత్వికులను జేసినాడని చిన తిరుమలయ్య విన్నవించాడు

" వచ్చితామసులు మమ్ము పరమ సాత్వికులుగా
యిప్పటనే సేసినాడు యెంత చిత్రము
యిచ్చగించి మా కులాన నెన్నడు లేని వైష్ణవ
మచ్చముగా గృపసేసె నన్నమాచార్యుడు " (161-25)

హైందవులకు 108 దివ్య తిరుపతులు ఆరాధ్యస్థలాలు వాటిలో "తిరుపతి "అహోబలం" మాత్రం ఆంధ్రదేశంలో ఉన్నాయి మిగిలిన వన్నీ తమిళదేశంలో ఉన్నాయి అందుకే వైష్ణవం అంటే తమిళమతమనే అభిప్రాయం నాటికి నేటికి ఉంది అన్నమయ్య 108 దివ్య తిరుపతులచే కాకుండా విష్ణ్వాలయాలున్న క్షేత్రాల్ని దర్శించి వేంకటేశ్వరఅభేదంగానే కీర్తించాడు పండితులు కూడా మనసా మెచ్చుకొనే విధంగా పదాలు వ్రాయడమే గాకుండా, నానాదేశసంచారం చేసి ప్రజలబాణిలో పాటలు పాడి అందరిని ఆకర్షిస్తూ పరమ వైష్ణవ ధర్మాన్ని స్థాపనగానికి కృషి చేశాడు?

శివస్తుతిలో నమక చమకాదులకు ప్రాధాన్యం ఉంది అద్వైతులు శివపూజలో నమకాలను విధిగా చదువుతారు కాని వైష్ణవుల పూజలలో ఎక్కడా నమకచమకాల ప్రసక్తి కనబడదు స్మార్తుడైన, వైష్ణవంపుచ్చు కొన్నవాడు కావడంవల్ల అన్నమయ్యలోని స్మార్త సంప్రదాయానురక్తి కనిపిస్తుంది మచ్చుకు

" నమక చమక హితనార సింహా
నవనీత చోర శ్రీనారసింహా " (I-259)

అందుకే – శ్రీ గౌరిపెద్ది రామసుబ్బశర్మ గారు – "అన్నమయ్య నందవరీక వంశమునకు చెందిన స్మార్తబ్రాహ్మణుడు కావున అతడు కులానుగతముగా అద్వైతి కాని కొన్ని పట్టులందు వంశక్రమంగా వచ్చిన అద్వైతవాసన జిడ్డు ఈతనిని వదలలేదు ! అని అన్నారు

తమిళవైష్ణవులు విఠలుణ్ణి శ్రీమన్నారాయణునిగా ఒప్పుకోరు విఠలుడు హరిహరమూర్తి అని కొందరి అభిప్రాయం.

అయినా మతసామరస్యం కోసం అన్నమయ్య విఠలుణ్ణి వేంకటేశ్వరుడుగా భావించి కీర్తనలు వ్రాశాడు. మచ్చుకు.

ఎలమి శ్రీ వేంకటేశు డితడే పదారువేల
చెలుతో గూడినాడు శ్రీ విట్ఠలేశుడు
బల్లదపు శ్రీ వేంకటపతిపై పాండురంగాన
వల్లగా నెలకొంటివి జయ విఠలేశ్వరా (10-171)
వెన్నతో శ్రీ వేంకటాద్రి విట్ఠలేశా నీవు
వెన్నుడవు వెయి నామాల విట్ఠలేశా (26-44)

పై పాదాలు అన్నమయ్య మతసామరస్యానికి ముఖ్యతార్కాణం.

పెద తిరుమలయ్య

పెద తిరుమలయ్య "వరవరముని" యను ఆచార్యునివల్ల పంచ

సంస్కారవిధిని పొంది వైష్ణవుడయ్యాడు వైష్ణవమత ప్రచారానికి పాటుబడ్డాడు

పెద తిరుమలయ్య రామనామం ఎంతో పవిత్రమయ్యిందనే భావాన్ని వ్యక్తపరిచాడు

" జయించరే సర్వజనులు యీ నామము - తమ
రపమునో పుణ్యాలకు (పుణ్యులకు) రామనామము
శాంతికరము రామచంద్రనామము
క్రాంతులణచు రామభద్రు నామము
వింత సుఖమిచ్చు రఘువీర నామము - భూమి
చింత దీర్చునదివో శ్రీరామ నామము " (21_43)

చిన తిరుమలయ్య

చిన తిరుమలయ్యకూడ పూర్తిగా వైష్ణవమతావలంబి అందుకే-

" గోవింద గోవింద యని కొలువరె
గోవిందా యని కొలువరె " (16-1-2)

అని ఉద్బోధించాడు

సాగరంపాణి :

సారంగపాణి పూర్తిగా వైష్ణవమతస్థుడు అందుకే సారంగపాణి

" వేణుగోపాలుని విడువము - మరి
వేరే వక్కరిపేరు నుడువము " (సా.ప 157)
" కొలచితే వేణుగోపాల దేవుని
కొలువు కొలువవలెను
తలచితే విష్ణు చరిత్రంబులు తలచుచుండవలెను జనులార
సా ప. 159)

అని కీర్తించాడు.

తరిగొండ వెంగమాంబ

తరిగొండ వెంగమాంబ పుట్టుకతో స్మార్తురాలు తరువాతవైష్ణవాన్ని స్వీకరించింది. అయినప్పటికి శివకేశవుల అభేదత్వాన్ని క్రింది కీర్తనలో స్పష్టం చేసింది.

" శివుడంటే నేమి – కేశవుడంటే నేమి
శివకేశవుల చిత్తస్థితి భేదమేమి
రవిరాజా భ్రమలచే రట్టయ్యేదేమి
మతిమంతుడైతే ఈ మతభేదమేమి " (సుజ్ఞానరత్నావళి-76)

3 3 1 3 వైష్ణవ పదకవులు– మతదృక్పథం
వైష్ణవ పదకవుల రచనల్లో క్రింది లక్షణాలు కనిపిస్తాయి.

1 వైష్ణవ లక్షణాలు చెప్పడం
2 విష్ణ్వాధిక్యతను నిరూపించడం,
3 ఇతరుల మతాన్ని గర్హించడం

3 3 1 3 1 వైష్ణవలక్షణాలు చెప్పడం

అన్నమయ్య, పెదతిరుమలయ్య వైష్ణవులకుండవలసినలక్షణాల్ని స్పష్టం చేశారు

అన్నమయ్య

" మదమత్సరము లేక మనసు పేదైతే
వదరివ యాసల వాడులో వైష్ణవుడు ॥పల్లవి॥
ఇట్టునట్టు దిరిగాడి యేమైనా జెడనాడి
పెట్టరంటా బోయరంటా బెట్టుకలాడి
యెట్టి వారిసైనా దూరి యెవ్వరిసైన జేరి
వట్టి యాసలబడని వాడవో వైష్ణవుడు " (1-59)

పైకీర్తనలో వైష్ణవునికి ఉండవలసిన లక్షణాలను వివరించాడు

" వలెనను వారిదె – వైష్ణవము – ఇది
వలపుదెనేవో – వైష్ణవము
కోరికలుడుగుచు – గుణి నిన్నిటిపై
వైరాగ్యమె వో – వైష్ణవము
సొరెకు గోవము జలము దనలో
వాడించుట వో –వైష్ణవము " (5-230)

వైష్ణవత్వాన్ని పై కీర్తనలలో చెప్పాడు

పెద తిరుమలయ్య

కన్నచారి కెల్లానేలకలుగు వైష్ణవము
వెన్నుని నమ్మగవలె వీర వైష్ణవునకు ॥పల్లవి॥
వరగ బావముగంటె భయము నొందగవలె
నరయ సంసారమందు నరుచి పుట్టగవలె
విరవి భోగములందు వెసట పుట్టగవలె
విరతి గలుగవలె వీరవైష్ణవునకు ॥ కన్న ॥
తలపోసి సుజ్ఞానము ధనమని పుండవలె
వొలసి తననేరాలెప్పుడు దలచగవలె
కలకాల మాచార్యుడే గతియని యుండవలె
వెలిగోర కుండవలె వీరవైష్ణవునకు ॥ కన్న ॥
ఘనమోక్ష మార్గమందు కడురుచి గల్గవలె
పెనగి బాగవతుల ప్రేమ గలుగవలె
తనర శ్రీవేంకటేశుదాసుడై బ్రదుకవలె
వినయము గల్గవలె వీరవైష్ణవునకు ॥ కన్న ॥ (21-328)

పెద తిరుమలయ్య వీరవైష్ణవునకుండవలసిన లక్షణాల్ని పై కీర్తనలో వివరించాడు వైష్ణవ సంప్రదాయంలో తాప, పుండ్రనామ మంత్ర

యాగాలను పంచ సంస్కారాలు చెప్పబడ్డాయి. వీటిని గురుముఖంగా పొందాలి ఇవి రామాయణ, మహాభారత పురాణాదుల్లో, భగవద్గీతలో ఆళ్వారుల దివ్యప్రబంధాల్లో విశిష్టంగా నిరూపింపబడినాయి ఈ సత్యాన్ని పెదతిరుమలయ్య క్రింది పాదాల్లో ప్రస్తావించారు

"హరి ముద్ర ధరించక అర్చించ, పాత్రుడుగాడు
వెరపుగా సోదించి వినుకోండో
యెంచ తావపుండ్రనామ మహిత మంత్ర యాగమని
పంచ సంస్కారము చెప్పె పాంచరాత్రమిది
అంచల శ్రీవేంకటేశు ఆనతినయిదు లక్షలు
సంచితమైన శాస్త్రము చదువుకొండో ॥హరి॥ (21–113)

3 3 1 3 2 విష్ణ్వాధిక్యతను నిరూపించడం

వైష్ణవ పదకవులు దైవమే తమ గొప్పవాడనే సిద్ధాంతాన్ని శ్రీహరియే అన్నిటికి మూలమని కథల ద్వారా వివరించారు

అన్నమయ్య

"పావము పావము వ్రజలాలా
పై పై నిటువలె పలుకకురో
హరియెందు బుట్టినజుడును శివుడును
హరితో సరి దిరనబెట్లు
హరి గొంటలరదు బుట్టిన శిలలివి
సరున బెట్టితే సరి యౌనా" (9–61,

పై పాదాల్లో శ్రీహరి ఆధిక్యతను స్పష్టం చేశాడు అన్నిటికంటె హరిభక్తి మిన్న, అన్నిటికంటె వైష్ణవం మిన్న అని అన్నమయ్య అభిప్రాయం ఈ విషయాన్ని

"సులభమా మనుజులకు హరిభక్తి

వలనొంది మరికదా వైష్ణవుడౌట ॥పల్లవి॥
కొదలేని తపములు కోటానగోటులు
నదన నాచరించి యట మీద
వదిలమైన కర్మబంధములన్నియు
వదలించుకొనికదా వైష్ణవుడౌట" (1-144)

అనే కీర్తనలో స్పష్టం చేశాడు అట్లాగే

విష్ణువొక్కడే - విశ్వాత్మకుడు
విష్ణవమే సర్వంబును
పరమేష్ఠిసేయు - బ్రహ్మాండ సృష్టియు
హరునిలోని సంహారశక్తి
పరగగ నిందునిని-పరిపాలనమును
అరసి చూడ శ్రీహరిమహిమ" (7-111)

బ్రహ్మ చేయు బ్రహ్మాండ సృష్టి, శివునిలోగల జగత్తును సంహరించు శక్తి, ఇంద్రునిలోగల లోక పరిపాలన సామర్థ్యం అన్నియు శ్రీహరి మహిమలే

హరినామమొక్కటే అన్ని వేళల్లో స్మరింపతగిందని అన్నమయ్య భావం దిన్నే

"అకటి వేళల నలపైన వేళలను
తేకువ హరినామమే దిక్కుమరిలేదు
కొఱమాలి వున్నవేళ కులము చెడినవేళ
చెరపడి బరులచే చిక్కినవేళ
వొరపైన హరినామ మొక్కటే గతిగాక
మరచి తప్పినపైన మరిలేదు తెరగు" (5-100)

అనే కీర్తనలో స్పష్టం చేశాడు.

హరిదాసులు ఎట్లు మెలగవలెనో కూడ అన్నమయ్య స్పష్టం చేశాడు

అటువంటి వాడు వో హరిదాసుడు
అటమాటాలు విడిచి నాతడే సుఖి
తిట్టేటి మాటలున్, దీవించేటి మాటలను
అట్టే సరేనని తలచి నాతడే సుఖి
వట్టి చంపే వేళను, పట్టము కట్టే వేళను
అట్టునిట్టు చలించని యాతడే సుఖి"

పెదతిరుమలయ్య

"నీమహిమలన్నిటికి నీలకంఠుడు సాక్షి
దామోదర మమ్ముగావు దాసులము మీకు
కాలకూట విషమమైన గక్కున నరగుటకు
తాలిమితో నీనామ తిరియ మంత్రము
నోలిబాముల వాయి కట్టి నొమ్ముగా ధరించుటకు
అలరి గరుడ వాహనాయుధ ధారణము" (21-116)

ఈశ్వరుని కంటే శ్రీహరి గొప్పవాడనే సిద్ధాంతాన్ని పై పాదాల్లో స్పష్టం చేశాడు

"అన్నిటికి మూలము శ్రీహరియె నుండి
నిన్నవార కన్నవార విచారించుకొనుడి" (21-259)

"నీవల్ల బుట్టను బ్రహ్మ నీవు సేసినదే మాయ
భావించి నీ కుక్షిలోను బ్రహ్మాండాలు"

"భూమి నీ దేవులు నీవు పుట్టించిన దమృతము" (21-7)

బ్రహ్మను, అమృతాన్ని, భూమిని, స్వర్గనరకాల్ని, మృత్యువును శ్రీహరియే సృష్టించినట్లు పెదతిరుమలయ్య పై కీర్తనలో స్పష్టం చేశాడు

"హరిభక్తి గలిగితే అన్నియు ముఖ్యముగా
విరసాచారము లెల్ల వృథా వృథా" (21-56)

నారాయణుని దివ్యనామము దలచలేక
పూరకిళ్ల దీరకళ్ల (?) కొడిగట్టు బాసిరి (21-84)

హరి నామస్మరణ చేస్తే కష్టాలన్ని తొలగిపోతుందనే భావాన్ని పై పాద ల్లో స్పష్టం చేశాడు,

చినతిరుమలయ్య

"వచ్చిగా దెలియకుంటె బహుముఖమై తోచు
అచ్చమై యిన్నియును శ్రీహరి కల్పితములే
కొందరు దిట్టుదురూ కొందరు దీవింతురు
చెందపు సంసారము జూడలివి
కందువ రేయిబగలు గాలము నడచినట్టె
అందరిలో, గలుగు శ్రీహరి కల్పితములే" (16-1-13)

సర్వం శ్రీహరి కల్పించినదే అనే భావాన్ని చినతిరుమలయ్య పై కీర్తనలో అభిప్రాయపడ్డాడు

"వేంకటేశ్వరుడే" సర్వమని అన్నమయ్య చినతిరుమలయ్యకు చెప్పిడట। ఆ విషయన్నే చిన తిరుమలయ్య స్పష్టం చేశాడు

"నీవు గలిగిన జాలు నిక్కము అన్నిగలవు
అవల మాయాచార్యుడానతిచ్చెనయ్యా" (16-1-46)

సారంగపాణి :

సారె సారెకు ముద్ద సాధించవల నోవక
బీరము డిగి యూళ్ళు బిచ్చమెత్తుచు వినకి
శ్రీరామ మంత్రము చిత్తము నందుంచి
ఆరగించడా శివుడు హాలాహలము వట్టి" (సా వ. 137)

శివుడు కూడా శ్రీరామమంత్రాన్ని జపిస్తాడనే విషయాన్ని సారంగపాణి పై పాదాల్లో స్పష్టం చేశాడు

అన్నిటి కంటె సులభంగా హరినామ స్మరణవల్ల మోక్షాన్ని పొందవచ్చు అనే సారంగపాణి క్రింది పాదాల్లో వ్యక్తం చేశాడు

"అన్నిటి కిది సులభమార్గము సుమీ
హరినామ స్మరణ
పన్నగ శయనుడైన వేణుగో
పాలుని సన్నిధికి జేరేటందుకు" (సా వ 182)

అదే విధంగా హరిదాసులను ఏ పాపాలంటవు అనే భావాన్ని కూడా వ్యక్తం చేశాడు

"హరిదాసులను పాపా
లంటవుసుమీ మదిలో నర
కొరలెందుకిక వేణుగోపాలుడైన నర" సా వ. 186)

3 3 1 3 3 ఇతర మతాల్ని గర్హించడం

స్వమత స్థాపనకోసం ఇతర మతాల్ని అన్నమయ్య, చిన్న తిరుమలయ్య గర్హించారు

అన్నమయ్య

ఏదెవ మోక్షము లేదు యెవ్వరికి ననేరు మీ
వేదాంత శ్రవణము వెట్టికి జేసెరా
అంతా బ్రహ్మమైతే నాతుమా వొక్కటియైతే
చింతింప గురుడు లేడు శిష్యుడూ లేడు
ఒంతినే ముక్తుడూ లేడు బద్ధుడు లేడిట్లయితే
వంతుల సత్కర్మమెల్ల వట్ట తపాలాయంటో (8-65)

చిన తిరుమలయ్య

తన తాతలాగే చిన తిరుమలయ్య అద్వైతుల్ని, వాద, జల్ప, వితండ, చలవాదుల్ని గర్హించాడు

" సకల పురాణములు చాటి నిను బొగడగా
తకమతలుగా నల్పార్థము చెప్పదగునా
నిను నిర్గుణడనేటి నీచ జాతులయందే
యొనయు దుర్గుణము దానెంతో
కనకంబు విను మేనుచు కారు నాయంబులను
యొనలేని దుర్వాదుల నేమనగ గలము (16-2-18)

3 3,1 4. వైష్ణవ పదకవులు భక్తితత్త్వం

భక్తి స్వరూపాన్ని తెలుసుకొనేముందు "భక్తి" అంటే ఏమిటో తెలుసుకుందాం

భక్తి – వ్యుత్పత్తి

"భజ్" ధాతువునకు "క్తిన్" అనే ప్రత్యయంచేరగా "భక్తి"శబ్దం ఏర్పడింది "భజ సేవాయాం" అనే ధాత్వర్థాన్నిబట్టి విశుద్ధమైన మనో వాక్కాయ కర్మలతో భక్తుడు పరమేశ్వరుని సేవించడాన్ని "భక్తి" అనవచ్చు

భక్తి – నిర్వచనం

భగవంతునిపట్ల భక్తునికున్నఅపారమైనప్రేమ "భక్తి" అని నారదులు,[2] పూజాదులపట్ల అపారమైన ప్రీతి, అనురాగం, "భక్తి" అని పరాశర పుత్రుడగు వేదవ్యాసుడు [3] భగవత్కళాణ గుణకథల వినడం పట్ల ఉన్న ఆసక్తి "భక్తి" అని గర్గమహర్షి[4] నిర్వచించారు

భక్తి – స్వరూపం

"భక్తి" అనేది ఒక చిత్తపరిపాకం అతిశయమైన ఆనందాను భూతికోసం అంతరాత్మ చేసే అన్వేషణ జీవాత్మ పరమాత్మల అవ్యక్తమైన ఆధ్యాత్మిక రతి, మానవుడు తను మొరపెట్టుకొంటే భగవంతుడు రక్షిస్తాడనే ఆశ భక్తికి ప్రాణం

భక్తి స్వరూపం ప్రేమ ప్రేమ – భక్తి రెండింటికీ అవినాభావ సంబంధం ఉంది. ముక్తికి సాధనంభక్తి అయితేభక్తికిశ్రీకారం ప్రేమ త్రికరణ శుద్ధిగాభగవంతుని ప్రేమించడం భక్తి భక్తిమార్గానికి అందరూ అర్హులే స్త్రీ పురుషభేదం గాని, కులమత సంబంధమైన హెచ్చుతగ్గులు గాని అడ్డురావు పండితుడైనా, పాపియైనా "భక్తి" వల్ల మోక్షాన్ని సాధించవచ్చు

అన్నమయ్య వివిధ భక్తిమార్గాల్ని క్రిందికీర్తనలలో ప్రస్తావించాడు—

నానా భక్తులివి నరులమార్గములు
యేనెపాననైనా నాతడియ్యకొను భక్తి ॥ పల్లవి ॥
హరికీగా వాదించు టది ఉన్మాద భక్తి

పరుల గొలువకుండే పతివ్రతా భక్తి
అరసి యాత్మ గనుట యే విజ్ఞానభక్తి
అరమరచి చొక్కుటే ఆనంద భక్తి ॥ నానా ॥
అతి సాహసాల పూట అది రాక్షసభక్తి
అతని దాసులసేవే అదియె తురీయభక్తి
క్షితిని నొకవని గోరి చేసుటే తామసభక్తి
అతడే గతిని వుండుటది వైరాగ్యభక్తి ॥ నానా ॥
అట్టె స్వతంత్రుడౌట అది రాజసభక్తి
నెట్టన శరణనుటే నిశ్చలభక్తి
గట్టిగా శ్రీవేంకటేశు కైంకర్యమే సేసి
తట్టు ముట్టు లేనిదే తగనిజ భక్తి ॥ నానా ॥ (7-235)

వైష్ణవ ఎదకవులు తమ కీర్తనల్లో తొమ్మిది రకాలైన భక్తి వద్ధతుల్లో శ్రీహరిని కీర్తించారు

1 శ్రవణం

భగవంతుని కల్యాణ గుణకథలను వినడంవల్ల మోక్షం ప్రాప్తిస్తుంది ఈ విషయాన్నే అన్నమయ్య, పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య, సారంగపాణి క్రింది పద్యములలో స్పష్టం చేశారు

అన్నమయ్య

" వినరో భాగ్యము విష్ణు కథ
వెనుబలమిదివో విష్ణుకథ " (9-66)

పెద తిరుమలయ్య

" సకలలోక నివాస నాయక శౌరి మురహరి నరహరి
ప్రకటమాయెను నీగుణంబులు పాలముచ్చవటంచును (23-16)

చిన తిరుమలయ్య

"రామ రామచంద్ర రాఘవా రాజీవలోచన రాఘవా
సౌమిత్రి భరత శత్రుఘ్నులతోడ జయమందు దశరథ రాఘవా"
(16-1-1)

సారంగపాణి

కొలిచితే వేణుగోపాల దేవుని-కొలువు కొలుపువలెను
తలచితే విష్ణు చారిత్రంబులు తలచుచుండవలెను ఓజనులార
(సా 159)

పై పాదాల్లో శ్రవణ భక్తి ప్రతిపాదితం

2 కీర్తనం

భగవంతుని లోకోత్తర క్రియల్ని స్తుతించడం కీర్తనం

అన్నమయ్య

"చాలదా బ్రహ్మమిది సంకీర్తనం మాకు
జాలెల్ల నడగించు సంకీర్తన" (11-3-131)

పెదతిరుమలయ్య

"శాంతి కరము రామచంద్రనామము
భ్రాంతులణచు రామభద్రనామము
జాత సుఖమిచ్చు రఘువీర నామమూ, భూమి
చింత దీర్పునదివో శ్రీరామనామము" (21-43)

చిన తిరుమలయ్య

"నంతె లేక తలచిన జాణలకు

సంకీర్తనమె పో సర్వశాంతి
భవహర మగు శ్రీపతి నామమె
జవకట్టి తలచితే జన్మశాంతి" (16-1-20)

సారంగపాణి

"పాడితే జగన్నాథునిపై పదము బాడుచుండవలెను
ఆడితే పురుషోత్తమునే కొని-యాడుచుండవలెను ఓ జనులారా
(సా వ 159)

అని సారంగపాణి అభిప్రాయం అందుకే

"శ్రీరమారమణీ మనోహర చిరకృపాన్వయ భూషణా
నారదాది మునీంద్ర వందిత నవ్యమణి గణభూషణా
శారదాభ్ర శరీర దానవ జనమదాంబుధి శోషణా
భారత న్వయ పాల వేణుగోపాల దీనజనావనా" (సా 195)

అని కీర్తించినాడు, అదే విధంగా

"పాడవలెను శౌరినామ సంకీర్తన" (సా వ 164)

3 స్మరణం

శ్రవణ, కీర్తనల వల్ల స్మరణ భక్తి కలుగుతుంది సర్వకాల సర్వావస్థల్లో భగవంతుని ధ్యానించుటే స్మరణ భక్తి

అన్నమయ్య

"శ్రీ వేంకటపతి జేరె నాత్మయిది
భావ వికారము పనిలేదు
ద్వైతాధీనము త త్త్వవిచారము
వేవేలు కర్మపు విధులే లేవు" (9_135)

పెద తిరుమలయ్య

"మచ్ఛకూర్మ వరాహ మనుష్యసింహవామనా
యిచ్ఛరామరామ రామ వాతబుద్ధి కలికి" (21-168)

నిరంతరం నామ జపం చేయుట స్మరణం

చిన తిరుమలయ్య

"హరి యచ్యుతా యని యాడరె
పురుషోత్తమా యని పొగడరె
వరమ పురుషా యని పలకరె
సిరి వర యనుచును జెలగరె జనులు" (16-1-2)

సారంగపాణి

చేసితే శ్రీమన్నారాయణ స్మరణ- చేయుచుండవలెను"

(సా ప 159)

"హరినామ స్మరణ సేయకుంటే అవతలగతి యేమి"

(సా ప 167)

హరినారాయణ గోవిందాయని స్మరణసేయవేహా మనసా"
పురుషోత్తమ దామోదర కేశవ భోగిశయన వేణుగోపాల ॥హరి॥
సా ప 174)

తరిగొండ వెంగమాంబ

అరయగ శ్రీతరిగొండ నరహరి
శంకరాచార్యుడే యాచార్యులనరా సతతం"

(సుజ్ఞానరత్నావళి-78)

4 పాద సేవనం

భగవంతుని శరణు జొచ్చి పాదాలను సేవించడం పాద సేవనం.

అన్నమయ్య

విష్ణు దేవుని పాదములె
విద్యా బుద్ధీమాకు
గోవిందుని పాదములె
కోరి యిహ వరములు" (10-149)

ఇహలోక వసతికి కావలసిన వసతులన్నియు శ్రీహరి పాద సేవనం వల్ల కలుగుతుందని అన్నయ్య భావన

అదే విధంగా

"బ్రహ్మ గడిగిన పాదము
పరమ పదము నీ పాదము"

అనే కీర్తనలో విష్ణుని పాద వర్ణన చేశాడు

పెదతిరుమలయ్య

"పలుకగరాని పరబ్రహ్మమా నీకె శరణు
అలవి మీఱినట్టి కాలాత్మకా శరణు
విలసిల్ల బొడ చూపే విశ్వరూపమా శరణు
సలలిత బ్రహ్మండ జానకా శరణు" (21-354)

చిన తిరుమలయ్య :

"కలిగిన యాస యేకాలమున ముదుసును
అలరి విష్ణుని శరణాగ్రదె నిలిచె" (16-1-35)

అదే విధంగా

"ఘనుడైన శ్రీవేంకటనాథుం పాదములు
చనవున జూపితి రాచార్యులాలా" (16-1-28)

సారంగపాణి

"రక్షింపరా వేణుగోపాలానన్ను
పేక్ష సేయకు వేణుగోపాలా
కక్షిగట్టకు వేణుగోపాలా సుంత
కరుణజూడర వేణుగోపాలా" (సా ప 158)

అదే విధంగా

దరిలేక రావణుని తమ్మునివలె మిమ్ముశరణు వేడుకొంటినే
(సా ప, 161)

5 అర్చనం

భగవంతుని ఆర్చా రూపాన్ని పూజించుట అర్చన భక్తి.

అన్నమయ్య '

నిండు మనసే-నీపూజ
అండగోరకుండ-టదియునీపూజ
ఇలదు హరిగల-దందు లేదనేటి
నిందకు బాయుటె-నీపూజ
కొందరు చుట్టాలు-కొందరు పగనే
అందరుకు మాను-టదియె నీపూజ (9-31)

పెదతిరుమలయ్య

"మేలుకో శృంగార రాయమేటి మదన గోపాలా
మేలుకోవే నాపాల మించిన నిధానమా" (28-215)

చిన తిరుమలయ్య

"గోవిందా మేల్కొనవయ్యా
కావించి భోగము కడమానీకు" (16-1-57)

సారంగపాణి

" లాలెనుచు పూచేరు – అలన లింపునను
శ్రీల చెన్నలరు ను – య్యాల పాన్పునను
గోల రుక్మిణి దేవి – కొరి సొంపునను
జాలితో వచ్చె నీ – పై తలంపుననూ " (సా,ప. 198)

6, వందనం

భగవంతుని మహిమిల్ని మనసులో స్తుతిస్తూ వినమ్రుడై ప్రాణా మం గా వించుట వందన భక్తి ఇది భక్తి విశేషమే గాక భారతీయ సంస్కృతికి ఆత్మార్పణ వినమ్రతకు చిహ్నమైసర్వమతాంగీకారమైనది

అన్నమయ్య

" విన్నపమిదే నీకు వేవేలు విధముల
నన్ను గానవే హరి నమోనమో " (11-127)
" నారాయణాయ నమోనమో
నానాత్మనే నమోనమో
గోవిందాయ నమోనమో
గోపాలాయ నమోనమో "

పెద తిరుమలయ్య

" జగదేక విభుడ శతముఖ వందిత
వెగటు విజయముల విజయీభవ
నిగమవినుత సర్వనిలయ నారాయణ
యిగిరించె గృప విజయీభవ " (21-159)

చిన తిరుమలయ్య

" శ్రీవేంకటనాథరూపణ సందిత రఘుకులదీపికా

భావ సంతోష ప్రాపకా అభంగమంజుల చావకా" (16-1-51)

7, దాస్యం

భక్తుడు తాను భగవంతుని సేవకుడని తలంచి స్వామిని సేవించుట. ఈ సేవ్యసేవక సంబంధం, దాసోహం, శ్రీవైష్ణవులకు జీవనాడి' ఆత్మదోషప్రకటన,వినయం, దీనత్వం, యాచన మొదలగునవి దాసభక్తి

అన్నమయ్య

"చేవట్టి నీ శిరసు పూజించె అహమిక కంటె
నీ పాదాలు పూజించె నేను మెక్కుడు
మాపుదా కా నిను గొల్పి మందెమేళ మౌకంటె
దావగు నీ దాసుల శేషత్వమెక్కుడు" (7-249)
"ఇన్ని జన్మము లేటికి హరిదాసు
లున్న పూరదానుండిన జాలు
హరిభక్తుల యింటి యన్నము గొనువారి
వరపునై వుండవనె నన్ను జాలు" (1-367)

పెద తిరుమలయ్య

"ఏమీ నడుగ నొల్ల నెచ్చుకొందు లననొల్ల
కామించి నీవిచ్చితి కైవల్యపదము
పుట్టుగులకు వెరవ భూమిలోన హరినీకు
అట్టె నీ దానుడ నేనై తే చాలు" (21-24)

చిన తిరుమలయ్య:

"బ(వ?)ండించితే గలుగునా పరమాత్ముని దాస్యము
నిండుమతి నుండితేను నెరవేరుగాక" [16-1-30]

సారంగపాణి

"నిన్ను నే విడువాను నీ పేరు మరువను
నీ బంటు బంటై నానూ" [సా.ప, 178]

అదే విధంగా

"జననమెత్తిన మొదలు మనుజుల సేవాయె
పనిబూని నన్నునే పగిది రక్షించెవో" (సా ప 171)

వెంగమాంబ

"సద్వస్తువన దే నన్ను నిలుపరా
సద్గురు నారాయణా దేవా" [సుజ్ఞాన రత్నావళి - 76]

8. సఖ్యం

భక్తుడు భగవంతునియందు మైత్రిని చూపుటయే సఖ్యభక్తి, ఇందు భక్తుడు తన మనస్సులోని అభిప్రాయాల్ని నిర్భయంగా నిస్సంకోచంగా భగవంతునికి విన్నవించుట సఖ్యభక్తి.

అన్నమయ్య

"ఒలువగు దన రూపము చూపెన్
కలదింతయు దన ఘన తెజింగించెన్"

-ఈ కీర్తనలో నరనారాయణుల స్నేహాన్ని అన్నమయ్య స్పష్టంచేశాడు

పెద తిరుమలయ్య

చెలిమి చేయగరాదు చెలిని విడువగరాదు
తలచి బాసలిరాదు తప్పగరాదు
మలసి మన్నించరాదు మన్నించి చెరుపరాదు

పలవరాడు వలచి వదలరాడు [23-167]

ఇందులో కవి సఖ్యభక్తి స్పష్టం

చిన తిరుమలయ్య

"వగయేమి చెలిమేమి్మ్రవలుమారు నిన్ను
పొగడుచునుండేటి పుణ్యునికి" (16_1_48)

సారంగపాణి

నరహరి నీ నామ స్మరణంబె కనరయ్యా
పరమభక్తుల చెలిమి సరిపోదయ్యా [సా వ 171]

9 ఆత్మనివేదనం

భక్తుడు అనన్యభక్తితో సర్వాత్మ సమర్పణ గావించుటే ఆత్మ నివేదన భక్తి

అన్నమయ్య

"సర్వాత్మకుడవు సర్వేశ్వరుడ నా
పూర్వాపరాలు నీకి భువి సమర్పయామి
వేగిలేచి నేజేసే వెడచేత నీ చేత
అగడపు మాటాడిన నది నీమాటె" [9-282]

పెద తిరుమలయ్య

"ధరణీధరా నాతప మనగా నేటిది
యిరవుగ నా మనస్సు మీదెత్తుట యింతే నీకు
పరగగ నాలోని భక్తి యనగా నేటిది
సరగున నా యాత్మము నీకు సమర్పయుణనుటె" (21-407)

చిన తిరుమలయ్య

"తనువు నాదె యనగ తనకు స్వతంత్రమేది
తనువులో తాను హరి(రి) తనువెకాన

"మనకులో యీసుద్ది వరి నమ్మితే జాలు
వెనకముందరలకు విచారమే లేదు" (16-147)

సారంగపాణి

"ధర్మమందు నిశ్చలమతి నుంచి
దయయు శాంత సత్యమున నటించి
నిర్మల జ్ఞాన మాశ్రయించి
కర్మఫలము రామున కర్పించి" (సా ప 174)

వైష్ణవ పదకవులందరు సాధారణంగా రామ, బలరామ, కృష్ణావతారాలకు ప్రాధాన్యమిచ్చినట్లు పై పరిశీలన బట్టి చెప్పవచ్చు

మహా విష్ణువు దశావతారాలన్నింటిని కూడ వీరు కీర్తించినట్లు చెప్పవచ్చు

3 3 2 శైవ పదకవులు

ప్రాచీన వైదిక ధర్మ సంప్రదాయానంతరం గత 3,000 ఏండ్ల నుండి వచ్చిన అవైదిక మతాల్లో శైవమతం ప్రధానమయిందిగా చెప్పవచ్చు

3.3 2 1 శైవపదం–అర్థం

"శివు కళ్యాణే" అనేధాతువు నుంచి శివశబ్దం పుట్టింది[5] "బహుల మేతన్నిదర్శనం" అనే ధాతుపార సూత్రం వల్ల "శివ" అనేది ధాతువుగా అంగీకరింపబడింది "శివస్య–ఇదం ఏవశైవం" శివునికి సంబంధిచిన తత్త్వమే "శైవం"

కళ్యాణ స్వరూపుడైన ఈశ్వరుడే శివుడు "ఈశఐశ్వర్యే" అనే ధాతువు నుంచి ఏర్పడ్డ శబ్దమే ఈశ్వర శబ్దం వైదిక పరమైన 108

నామాలు ఆ సర్వేశ్వరునే సూచిస్తున్నాయి.[6] అందులో 'శక్తి' కూడా ఒకటి

"శక్లు-శక్తౌ" అనే ధాతువునుంచి ఏర్పడ్డదే 'శక్తి' శబ్దం "యః సర్వం-జగత్ కర్తుంశక్నోతి సశక్తిః సర్వజగత్తును నిర్మించే సామర్థ్యమున్న వాడే శక్తి ఈ శబ్దం స్త్రీ, పురుషులకు వర్తించదు

"బృహి-వృద్ధౌ" అనే ధాతువు వల్ల "బ్రహ్మశబ్దం పుట్టింది "బ్రహ" అనే శబ్దానికి కూడా పరమేశ్వరుడనే అర్థం

"విష్ణు-వ్యాప్తౌ" అనే క్రియనుంచి నిష్పన్నమయిందే "విష్ణు" శబ్దం అంతట వ్యాపించి ఉండేవాడు విష్ణువు

పైన చెప్పిన శివుడు, శక్తి, బ్రహ్మ, విష్ణు అనే నామాలన్ని సర్వేశ్వరుడైన పరమాత్మకే చెందుతాయని వేదాలు చెబుతాయి

శైవంలో అనేక పంథాలున్నాయి పాశుపతం, కాలాముఖం కాపాలికం, అనేవి శైవ పంథాలు ఒక్కొక్క పంథాని స్వీకరించి వాటి వ్యాప్తికి గతంలో తోడ్పడినారు

3 3.2 2 రాయలసీమలో శైవ మతం

రాయలసీమలో శైవమతం ఎప్పటినుండి వ్యాప్తి పొందిందో చెప్పడం కష్టం కాకతీయ రాజులకాలంలో కర్నూలుజిల్లా శ్రీశైలం ప్రసిద్ధమైన శైవ పుణ్యక్షేత్రం పాశుపత శివాచార్యులు (గౌడ దేశంలోని గోళకి మఠానికి చెందిన శివాచార్యులు) కర్నూలుజిల్లా "త్రిపురాంతకం" కడపజిల్లా "పుష్పగిరి" ప్రాంతాల్లో మఠాల్ని స్థాపించారు ఈ మఠాలకు గోళకీ మఠాలని, వాటి అధిపతులకు గోళకి మఠ శివాచార్యులని పేరు చిత్తూరుజిల్లా శ్రీకాళహస్తి కూడ ప్రసిద్ధమైన శైవ పుణ్యక్షేత్రం దీనికి "దక్షిణకాశి" అని కూడా పేరు. కాకతీయుల తర్వాత

ఈ మతం కొద్దిగా క్షీణించినా ఈనాటికి రాయలసీమ ప్రాంతంలో శైవ మతస్థులు లేక పోలేదు

శైవ భిక్షుక గాయకులు

శారదగాళ్లు, బహురూపులు, కాటిపాపలు, బైరాగులు తోలు బొమ్మలవాళ్లు, ఒగ్గులు, బీరప్పలు, పిచ్చికుంటవాళ్లు జంగాలు, మైలారు భటులు, మొదలైన వారు శైవ భిక్షుకగాయకులు వీరు శివ గీతాలు పాడుతూ, శివకథలు చెబుతూ, తోలుబొమ్మయి-ఆడుతూ, ఆడిస్తూ, పగటి వేషాలు వేస్తూ రాయలసీమ ప్రాంతంలో ఈ నాటికి అక్కడక్కడా తిరుగుతుంటారు

3 3 2 3 రాయలసీమ పదకవుల్లో శైవులు

రాయలసీమ పదకవుల్లోని శైవ పదకవులను అయిదు రకాలుగా వర్గీకరించవచ్చు

1 యాగంటి కవులు
2 వీరబ్రహ్మం
3 దూదేకుల సిద్ధయ్య
4 ఈశ్వరమ్మ
5 గుంటుపల్లి కోటిలింగయ్య

1 యాగంటి కవులు

యాగంటి కవులు వీరశైవులు వారి స్వామి యాగంటి నంజేశుడ యాగంటి పదాలు యాగంటి నంజేశునికి అంకితాలు యాగంటి స్వామికి ప్రీతిపాత్రమైన మంత్రం నమశ్శివాయ యాగంటి కవులు ఈమంత్రాన్నే జపించి ధన్యులయ్యారు,

గురుదెత్తిన యానప్త కోటి మంత్రములలో
అశయశివమంత్రంబు అధికమనగనే

వెరపెంపుగా చతుర్వేద వేద్యంబైన
పరమ శివమంత్రంబు పరియింపవలదా
కరకంఠ నామములు వరియింపవలదా
హరహర శివశివ అనియేటి మంత్రంబు
విరిదిగా చెవులార విన్నయంతనే" (డి-2489)

అంతే గాక

"ఏటి శైవము మరియేటి వైష్ణవ వ్రతము
యేటి యా రూపంబు యేటి మార్గములు" (డి-2481)

అనే సందేహాన్ని వెలిబుచ్చాడు.

వీరబ్రహ్మం

వీరబ్రహ్మం నారాయణ అంశతో జన్మించినవాడు కాని వీర బ్రహ్మాం గారిని దత్తత తీసుకొన్నవారు వీరశైవులు,కాబట్టి "వీరశైవులు" అనే పదంలో "వీర" అనే పదానికి నారాయణ అనే పదాన్ని కలిపి 'వీర నారాయణ' అనే పేరు పెట్టారు

వీరబ్రహ్మం శైవులకు ప్రీతి పాత్రమైన "ఓంనమఃశివాయ" అనే మంత్రాన్ని జపించాడు

"ఓం నమఃశివాయ సిద్ధమైన పదవి
ఓంకార మేదిరా ఓరి" (సుజ్ఞాన రత్నావళి-1)

"శివపంచాక్షర మంత్రం-వరశివ యోగులకే జపసూత్రం
అవిరళ యోగం బందిన వారికి-అతింటి మీద చిద్రూపం"
(సుజ్ఞానరత్నావళి-2)

వీరబ్రహ్మం వీరశైవుడైనను నారాయణ అంశతో జన్మించిన వాడగుటచే

నడిమి కంటిలోన నారాయణుడున్నాడు-నాతులారా
మడుగులో దీపము మరి వెలుగుచున్నది- ముగువలారా
(సుజ్ఞాన రత్నావళి-8)

అని కీర్తించాడు

అంతేగాక శివకేశవులకు అభేదత్వాన్ని క్రింది పాదంలో చెప్పాడు

"శివగోవిందా గోవిందా" (కాలజ్ఞాన తత్త్వాలు) వీరబ్రహ్మం మత సామరస్యం కోసం మహమ్మదీయుడగు సిద్ధయ్యకు జ్ఞానోపదేశం చేశాడు అగ్రవర్ణజుడైన అన్నాజయ్య నుండి అంత్యవర్ణజుడైన కక్కయ్య వరకు తనశిష్యులుగా చేసుకొన్నాడు సర్వసమతాను రూపమైన సిద్ధాంతాలను, బోధనలను వినిపించాడు అప్పటి ప్రభువుల మతం "ఇస్లాం కాగా ప్రజలది హైందవం వీరబ్రహ్మ ఇటు ప్రజలతోను, అటు ప్రభువులతోను సామరస్యం కుదిర్చాడు

దూదేకుల సిద్ధయ్య

సిద్ధయ్య పుట్టుకతో మహ్మదీయుడు హైందవుడైన వీరబ్రహ్మంల గారి బోధనలకు తలవొగ్గి అతని శిష్యుడైనాడు మత సామరస్యానికి పాటుబడినవాడు

మానవులందరిది ఒకే కులం అని చాటి చెప్పిన ధీరశాలి

ఈశ్వరమ్మ

ఈశ్వరమ్మ వీరబ్రహ్మం మనుమరాలు అజన్మబ్రహ్మచారి వంశాను గతికంగా వస్తున్న శైవాన్ని ఆదరించినా మతసామరస్యానికి పాటుపడింది

కోటిలింగయ్య

కోటిలింగయ్య శైవపరమైన తత్త్వాలు చెప్పాడు వాటి ఆధారంగా ఇతడు వీరశైవుడు అని చెప్పవచ్చు

3,3 2 4 శైవ పదకవులు–మత దృక్పథం

శైవ పదకవుల రచనల్లో క్రింది లక్షణాలు కన్పిస్తాయి

1, శైవ లక్షణాలు చెప్పడం
2 శైవాధిక్యతను నిరూపించడం
3, శివునికి భక్తునికి అభేదత్వం చెప్పడం

4, పూజలు చేయడం

5, రూపారాధన

3 3,2 4 1 శైవలక్షణాలు చెప్పడం

వీర శైవులు లింగాన్ని ధరిస్తారు నిజమైన వీరశైవునికి ఉండ వలసిన లక్షణాల్ని యాగంటివారు

తనువుపై లింగంబు ధరించుటకు గురుతు
మనసు లింగమునందు మత్తిల్లవలదా
మనసు లింగమునందు మత్తిల్లుటకు గురుతు
తన ఇంద్రియములు ఈశునివి గావలదా
లింగధారుల మనుచు లెక్కచేయరు గాక
లింగమును ప్రాణమును తల్లీనము గావలదా (డి-2489)

అనే పద్యల్లో స్పష్టం చేశారు

3 3 2 4 2 శైవాధిక్యతను నిరూపించడం

తాము నమ్మిన దైవం యొక్క లోకోత్తరకార్యాలను, అధిక్యత లను కీర్తించడం దీన్నే గుణారాధన అని కూడ అంటారు ఇది రెండు రకాలు,

1 శ్రుతి ప్రమాణం

భారతీయవాఙ్మయంలో ప్రాచీనమైనవి వేదాలు వేదాలు ప్రత్యే కంగా వివిధదేవతాస్తుతి కేంద్రాలు ఆ వేదాల్లోని సూక్తుల్ని ఆధారంగా తమ నమ్మిన దేవతా ఆధిక్యతను నిరూపించడం శ్రుతి ప్రమాణం యాగంటి కవులు ఇటువంటి ఆధిక్యతల్ని వివరించారు మచ్చుకు

"భర్గోదేవస్య వరగధీ మహీ యనుచు
భర్గుడే దైవమని శ్రుతులు"

"మహా శివాయ రుద్రాయ యని యంటు
సహజముగా శ్రుతులందు చాటుచుండు"
"విశదముగా శ్రుతులలో విశ్వేశ్వరా యనుచు" [డి- 2489]

2 పురాణ ప్రమాణం

భారతీయ వాఙ్మయంలో ప్రధానమైనవి పదునెనిమిది పురాణాలు కొన్ని పురాణాలు శివాధిక్యాన్ని స్పష్టం చేస్తాయి బ్రహ్మ సృష్టికారకుడని, విష్ణువు స్థితికారకుడని, శివుడు లయ కారకుడని ప్రసిద్ధి ఈ త్రియంలో శివ విష్ణువులకు స్వతంత్ర్యం ఉంది బ్రహ్మమాత్రం విష్ణువు కొడుకని ప్రసిద్ధి, బ్రహ్మకు రుద్రుడు పుట్టాడని కూర్మపురాణం తెలుపుతుంది, యాగంటివారు ఈ కథాంశాన్ని తిరస్కరించారు

"మతిభూని నిటల భూమధ్యంబునను బ్రహ్మ
అతిశయముగా శివధ్యానుడై నంతన్
అతని ముందరను ప్రత్యక్షమై వరమిచ్చు
నతడు బ్రహ్మకు పుట్టెనను ద్రోహి కలడా
బ్రహ్మాది పశువులకు పతియైన పరశివుని
బ్రహ్మ పుత్రుండనెడి పాతకులు గలరా" (డి-2494)

పరమశివుని ఇతర దేవతలు కూడ స్తుతించినట్లు యాగంటి వారి అభిప్రాయం

"సర్వేశ ఈశ యని సద్భక్తితో బ్రహ్మ
సర్వంబు ఈశుండిని సన్నుతించెన్"
"స్వర్గాధిపతి ఇంద్ర సర్వదేవతలెల్ల
అర్ఘ్యమభిషేక మంత్రాదులిత్తురు" (డి-2486)

ఇంకా వాయుదేవుడు, ఈశాన్యుడు నవగ్రహాలు వేదోక్తి భక్తిచే ప్రణుతింతురని చెప్పారు

3 3 2 4 3 శివునికి భక్తునికి అభేదత్వం

యాగంటివారు, వీరబ్రహ్మం, కోటిలింగయ్య శివునికి, భక్తులకు లింగానికి అంగానికి భేదంలేదని విశ్వసించారు

యాగంటివారు

"కలితమగు సిడికంఠమనెడి నామంబు
గలిగినంతనే శివుడు గాక యుండెడి నా
వలదెరంగుల శివుడు భక్తుడను నామంబు
గలిగినంతనే శివుడు గాక యుండెడినా" (డి-2494)

అదే విధంగా

"సంగతముగా తన యిష్టలింగమున కంగము వేరే కలదా
అంగము ప్రాణము నైన భక్తుని చిదాంగము అంగము కాదా"
[డి-2489]

వీరబ్రహ్మం

"నిదురపోక చూడరా – నీలోనే దేవుడురా
పదిలముగను నిదురబోయి – వరమువదమే చేరరా"
[సుజ్ఞాన రత్నావళి - 27]

కోటి లింగయ్య

"అంగలింగ సంగమెరుగరా లింగాంగమెరిగి
లింగదేహ భంగ మరయరా" (పెద్దవాక్యములు – తత్త్వాలు 15)

3 3 2 4 4 పూజలు చేయడం

భగవంతుని స్మరిస్తూ సేవలు పూజలు చేయడాన్ని కైంకర్యం అని అంటారు పూజలు చేసేటపుడు భగవంతుని యొక్క రూపాన్ని, గుణాన్ని, నామాన్ని స్మరిస్తారు

యాగంటివారు, ఈశ్వరమ్మ ఇటువంటి పూజాలు చేశారు

యాగంటి వారు

"పూవులు గావలెరా - శివునికి పూజ చేయవలెను
పువ్వులు గావలె పుణ్యశరీరికి
పావన బుగ్గ వరదేశయ్యకు" (డి-2494)

అదే విధంగా—

"శరణని వేడెదను జడలలో శంభుని జూడగా
హరుడే గురుడని ఆత్మలో ఉంచిక
మరువక తనలో మానసపూజకు" (డి-2494)

ఈశ్వరమ్మ

"అందమైన పూలు గోశాము
ఆత్మారాముని పూజసేశాము"
"భావా భావము నిండుజూశాము
భక్తజనుల సంతోషము చేశాము
భావమందు గురుని దలుశాము
భక్తితో హరిపూజ జేశాము" (సుజ్ఞాన రత్నావళి - 19)

3 3 2 4 5 రూపారాధన ·

భక్తులు తాముపూజించే దైవమే సర్వమని, అతని మూర్తిలో విశ్వమంతా ఉందని తలచడం సహజం యాగంటి వారు, వీరబ్రహ్మం గారు తమ దైవంయొక్క విగ్రహాన్నిమాత్రంఆరాధించలేదు విగ్రహాన్ని కేంద్రంగా భావించి విరాట్‌రూపుడైన పరమశివుని ఆరాధించారు

యాగంటి వారు

"మున్ను విశ్వమంతయు నీ కన్నులై యుండగా జూచు
కన్నులన్నియు నీ కన్నులే గావా

కమ్ముల బుట్టిన రావికమ్ములకు తేజమైన
కమ్ముల లోపలివి నీ కమ్ములే కావా"

అది విధంగా—

అన్నియును నీవే నీకన్న యితరములేదు

"నీవు కల్పించినది నిఖిల వస్తువులెల్ల" (డి-2495)

సర్వం ఈశ్వరుడనే భావన పై పాదాల్లో స్ఫురిస్తుంది

వీరబ్రహ్మం

చిల్లర రాళ్ళకు మ్రొక్కుచునుంటే – చిత్తము చెడిపోనాదెయొరే
ఒక్క బ్రొద్దులని యుండుచునుంటే – ఒనరుగ చెడుదుపు ఒరేయురే
ఏకమైన యా వైభవమూర్తిని ఋూచుచు ముందుట నరేనరే"

(సుజ్ఞాన రత్నావళి – 6)

విగ్రహారాధనను ఖండించి ఆ పరమేశ్వరరూపాన్ని కీర్తించాలని బ్రహ్మం గారి భావన

ఇంతవరకు రాయలసీమ పదకవుల మతదృక్పథాన్ని పరిశీలించడం జరిగింది వీరిలో "వైష్ణవమతం", "శైవమతం" అనే భేదం ఉన్నప్పటికి పదకవులందరు మతసామరస్యానికి పోటుపడినట్లు చెప్పవచ్చు శివకేశవులకు అభేదత్వం చెప్పినట్లు వీరి రచనల ఆధారంగా గమనింపవచ్చు అందరూ సమానమే అనేభావనను వీరు వ్యక్తపరిచారు మచ్చుకు—

"తందనాన అహి తందనాన పురె
తందనాన భళా తందనాన ॥ పల్లవి ॥
బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొక్కటే ॥తంద॥ (71–51)

అనే కీర్తనలో పరబ్రహ్మమయమైన జగత్తులో తెగలుగా తెగలుగా విభజించి న్యూనతాధిక్యతల్ని చూపవలసినవి ఏవిలేవు కాబట్టి "అందరూ సమానులే" అనే సిద్ధాంతాన్ని అన్నమయ్య వ్యక్తపరిచాడు

# సంఖ్యా సూచి

1 ఆధ్యాత్మ సంకీర్తనలు-సంపుటం 1, పీఠిక పుట-34

2 సాత్మస్మిన్ పరమప్రేమరూపా (నారదభక్తిసూత్రములు-2)

3 "పూజాదిష్వనురాగ ఇతిపారాశర్యః" (నారదభక్తిసూత్రములు-1-16

4 'కథాదిష్వితి గర్గః' (నారదసూత్రములు-1-17)

5 ధాతుపాఠం (10-336)

6 సత్యార్థ ప్రకాశంలో సూచించినవి

7 పూర్వాగాథాలహరి - పుట-307



# రాయలసీమపదకవులు - కవితా శిల్పం

కథకు, కల్పనకు అవకాశమిస్తూ చిత్రవిచిత్ర రచనా శిల్పంతో పండితుల మధ్య రాజాస్థానంలో పీఠం వేసుకొని కూర్చొనేవాడు కవి శాస్త్ర పరిధి, వ్యంగ్యపై భవం మహాకవుల ప్రతిష్ఠను నిలిపేవి అయితే జానపద గేయకవుల పరిధి స్వతంత్రం వారు కోరుకొనేది సామాన్య ప్రజల మెప్పు వాస్తవికతకు దగ్గరగా రచన చేయడం వారి ధర్మం, ధ్యేయం కూడా

జానపద కవులు లాగే వాగ్గేయకారుల లక్ష్యమెల్లా సామాన్య ప్రజా జాగృతే ప్రజలు దేన్ని ఆదరిస్తారో ప్రజలకు ఎలా చెబితే రుచిస్తుందో తెలిసినవారు వాగ్గేయకారులు ప్రజల భాషను కీర్తన భాషగా, కృతి భాషగా మార్చుకొన్నవారు అయితే వీరిలో కొందరు వాగ్గేయకారులు మహాకవులలాగే చిత్ర విచిత్ర కవితా శిల్పంతో రచనలు కూడా చేశారు అలాగే సామాన్య ప్రజల మనస్సులను కవ్వించే పదాలను వ్రాశారు

కవితా శిల్ప దృష్టితో పరిశీలిస్తేరాయలసీమ పదకవులలో తాళ్లపాక కవులు ఒక తరగతికి చెందినవారు మిగిలినవారు మరొక తరగతి చెందినవారు తాళ్లపాక కవులు, సారంగపాణిల కంటె మిగిలిన వాగ్గేయకారులు సామాన్యజనానికి మరీ దగ్గరి వారు

రాయలసీమ పదకవుల పదాల్లోని కవితా శిల్పాన్ని రచనాశిల్పం వర్ణనాత్మక శిల్పం, పరిశిష్టమని విశాలదృక్పథంతో పరిశీలించవచ్చు

1 1 రచనా శిల్పం

పల్లవి, అనుపల్లవి, చరణాలు ఒకదానికొకటి పరస్పరానుబంధం గలిగి ఉండి భావుకతకు అవకాశమిచ్చిన రచన రాయలసీమ పదకవుల్లో అన్నమయ్య, పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య, సారంగపాణి, యాగంటికవులు, ఇలాంటి రచనలు చేశారు

అన్నమయ్య

అలరులు గురియగ నాడెనదె
అలకల గులుకుల నలమేల్మంగ ॥పల్లవి॥

అరవిరి సొబగుల నతివలు మెచ్చంగ
అరతెర మరుగున నాడెనదె
వరుస పూర్వదువాళపు తిరుపుల
హరిగరగింపుచు నలమేల్మంగ" ॥అలరు॥ (3-24)

పెద తిరుమలయ్య

ఇంత నేరకుండిన న దేటి యింతి
వింత చెలుల వెరపు విడిఎంచె దింతి ॥పల్లవి॥
తనిసిన మగవాని తమరేంచినదే యింతి

కొన్నగోష్ఠి సోకు లియ్యకొనజేసినదే యింతి
కమ్మనూహాఘుంధి నిద్దుర కళలోఁగూడిన ధీమతి
తనవేళుపు పిమ్మట తలపించే దింతి (23-42)

చిన తిరుమలయ్య

సూరవద్దు తాగవద్దు నోరు చేదుగావద్దు
చేరువనొక చోట సంజీవి వున్న దిదివో ॥పల్లవి॥
కాలమెల్లా దిరిగాడి కాడిబడనేవద్దు
తలకక్క గడ్డపార తవ్వవద్దు
వలవని వాగుల వంకల వెదకవద్దు
వెలిగి వొకచోట సంజీవి వున్నదిదివో ॥సూర॥ (16-1-54)

సారంగపాణి

పిలుచుక రావమ్మా – సామి నీవేళ ॥పల్లవి॥
నెలతా ఈ వంటి వెన్నెల తాళజాలనిక ॥అనుపల్లవి॥
మానవతి చెలులుగా నీకు స–మానమెవ్వరు వట్టి యీ అను
మానమెందుకు చిన్ననాటి భి–మాన మిప్పుడైన మదినెంచి
॥పిలుచు॥ (సా.వ 12)

మాగంటి కవులు :

కలిమి బలిమి వయసురా – కాముని భాగ్యమురా
కలువ కాడవంటి దేహము కలలో నమ్మకురా ॥పల్లవి॥

మాయా నాటకమ్మురా – మతి దప్పి తిరుగకురా
చేయగల ధర్మమ్ములన్నియు భక్తి సత్యమ్ము నిల్పరా ॥మాయ॥

వంతెనెలవు గదరా _ సంసారము నిత్యము గాదురా
సత్యమని తెలుసుకోరా – నమసిపోయె దేహమురా ||మాయా||

భోగములు యెన్నిరా – రోగములు అన్నిరా
భోగరోగములచేత పోయేటి దేహమురా ||మాయ ||

పట్టులేని పంతమురా, వట్టి దానంతమురా
పుట్టి పెరిగి యంతలోనే – పోయేటి దేహము రా ||మాయ||
ఆరుమూడు వదలరా – ఐదు వదిలవరచరా
చేరి యోగంటీశు మీద చిత్తము మరవకురా ||మాయ||

[శి – 2489]

కీటన్నిటిలోను భావైక్యంలో ఒక అనుసంధానపద్ధతి కనిపిస్తుంది పైగా ఒక్కొక్క చరణం విశిష్టభావ సంకలితంగా చేనికది వేరుగా కూడా విభజించడానికి వీలుగా కనిపిస్తుంది ఈ స్వభావం రాయలసీమ పద కవుల రచనల్లో కనిపించే విశిష్టలక్షణం

4 2 వర్ణనాత్మక శిల్పం

రాయలసీమ పదకవులందరు సామాన్యంగా ఆధ్యాత్మిక శృంగార సంకీర్తనలు వ్రాశారు వీరిలో తాళ్ళపాక కవులు, సారంగపాణి కీర్తనల్లో ఈ విభాగం స్పష్టంగా గుర్తించవచ్చు ఇతర కీర్తనలలో ఆధ్యాత్మికతకే ప్రాధాన్యమివ్వబడింది వీరి రచనల్ని ఆధ్యాత్మిక శృంగార వర్ణనలని విడదీయడానికి వీలుంది

4,2 1 ఆధ్యాత్మిక వర్ణనలు

ఈ వర్ణనలలో తాను నమ్మిన స్వామి వర్ణన, స్వామికీ సం౦ం

ధించిన ఉత్సవాలు. నీతి వైరాగ్య తాత్త్వికాలు చోటు చేసుకొన్నాయి

4211, స్వామివర్ణన

రాయలసీమ పదకవుల్లో తాళ్ళపాక కవులకు ఆరాధ్యదైవం శ్రీ వేంకటేశ్వరుడు సారంగపాణి నమ్మిన దైవం వేణుగోపాలుడు యాగంటికవుల ఆరాధ్యదైవం పరమశివుడు మిగిలిన వారు ఒక్కడే దైవమని నమ్మినవారు వీరు ఆయా దైవాలపట్ల ఉన్న భక్తిభావం వల్ల స్వామిని, స్వామిలోకోత్తర క్రియల్ని అనేక విధాలుగా వర్ణించారు

అన్నమయ్య

వైష్ణవులకు "విష్ణువు" ఆరాధ్యమూర్తి నోరునొవ్వంగ హరికీర్తి నుడవటం వారి లక్ష్యం ఆ కీర్తి కథనానికి స్వామి దశవతార వర్ణనలు మూలకందాలు

వాగ్గేయకారులలో దశావతారాలను అనేక రీతుల్లో వర్ణించినవాడు అన్నమయ్య

ఈతెకు నీకుదగు నీడు జోడులు
వాకచ్చి మిమ్ము బొడగ వనమా యొరులకు ||పల్లవి||

ఒట్టిగొన్న నీ దేవులు చంద్రముఖి గనక
అట్టె నిన్ను రామచంద్రుడన దగును
చట్టమై కృష్ణవర చూపుల యాపె గనుక
చట్టుకొని నిన్ను కృష్ణుడ ననదగును ||ఈతె||

చందమైన వామలోచన యాపె యోగమునకు
అందరు నిన్ను వామనదన దగును
చెంది యూకె యప్పటిని సింహ మధ్య గనక
అంది నిన్ను నరసింహుడని పిల్వదగును (30–552)

రామకృష్ణ, వామన, నారసింహ మొదలైన అవతారనామాలు ఈ అవతారాలన్నిటికి కాని అన్నమయ్య ఆ అవతారనామాల్ని నాయిక వల్ల కలిగిందిగా చమత్కరించి వర్ణించడం ఈ కీర్తన ప్రత్యేకత అదే విధంగా–

పుడమి నిందరికట్టె – భూతము కడు
బొడవైన నల్లని – భూతము ॥పల్లవి॥

కినిసవోడ మింగెడి – భూతము
పునుక వీపుపెద్ద – భూతము
కనలి కవియు చీ–కటి భూతము
చొనుగు సోమపు–మోము భూతము (11-3-43)

భూతాలు అనేవి చీకటిలో తిరుగుతుంటాయి వాటి ఆకారం భయంకరంగా అసహ్యంగా ఉంటుంది అన్నమయ్య పై కీర్తనలో వివిధరకాలైన భూతాల చేష్టల్ని వర్ణించాడు ఈచేష్టలన్నియు లోక ప్రసిద్ధం సూక్ష్మంగా పరిశీలిస్తే మహావిష్ణువు యొక్క దశావతార వర్ణనను గమనించవచ్చు

ఓడ మింగెడి భూతం-మత్స్యావతారంగాను, వీపుపెద్ద భూతం కూర్మావతారం గాను, చీకటి భూతం-వరాహావతారంగాను సోమపు మోముభూతం-నారసింహావతారంగాను అన్నమయ్య వర్ణించాడు, ఇటు వంటి వర్ణనను భావ శ్లేష అంటారు

ఈ కీర్తనలో మిగిలిన అవతారాల వర్ణనలు కూడ ఉన్నాయి అన్నమయ్య లోని దశావతార కీర్తనల చాల వాటిలో ఈ లక్షణాలు కన్పిస్తాయి [1]

పెదతిరుమలయ్య

పెద తిరుమలయ్య కూడ దశావతార వర్ణనల్ని విరివిగా చేశాడు. మచ్చుకు-

"ఇన్నియు నుండగ దమకేమి గడమ
వున్నవాడు సిరి పురుషోత్తమ రాజు ॥పల్లవి॥

వీలుచు వీరావటించి వేదమరాజు
కులికి గుండ్లు మోచీ గూర్మరాజు
బొలిమి నేలలు దవ్వీ బొలమురాజు
నాలి బడచాట లాడీ నరసింగరాజు" (23-431)

ఈ కీర్తనలో వేదమ రాజుగా మత్స్యావతారాన్ని, కూర్మరాజుగా కూర్మావతారాన్ని, పొలం రాజుగా వరాహావతారాని నరసింగరాజుగా నారసింహావతారాన్ని పెదతిరుమలయ్య వర్ణించాడు ఇందులో మరొక విశేషం కూడా ఉంది బహుశః పెద తిరుమలయ్య కాలంలో పురుషోత్తమరాజు, వేదమరాజు, నరసింగరాజు మొదలైన వారు అంతో ఇంతో ప్రసిద్ధి పొందిన పాళెగాళ్లు కావచ్చు

చిన తిరుమలయ్య

తన దాసుని కొరకు ధరియించె నిరూపము
దిన దిన వేడుక గదిరి నారసింహుడు ॥పల్లవి॥

బలురక్కసు నొడిసి వట్టి తొడలపై బట్టి
చెలగి కొనగోళ్ల జించినాడు

చేలవట్టి పేగుల ఒంద్యాల తోడు తను
తెలిపై వున్నాడు కదిరి నారసింహుడు ॥తన॥ (16-1-37)

కదిరిలో నెలకొన్న స్వామి నారసింహుడు ఈ అవతారంలో ప్రహ్లాదు భక్తిని మన్నించి హిరణ్యకశ్యపుని సంహరించడం విశేషం నారసింహావతారంలో శ్రీమహావిష్ణువు భయంకరంగా ఉంటాడు ఆ భయంకర ఆకారాన్నే చిన తిరుమలయ్య పై కీర్తనలో వర్ణించాడు

అదే విధంగా–

శ్రీపతిపురనాయికా జయ తింతాభీష్టదాయకా ॥పల్లవి॥

వున్నతోన్నత విగ్రహా దానవోపరిస్థానుగ్రహా
సన్నుతామరసుగ్రహా సామవదపరిగ్రహా ॥శ్రీ॥

జనకే ప్రయకారకా శివసాధితాఖిల తారకా
మామపాహతమారకా మామకా ఘునివారకా ॥శ్రీ॥

శ్రీవేంకటనాథ రూపకా నంచిత రఘుకుల దీపకా
భావ సంతోష ప్రాపకా అభంగ మంజుల చాపకా ॥శ్రీ॥
(16- 1-51)

ఇది సంస్కృత రచన ఇందు చిన తిరుమలయ్య "రామ" అవతారమూర్తిని వర్ణించాడు

సారంగపాడి

ఇంతకంటె చోద్యమిక వేరుయున్నదె
యెంత ఆశ్చర్యమయ్యా చూడ ॥పల్లవి॥

వింతలు నీ కథలు వినవిన వేడుకలు
కంతుని గన్న చక్కని వేణుగోపాల ॥అనుపల్లవి॥

భృగురాముడై యిల జగతి కశ్యప మునికి
తెగువ నర్పించిన దేవుడవూ
మగటిమి చెడి బలిని మధుర భాషణముల
వగలేక ధరమూడడుగులు వేడినావంటె ||ఇంత||

అక్షయ వలువలు అల్ల ద్రౌపతి కిచ్చి
రక్షించినట్టి శ్రీరమా నాథుడౌ
కక్షి కట్టుక గోపకామినులమైలలు
నిక్షేపమ్ముగ బట్టి వృక్షమెక్కినావంటె ||ఇంత||

శంకాటంకము లేక జలరాశి బంధించి
లంకేశు నణచిన రణధీరుడౌ
కంట పత్రిము దొడిగి కాలయవనుడు దరుమ
బింకెలబాయి కొండ బిలము జొచ్చినావంటె ||ఇంత||
(సా ప 168)

సారంగపాణి ఆరాధ్యదైవం వేణుగోపాలస్వామి ఆస్వామి యొక్క భృగురాముడు, వామన, కృష్ణ, రామావతారాల్ని వర్ణించడం పై కీర్తనలో విశేషం అది విధంగా—

నీకే సమ్మతిగాని యిటువంటి నడతలు
మాకెవ్వరికి నరిపోదయా ||పల్లవి||

కాక నాడిరని తప్పెలెంతురనీ వి
వేకాలనికి ముందు వేణుగోపాల ||అనుపల్లవి||

అబ్జ ముఖులు పదహారు వేలుండగ
కుబ్జను మరుకేళి గూడితివి ||నీకే||

వెంలను పీతాంబరము చెలువొందుచుండగ
అలగోపకల చీరలందితివి ||నీకే||

పాలకడలి యందు పవ్వళించి యుండి
బాలుడై యశ్లెగ గ్రాకితివి ||నీకే||

తేజోరాశియైన దేవుడవై యుండి
రాజీగ నరుని సారథివైతివి ||నీకే||

వాటమైన వరమ పదము వదలివకా
ర్వేటి నగరమున వెలసితివి ||నీకే|| (సా వ 162)

పై కీర్తనలో కృష్ణావతారాన్ని సారంగపాణి వర్ణించాడు

యాగంటి కవులు

యాగంటి కవులకు ఆరాధ్యదైవం శివుడు వుని వాహనం నంది నందినే బసవడు అని అంటారు, యాగంటి కవులు బసవని క్రింది పాదల్లో వర్ణించారు

వేగములు పాదములు విశ్వరూపము మేను
ఆదిమూలమేనాభి అమరులే రోమములు
మీదు వరతత్త్వము మేలై యూపురము నా
పదము శ్వాసములు నయనమే శృతులు (డి-2494)

నాలుగు పాదాలు నాలుగు వేదాలు గాను, మేను ప్రపంచంగాను నాభి అన్నిటికి మూలంగాను వెంట్రుకలు దేవతలుగాను వర్ణించాడు

ఈలాగే రాయలసీమ పదకవులలో వైష్ణవకవులు స్వామి రూప వర్ణనకు కూడా ప్రాధాన్యమిచ్చారు. మచ్చుకు తాళ్లపాక కవుల్లో అన్నమయ్యది,

ఇప్పుడిటు కలగంటి - నెల్లలోకములకు
నప్పడగు తిరువేంక - టాద్రీశుగంటి ||పల్లవి||

అతిశయం బైన శే-షాద్రి శిఖరముగంటి
ప్రతిలేని గోపుర - ప్రభలు గంటి
శతకోటి సూర్య - తేజములు వెలుగగ గంటి
చతురాస్యు బొడగంటి - చయ్యనమేల్కంటి ||ఇప్పు|| (5-38)

4 2,1 2 ఉత్సవ వర్ణన

తాళ్ళపాక కవులు, సారంగపాణి ఉత్సవాలవర్ణనల్ని చేశారు

అన్నమయ్య

అన్నమయ్య తన పదాల్లో వసంతోత్సవం, ఉట్ల ఉత్సవం బ్రహ్మోత్సవం, డోలోత్సవం, రథోత్సవం కళ్యాణోత్సవం, ధనుర్మాసోత్సవం, తెప్పోత్సవం, పుష్పయాగోత్సవం, వనభోజనోత్సవం, కౌముది మహోత్సవం, పర్వోత్సవాలు, తురగోత్సవం, అనంత పద్మనాభ చతుర్దశి ఉత్సవం మొదలైన ఉత్సవాలను వర్ణించాడు ఈ ఉత్సవాలన్నీ తిరుమలలో జరిగే ఉత్సవాలే వీటిలో పర్వోత్సవం, ఉట్ల ఉత్సవం, కళ్యాణోత్సవం, రథోత్సవం, తురంగోత్సవం మొదలైన ఉత్సవాలు తిరుమలలోనేగాక అన్నమయ్య దర్శించిన ఇతర క్షేత్రాల్లో కూడా జరుపబడుతాయి

వసంతోత్సవం

"వనితకు బదికిదె వసంతము
దిన దినము నమరె తిరుమల మిద" (26-49)

"వేడుక వసంతము వేళనిదె
వాడ వాడల వెంట వనితలాడేరు" (25-349)

ఆడవయ్యా సరిగా నీ వావెతో వసంతము
వేడుక నవ్వులలోని వెన్నెల వసంతము (24-389)

పైకీర్తనల్లో అన్నమయ్య వసంతోత్సవ ప్రస్తావన చేశాడు ఈ కీర్తనలో బ్రహ్మోత్సవ సమయంలో స్వామివారిని ఊరేగించే వాహన క్రమాన్ని అన్నమయ్య వర్ణించాడు.

డోలోత్సవం

డోల అంటే ఊయల డోలలో స్వామిని, దేవేరులను ఉంచి ఊపుతూ జరిపే ఉత్సవం దీనికే తమిళంలో ఊంజల్‌సేవ అని, తెలుగు ఉయ్యాలసేవ అంటారు

అన్నమయ్య ఈ డోలోత్సవాన్ని సంస్కృతకీర్తనలోను, తెలుగు కీర్తనలోను వర్ణించాడు,

సంస్కృత కీర్తన

డోల అంటే ఊయల డోలయాం హరే డొలాయాం
మీన కూర్మ వరాహ మృగపతి అవతార " (7-140)

తెలుగు కీర్తన

"అలర జంచలమైన ఆత్మలందుండ నీ
యలవాటు సేసె నీ వుయ్యాల
పలుమారు నుచ్ఛ్వాస పవన మందుండనీ
భావంబు దెలిపె నీ వుయ్యాల" [1-67]

రథోత్సవం

బ్రహ్మోత్సవంలో భాగం రథోత్సవం ఈనాటికి ఈ ఉత్సవం జరుగుతూనే వుంది

అన్నమయ్య ఈ రథోత్సవాన్ని చాలాచోట్ల వర్ణించాడు మచ్చుక-

ఇందిరయు దానుగూడి యిట్టె వరాలొసగుతా
నందడించి దిక్కులెల్ల సాధించెనిదివో
వేదములే గుఱ్ఱములు విస్తరి రథమునకు
వాదపుశాస్త్రములే శివపుపగ్గాలు
పాదగునంచభూతాలే వరగు బండికండ్లు
ఆడిగాని మహావీథులందు నేగినిదివో (8-146)

ఉట్ల ఉత్సవం

జన్మ దినోత్సవానికి ప్రాధాన్యమిస్తూ వినోదానికి కూడ అవకాశం కల్పించే పండుగ ఉట్ల పండుగ.

వచ్చి దేరుచునట్లు పండుగాయను
గచ్చులకు గొల్లెతల గొగిలించి పట్టగా" (8-150)
పైకొని చూడరో పుట్ల పండుగ నేడు
ఆకడ గొల్లెతలకు నానందము నేడు (8-161)
అపల శ్రీవేంకటేశు డతటా కలయుగొని
సేసీనుట్ల పండుగ చెల్లుబడిగాను (22-180)

అన్నమయ్య పైసంకీర్తనల్లో ఉట్లపండుగ విశేషాల్ని వర్ణించాడు___

బ్రహ్మోత్సవం !

బ్రహ్మోత్సవాన్ని ప్రాచీనకాలంనుండి నిర్వహిస్తున్నట్లు తెలుస్తుంది. బ్రహ్మోత్సవం తిరుమలలో పదిరోజులు జరుగుతాయి. బ్రహ్మోత్సవాల సందర్భంలో ఒక్కొక్కరోజు ఒక్కొక్క వాహనా [illegible]కొని స్వామిని ఊరేగింపు జరుపుతారు

అన్నమయ్య సంకీర్తనల్లో వాహన క్రమాన్ని తెలిపే కీర్తన ఉంది

"తిరువీధుల మెరసీ దేవదేవుడు
గరిమల మించిన సింగారముల తోడను
తిరుదండెలపై నేగీ దేవుడిదే తొలునాడు
సిరుల రెండవనాడు శేషుని మీద
మురిపేన మూడోనాడు ముత్యాల పందిరి క్రింద
పొరి నాలుగోనాడు పువ్వుగోవిలలోను" (13-192)

కల్యాణోత్సవం

శ్రీ వేంకటేశ్వర స్వామివారి ఆలయంలో జరిగే ఉత్సవాలలో కళ్యాణోత్సవానికి చాల ప్రాముఖ్యముంది

అన్నమయ్య కళ్యాణోత్సవాన్ని చాలచోట్ల వర్ణించాడు మచ్చుకు-

పసిడి యక్షంతలివె పట్టరో వేగమే రారో
దెసల బేరటాండ్లు దేవుని పెండ్లికిని
అదె శ్రీవేంకటపతి కలుమేలు మంగకును
మొదలి తిరునాళ్ళకు మొక్కేము నేడు (18-194)

వెలియగ లక్ష్మి విభుని పెండ్లికిని
బలసి అంకురార్పణం మదిలో (28-96)

ధనుర్మాసోత్సవం

మార్గశిర మాసంలో ముప్పది రోజులు ఈ ఉత్సవం జరుగుతుంది ఈ సమయంలో తిరుప్పావై పాడుతారు

అన్నమయ్య ధనుర్మాస కాలంలో జరిగే ఉత్సవంలో స్వామి లీలల్ని వర్ణించాడు.

"అతి బ్రహ్మాండాలు గుక్షినటు ధరించిన యట్టి
అతనికి జేయరో అరగింపులు
ప్రతిలేని క్షీరాబ్ధి బవళించి లేచినట్టి
చతురునికి జేయరో చలివారగింపులు
యేడు దినములు దాకా నెత్తెను గోవర్ధనము
ఆడివచ్చె బాలునికి అరగింపులు
మేడెపు గోపకలతో మిక్కిలి బెనగినట్టి
వేడుకకాని దేరో విందు లారగింపులు" (9-9)

తెప్పోత్సవం

అన్నమయ్య సంకీర్తనల్లో తెప్పోత్సవ వర్ణన ఉంది
"ఎందు నీకు ప్రియమో యీతెప్ప తిరునాళ్ళు
దిందువడి సిరులతో తెప్ప తిరునాళ్ళు
పాలజలనిధిలో బవ్వళించు పాముతెప్ప
దేలుచున్న దతిదెప్ప తిరునాళ్ళు
వోలికే కొదకమై వొక్కమఱ్ఱియాకు మీద
తేలుచున్నదది తెప్ప తిరునాళ్ళు" (2-143)

పుష్పయాగోత్సవం .

స్వామికి రకరకాలైన పుష్పజాతులతో జరిగే యాగం పుష్పయాగం ఈ యాగ నిర్వహణకు సంబంధించినదే పుష్పయాగోత్సవం

అన్నమయ్య పుష్పయాగోత్సవాన్ని వర్ణించాడు

"వివిధ పుష్పములతో వేద ఘోషములతో
అవల దిరువాముడియు నంగనల యాటతో
కవి వందిసుతులతో కమ్మబూజల తోడ
నవధరించీ బుష్ప యాగంబు" (3ll-209)

## పెద తిరుమలయ్య

పెద తిరుమలయ్య తన రచనల్లో రథోత్సవం, కళ్యాణోత్సవం ధనుర్మాసోత్సవం మొదలైన ఉత్సవాల్ని వర్ణించాడు

### రథోత్సవం

"మునులాల జనులాల ముంచిన దేవతలాల
పని పూని మొక్కరో పరమాత్మునికి ॥పల్లవి॥

కనకాచలము వంటి ఘన దివ్యరథముపై
వనజాక్షుడెక్కి వీధి వచ్చీ వాడె
వెనుదళమై నడచె విష్వక్సేనుడిదే దేవిడి
కనిమని సేవించరో కన్నుల పండుగలు" (21-192)

### కళ్యాణోత్సవం

లక్ష్మీ కళ్యాణము లీలతో జాడె మిదినేము
లక్ష్మీ నారాయణులే అలనయు నీవును ॥పల్లవి॥ (23 165)

### ధనుర్మాసోత్సవం

దేవుని ప్రసాదము తెరళ అందు కోరో
యీవేళ నారగించె యీశ్వరేశ్వరుడు ॥పల్లవి॥

వేకువ జామునను లేచి వేద విప్రులెల్లగూడి
ఆగపు ధనుర్మాస మందు పూజించి
రాగమున దివ్యాముడి రంతుసేసి చదువగ
జాగుతోడ నారగించె సర్వలోకేశ్వరుడు" (21-189)

సారంగపాణి

సారంగపాణి నగరంలో జరిగే తెప్ప తిరునాళ్లను వర్ణించాడు

నగరాన తెప్ప తిర్నాళ్లయ్యేడికె సూన్నువాగు నివు రాలేదంటి-
అంటె

అగుమూడి యర్లచ్చి-తొగటాయాటను బశివి
ఎగమెత్తి నట్టేశ్రి-వాగరితో సెప్పక నేరెయ్యి ||నగ||

వదమ చరచుకాడ-వందిలే బగి నోదం
సందు రేశింది చోదెం-చామిదే యింతా
యెదురుమలుగకూ-దొండేశిధింటెలుపున
అదెశెయి సూఎయ్యేశి-రాన్నే మాశికింకత్తె ||నగ||
(సా వ, 148)

అదే విధంగా నగరంలో వేణుగోపాలుని ఊరేగిస్తున్నపుడు స్వామిని సారంగపాణి వర్ణించాడు

కదలి వచ్చెను జూడరే-వేణు
గోపాలుడు కమల వందుగగాను
పదిలుడై గరుడునిపై నెక్కి భక్తుల
ముదమంద జేయుచు అగిగో రాజమార్గమున ||కద||

సురలు నుతింపగను వేదములవనీ-సురులు పఠింపగను
ధరణీశులతి భక్తి-తను సేవింపగాను
సరసీ జాక్షులు నాట్య - సరణి నభినయింపగాను ||కద||
[సా.వ 169]

4 2 1 3 నీతి తత్త్వాలు

ఆధ్యాత్మిక గేయాలలో నీతిని బోధించే గేయాలు ఒక భాగం ఇవి

ంలోని దురాచారాల్ని బయటపెట్టి సమాజాన్ని మంచి దిశవైపు ంచేటట్లు చేస్తాయి

మానవుడు తాబుట్టిన సమాజంలో ఒకరినొకరు హింసించకూండా ంగా జీవించడానికి ఏర్పరుచుకొన్న కొన్ని సూత్రాలే నీతులు నీతి ల పాత్రను గుణంగా మారుతుంది

రాయలసీమ పదకవుల పదాల్లో కూడా నీతి సంబంధి గేయాలు యి

మయ్య

"తప్పులేని సంసారమైన పాటే చాలు
తప్పులేని జీతమొక్క తారమైనంజాలు శివల్లవి॥

కంత లేని గుడిసొక గంపంతైన జాలు
చింత లేని యంబలొక్క చిరడే చాలు
జతగాని తరుణి యేజాతైన నదే చాలు
వితలేని సంపదొక్క వీసమే చాలు" (2-114)

తిరుమలయ్య

"కలిమి గలదని పుబ్బవలదు కడగి లేదని సగ్గవలదు
కలసి కలలోగన్న సుఖదుఃఖముల చందములు
వలనుగా రాట్నంపు గుండ్రలవరుసలీ జన్మంబులెల్లను
చెలగి దైవము మున్నెసృష్టించినది యీ విధము" (21-275)

జనన మరణాదులు రాట్నంలాంటివి వస్తూవుంటాయి పోతుంటాయి విధంగా సంపదకలిగినపుడు సంతోషించరాదు కలగనపుడు బాధ రాదు కలిమి అనేది కలలోకి వచ్చిన సుఖదుఃఖాలు లాంటివి. అంటే

అశాశ్వతమైనది వీటన్నిటిని ఆ భగవంతుడు సృష్టించినదేనని పెద తిరుమలయ్య ఉద్దేశ్యం

అదే విధంగా

"యెలమితో గూరుపి నెంత సింగారించినాను
అలయికలే కాని అందము గాదు
మలసి యిత్తడి దెచ్చి మాదలుగా జేసి తేను
కలసహజమే కాని కనకము గాదు" (21-380)

కురూపిని ఎంత సింగారించినను వానికి అందం రాదు అదే విధంగా ఇత్తడికి ఎంత మెరుగుబెట్టినను అది బంగారం కాదు

భగవంతుని మాయను ఎవరు తప్పించలేరు ఆయా వస్తువుల గుణాన్ని భగవంతుడు సృష్టించినదే కాబట్టి వాటి లక్షణాలు ఎన్ని విధాలుగా సరి చేసినా మారవని పై పాదాలలో విశేషం,

ఇలాంటి నీతితత్త్వ కీర్తనల్ని పెద తిరుమలయ్య విరివిగా వ్రాశాడు

చిన తిరుమలయ్య

"అల్లము బెల్లమౌనా అన్నలాల
యెల్లకాలమును గుణమేలుమా నీనయ్యా
నిక్కము గొండలనీరు నేలకు వేగమేపారు
యెక్కువ నేలపైనీరు యెక్కదందుకు
మిక్కిలి ప్రకృతిలోన మెలగెటి వానికి
బొక్కమైన జ్ఞాన మెట్టు సొగసీనయ్యా" [16-1-16]

సారంగపాణి

వోరాని కావులకు వోరాదు-బుద్ధిమంతులైతే

పోరాని తావులకు పోరాదు
పోరాని తావులకు పోతే నీలాపనిందలు వచ్చు
వేరే యువమానము వనిలేదు-వేణుగోపాలునిసాక్షిగ
వగవానింటి కుడవరాదు
బలవంతుల కెడ మియ్యగరాదు
మగువల యాలోచన వినరాదు
మాన ఘనుల పోనాడగరాదు " [సా వ 180]

మానవుడు సంఘజీవి సంఘంలో తాను గౌరవంగా ఉండాలంటే కొన్ని అలవాట్లను మానుకోవాలి, ఏయే వనులు చేయగూడదో సారంగపాణి పై కీర్తనలో స్పష్టంగా వివరించాడు

శత్రువుల ఇంటిలో భోజనం చేయరాదు బలవంతులకు చనవు ఇయ్యరాదు. స్త్రీల మాట వినరాదు ఇలాంటి ధర్మాలెన్నో ఈ కీర్తనలో వివరించాడు పోరాని చోట్లకుపోతే, చేయరాని వనులు చేసినట్లయితే నీలావనిందలు వస్తాయని సారంగపాణి అభిప్రాయం లోకాభిప్రాయం కూడా.

యాగంటి కవులు

యాగంటి కవులు తమ వదాల్లో అనేకరకాలైన నీతుల్ని వివరించారు మచ్చుకు—

వరనిందలు కెపుడు వలుక బూనకే మనసా
వరుల చిత్తము నొవ్వ బలుకకే మనసా (డి-2489)
ఒరులపై చాడి చెప్పి యుదుగారలందుట కంటె
గరిమ కోవంబై గట్టుటే మేలు (డి-2494)
"తెరువాట్ల గొట్టి తెచ్చి త్యాగమిచ్చు కీర్తి కంటె
వరులకు కానియకురదుటే మేలు

పరులను బాధించి సంపద దానము చేయుటకంటె
ధరముచ్చకున్న పేదరికమె మేలు" (డి-2494)
"పరసతులదల్లిగా భావించవే మనసా" (డి-2498)
"పరధనమ్ముల కాశ పడకుమీ మనసా" (డి-2489)

వీరబ్రహ్మం

"చెడు గుణంబుల జిక్కి చెడిపోకె మనసా
చేరి సద్గురిని సేవించవె మనసా
ఆడబిడ్డల నమ్మి అల్లాడకె మనసా
ఆనందయింటిలో ఆట్లాడవె మనసా" (సుజ్ఞాన రత్నావళి, 11)

అశాశ్వతమైన ఈ జీవితాన్ని చూచి ఎగిరెగిరిపడవద్దు మట్టివంటి ఈ జీవితాన్ని చూచి మనసు పాడు చేసుకోవద్దు, మోక్షాన్ని సంపాదించే మార్గాన్ని అన్వేషించు దానికి భగవంతుని సేవించడమే ప్రధానం - అనే విషయాన్ని వీరబ్రహ్మం పై కీర్తనలో వివరించాడు

4.2 1 1 వైరాగ్యతత్త్వాలు

రాగాదుల వల్ల అనురక్తుడు గాకుండా దూరంగా ఉండటం విరాగం, విరాగం యొక్క భావం వైరాగ్యం, రాగమనగా ఒకదానియందు కోరిక కలిగి ఉండుట విరాగమనగా ఆసక్తి లేకుండుట మనకు కని పించే ప్రాపంచిక వస్తువులన్నీ అనిత్యాలని తలచి వాటిపైగల రాగాన్ని వదలుటే వైరాగ్యం మనస్సుయొక్క అంతర్గతస్థితి వైరాగ్యం అది వస్తువుయొక్క నశ్వరతను మన దృష్టికి తెచ్చి వాటిపై వ్యామోహం లేకుండా చేస్తుంది అనిత్య వస్తువులనుండి పరమాత్మపైపు మనస్సును మళ్ళించుటవల్ల వైరాగ్యభావం ఏర్పడుతుంది

రాయలసీమ పదకవుల్లో ఇలాంటి రచనలు కన్పిస్తాయి

అన్నమయ్య

"సడికెట్టె గటకటా సంసారము - చూడ
జడధి లోపలి యీత-సంసారము
జమునోరలో బ్రదుకు-సంసారము-చూడ
చమురు దీసిన దివ్వె-సంసారము
సమయించు బెనుదెవులు-సంసారము-చూడ
సమరంబులో నునికి-సంసారము" (11-3-70)

సంసారమనెడి సంద్రంలో ఈతలాంటిది యముని నోటిలో బ్రదుకు వంటిది చమురు తీసిన దీపంలాంటిది చంపుటకు సిద్ధమైన భయంకరమైన రోగం లాంటిది యుద్ధభూమిలో ఉనికి లాంటిది ఈ సందర్భాలలో చిక్కుకున్న వ్యక్తి తప్పక నశిస్తాడు అదే విధంగా సంసారం అనే బంధంలో చిక్కుకున్న వ్యక్తికి మనుగడలేదు

పెద తిరుమలయ్య

పెద తిరుమలయ్య ఆధ్యాత్మ సంకీర్తనలలో వైరాగ్యకీర్తనలు న్నాయి మచ్చుకు—

"పలు యోనులందు పుట్టి భ్రమసితిని
అలర నేనేజాతి నసుకొందునయ్యా
వెనక జన్మముల నావేడుకైన కాపురాల
యెనయు సతులు సుతులెందరెందరో
మునుకొని యీజన్మమున గొందరున్నారు
మనసున నెవ్వరి మా వారందునయ్యా" [21-85]

ఈ కీర్తనలో సాంసారిక వైరాగ్యాన్ని వివరించాడు జననామరణాదులు

సామాన్యం ఒక్కొక్క జన్మంలో ఎందరెందరో సతులును – వీరిలోనెవ్వరిని మాహారనందును ఆదికాలంనుండి పుట్టుచు గిట్టుచూనే వున్నాను వాటిలో ఏ జన్మం నాదని తెలుపుదును ముందరి జన్మాలు పొల్లెల్లా తలచుకొంటే నాకు నవ్వు వస్తుంది అని పెద తిరుమలయ్య శ్రీవేంకటేశ్వరుని న్మరిస్తున్నాడు అదే విధంగా

"దాటలేను యీ మాయ దైవమా నేను
నీటున జేసేవాడవు నీవే నీవే కా
యీ మురికి దేహమే కా యెంతకాలమైన నేను
వోముకొని భూమిమీద నుండ గోరేది
దోమటి యింద్రియాలే నా తోడు నీడైయుండినన్ను
వేమరు భోగించజేసే వేమటామైనది" [21-69 |

చిన తిరుమలయ్య

"మాయలో మునుగనేల మమత లేల
చేయరా దేపుడేపాటి సేయునో పండా
అట్టె దేహ సమ్మంధ మాసవడే జీవులాల
పట్టి హరి సమ్మంథాన బ్రదుకరాదా" (16-1-42)

సర్వాంతర్యామియైన ఆ దేవుని స్మరించి శాశ్వతమైన మోక్షాన్ని పొందండి అంతేగాని ఈ శరీరం వట్టిమాయ దీని కై అలవడక దేవుని కొలవండని చినతిరుమలయ్య తనవైరాగ్యాన్ని పైకీర్తనలోవర్ణించాడు

యాగంటి కవులు

యాగంటి కవులు తమ పదాల్లో వైరాగ్యభావాల్ని తెలిసే పదాలు వ్రాశారు మచ్చుకు—

అనువైన వరమనిత్యానంద శివభక్తి యనెడి సౌఖ్యమనియెుల్లకొ

ఙనుమాయ విషయసంగతి బడి భ్రమసి చెప్పిన నెరుంగవు
ఏలోయి జీవుండ ఎంతైన దెలియవు-నీ
మాలమంతయు ఇంద్రజాల మెరుంగవా ॥ఏలోయి॥

ఏది నిత్యము మాయావాద మీ బ్రతుకు
ఈ దేహమని బోధ చేసినను
వాదమొదలి జాడ వదలకే గంటి
కాదన్న కడమరాగము జేసేవు ॥ఏలోయి॥ [డి-2489]

ఈ దేహమనిత్యమని పరమనిత్యానందశివభక్తినిపొందమని యాగంటి వారి అభిప్రాయం అదే విధంగా —

పడి పాశమ్ముల నరువడి గట్టు
వడిలో బడిన యేనుగ విడిన యట్లన్
విడివడ్డ సంసార మోహపాశంబులను
యెడలుబే శివయోగి ఎంత భాగ్యవంతుడో (డి-2189)

సాంసారిక వ్యామోహాన్ని వదలినవాడే నిజమైన శివయోగి అని అభిప్రాయాన్ని యాగంటి కవులు వెలిబుచ్చారు

దూదేకుల సిద్ధయ్య

ఏల దేహము పనికిరాని దెందుకి మోహము
జాలమనె సంసార బంధములోన జిక్కి మూలమెఱుగని
పంచేంద్రియము-లను తనశోధించి త్రుంచివేయకను
చంచలము ఛేదించి తనలో మంచిప్రకృతి
అంచితముగ మంచివాడై గురుని పంచకు పొంచి కాచియుండక
నేరని ॥ఏల॥ [సుజ్ఞానరత్నావళి-31]

తరిగొండ వెంగమాంబ

ఎందుకు నీకింత మోహము-చిత్త మా -పరమా
నందమా కైవల్యమా-యీ దేహము
పందపై యింద్రియ విషయ
బృందములను తిరిగి నీవు
క్రిందు మీదు దెలియక
అందమా-వందమా- ఆనందమా ॥ఎందు॥(సుజ్ఞానరత్నావళి-85)

4 2 2 శృంగార వర్ణనలు

శృంగారం లౌకికం, అలౌకికం అని రెండురకాలు లోకసహజ మగు స్త్రీ పురుషుల శృంగారం లౌకికం ఇందు సుఖమే గాని ఆనంద ముండదు, కాని భగవంతునికి సంబంధించిన శృంగారం లౌకికం ఈ శృంగార భావన సచ్చిదానంద బ్రహ్మానందానికి దగ్గరిది

శృంగారాన్ని మూడుదశలుగా విభజించవచ్చు 1 అయోగ శృంగారం 2 సంయోగ శృంగారం 3 వియోగ శృంగారం

4 2 2 1 అయోగ శృంగారం

నాయకుని చూడడంవల్ల గాని, నాయకుని గురించి వినడంవల్ల గాని, నాయికకు కలిగే సమాగమ ఆకాంక్షే పూర్వరాగం ఇది చక్షుః ప్రీతి, మనస్సంగం సంకల్పం, జాగారం, కృశత, అరతి, హ్రీత్యగం ఉన్మాదం, మూర్ఛ, మరణం (సూచనగా) అనేవి అయోగశృంగారం లోని వివిధదశలు ఇవి క్రమాభివృద్ధి చెందినసంభోగానికి దారితీస్తాయి

తాళ్ళపాక కవులు, సారంగపాణి ఈ అయోగశృంగారానికిసంబం ధించిన కీర్తనలు వ్రాశారు

అన్నమయ్య

అన్నమయ్య అయోగశృంగారంలోని దశావస్థల్ని తన కీర్తనల్లో పేర్కొన్నాడు మచ్చుకు—

"ఎట్టు ధరింపవగనగు భువి నిట్టి వియోగావస్థల
నట్టును నిట్టును విధిదము నారడి బెట్టగను
కాంతుని మూపుల జిక్కిన కాంత వియోగాన్నికి దగ
కాంతికి జెగలువలుపై జల్లరి నెచ్చెలులు
కాంతుని చూచి తొల్లిటి కనుచూపులె బహుళములై
కాంతశరీరం బంతయు గప్పిన తెలుగాయ" (12-144)

ఇందు నాయికనాయకుని ప్రత్యక్షంగా చూడడంవల్లేగాక అతని మాటలు వినడంవల్లకూడ రాగోదయం పొందింది ఇది చక్షుఃప్రీతి అదేవిధంగా-

"ఎక్కడ నున్నదో చిత్తమేమి దలచెనో యింతి
చెక్కులెల్లా జెమరించీ జెప్పరమ్మా చెలులు
అతని సుద్దులు చెప్పే అతివలే చుట్టాలు
అతనిని వద్దనిన వారందఱు బగ
రాతిరెల్లా నిద్దురెఱుగదు పాదములొత్తి
చేతులెల్ల బొక్కెనేమిసేతుమమ్మా చెలులు" (12-28)

నాయకుని గూర్చి తెలుసుకోవాలనే ఆశ నాయికకు గలగడం పైకీర్తన విశేషం ఇందుచింత, సంతాపం, జాగారం, కృశత మొదలైన అవస్థలు వర్ణించబడ్డాయి

ఈ విధంగా అన్నమయ్య అయోగశృంగారంలోని వివిధదశల్ని అనేక కీర్తనల్లో వర్ణించాడు,

పెద తిరుమలయ్య

"ఏల బుద్ధి చెప్పేరే యెన్ని మారులైనా నాకు

వేళ తోడ వాని పొందు విడువగ లేనే
తలపోసి తలపోసి తనలో గుబ్బతిల్లితే
వలపు చల్లారబెట్ట వనమౌనటె
యిల నెదురు చూపుల నేచిన కాంక్షలు
కెలసి నీళగడిగిన మానునటవే" (23-205)

నాయకుని పొందుకోసం తపించే నాయిక హృదయం ఈ కీర్తనలో స్పష్టం

చిన తిరుమలయ్య

"వడలి నీ యాసనే బతికున్నది
యెడయక నీవింక నెట్టయినా జేయుమీ
గుబ్బలమీద జెలికొంగు వేయదు
నిబ్బరపు మోహమున నిన్ను దలచి
గబ్బియైన మారునిచే కాకలు బెట్టు
అబ్బురంపు విరహము నావలేక వున్నది" (16-2-16)

ఇందు అభిలాష రూపమగు అయోగశృంగారం వర్ణితమైంది

సారంగపాణి

"ఏమి సేతు విరహవేదన
యెంతయని తాళు కొందునమ్మా
సామి నాపై ప్రేమ మరచె
నామది కెంతో దిగులు దోచె
తలచి తలచి వగచుటాయె
నిలచినచోట నిలువదాయె
చెలియరో యన్నము సైచదాయె

చిత్తము వాని విడువదాయె" (సా ప 45)

ఇందు నాయకుని మరల మరల తలంచడం కృశించడం మరువలేక పోడవం మొదలైన అయోగ శృంగారావస్థలు వర్ణింపబడ్డాయి

1 2 2 2 సంయోగ శృంగారం :

దీనికే సంభోగ శృంగారమనియు పేరు నాయికా నాయకుల కలయికయే సంభోగ శృంగారం ఇది కేవలం సురతరూపమే గాక పరస్పరావలోకన, చుంబన ఆలింగనాది వివిధ క్రియలతోకూడి ఉంటుంది

తాళ్ళపాక కవులు, సారంగపాణి తమ పదాల్లో సంయోగశృంగారంలోని వివిధ క్రియల్ని వర్ణించారు

అన్నమయ్య

"పొదలిన వీడెపు బుక్కిళ్లో - తమ
చొదుకుల చెమటల చొక్కిళ్ళో
అముకొనిన యధరామృత వేళల
మోముల మోముల మొక్కిళ్ళో
కామినుల మకరికా పత్రమ్ముల
చీమల దొంతర చెక్కిళ్ళో" (12-31)

ఇందు చుంబన, ఆలింగన సమాగమ క్రియల్ని అన్నమయ్య వర్ణించాడు

పెద తిరుమలయ్య

"జలజాక్షి చన్నులపై చందురులబెట్టితే నీ
నెలపై కౌగిలించితే నిన్నే యంటిమ"
"కాంతమోవి మీదటను కంతుని ముద్రలుపెట్టి

బంతికి బోతే నీ మోవిపై నంటీను" (23-182)

ఈ కీర్తనలో చుంబన ఆలింగనాది క్రియలు వర్ణించబడ్డాయి

చిన తిరుమలయ్య

ఎంతనేరువరివి నిన్నే మందమే
పంతమాడె యాపె వింతభ్రమయించె జూడరే"
"అలచుక్కల నెంచవెయని దాని నేమరించి
కళలంటి నన్ను బిగ్గిగాగిలించేనే"

"అక్కడ దాగిలి ముచ్చులాడి దాని గన్నుమూసి
దక్కినామోవాని నాకు దమ్ములము పెట్టినే"

"గట్టిగా నాపె కన్నుల గప్రమునిండా బెట్టి
జట్టిగా నాతోగూడి సమరతి సేసెనే" [16-2-94]

పై పాదాల్లోఆలింగన, చుంబన, సంయోగ క్రియల్ని చినతిరుమలయ్య వర్ణించాడు

సారంగపాణి '

"తోడి తెచ్చెదనే వాని-అప్పుడో మెచ్చి
తొడవు లిత్తువుగాని
వేడుకవరుడైన వేణుగోపాలుడల
చేడె నగరిమున్న-జాడ దెలిసి యీడకే
అద్దము జూచుచును ఒకరికొకరు
ముద్దులు బెట్టుచును
గద్దరితమున కౌగిలించు నీపై
పద్దున దానికి-బావలిచ్చిన గాని (సా ప 31)

పై పదంలో ఆలింగన చుంబనాది క్రియల్ని సారంగపాణి వర్ణించాడు

4.2.2.3 వియోగ శృంగారం

దీనికే విప్రలంభ శృంగారమని పేరు నాయికానాయకుల ఎడబాటు వల్ల కలిగే మన్మథావస్థకు వియోగశృంగారమని పేరు వియోగ శృంగారంలో ఎరహ, ప్రవాస ఈర్ష్య అనే భేదాలుంటాయి

తాళ్లపాక కవులు, సారంగపాణి వియోగశృంగార కీర్తనలు వ్రాశారు తాళ్లపాక కవుల వియోగ శృంగార కీర్తనల్లో పల్లవి మొదటి రెండు చరణాల్లో వియోగ వర్ణన చేయబడినా చివరి చరణంలో మాత్రం సంయోగ వర్ణన చేయబడింది వీరి రచనల్లో ఇది ఒక ప్రత్యేకత,

తాళ్లపాక కవుల వియోగ శృంగార వర్ణన గేయాల్ని రెండు రకాలుగా వర్గీకరించవచ్చు 1 నాయిక విరహవర్ణన 2 నాయిక విరహ వర్ణన

4.2.2.3.1 నాయిక విరహ వర్ణన అన్నమయ్య

"వనిత భాగ్యంబు దేవర చిత్తము-మాకు
బనిగాదు యింక నీపాదంబులాన
అడబాలసతి బోనమారగించు మటంచు
బడిబడిని కడు విన్నపముసేయగా
ఉడుగని పరాకుతో నుండి నెచ్చెలి మీద
బడలి వొరగినది నీపాదంబులాన" (12-23)

ఇందు నాయిక విరహంతో ఆహారాదులందు ప్రీతిని కోల్పోయింది మూర్ఛాదులు కూడ ఇందు సూచితం

పెద తిరుమలయ్య

"పతిబాసి విరహాన భ్రమయుకుపే నిన్ను
మతకాన తమిరేచి మన్నించే నతడు

నిండు జందురుడు గదే నీమోము, నే
డెండ లేటికి నాయు నీ వెన్నెల
కొండలే కదవే బాగుల చన్నుల, ఆ
గండు గోవెల కూతకొరించె నటవే" (23-147)

చిన తిరుమలయ్య

పుక్కిలిబంటి కాకలలోనే పొదువోవు బెట్లే
యెక్కువైన నామోహము చెలులూ నెరగరే మందునే
వొక్కనిమిషము వానిబాసినే వోరువగలనటే
మొక్కశీడయినమరువమ్ములకు మొకమాటగలదా"(16-1-48)

నాయిక విరహాన్ని ఆపుకోలేక తన బాధను చెలికత్తెలకు చెబుతుంది తన విరహ బాధను తెలిసిన చెలికత్తెలతో నాయకుని తీసుకొని రమ్మని వేడుకొంటుంది

సారంగపాణి

రమ్మనే యీ మేనువాని సొమ్మనే
కౌగిటి జేర్చు కొమ్మనే మోవి తేనే లిమ్మనే
బాలనే తనుక మణిప జాలనే పతిజూడనిసొగ
సేలనే యీ జవ్వనమేలనే
మించెనే మరుడు నన్నెదిరించెనే శుక శారికెలురవ
ళించెనే నెలరాజు గర్వించెనే (సా ప 69)

తన విరహ బాధను చెలికత్తెలతో చెబుతూ" విరహాగ్నిచేత మేను సగమాయెనే" అనడం వల్ల నాయిక విరహం వల్ల కృశిస్తుందని గమనించవచ్చు.

4.2 2 3 2 నాయక విరహ వర్ణన

విరహమనేది నాయికకే గాదు నాయకునికి కూడ గలగవచ్చు తాళ్లపాక కవులు, సారంగపాణి నాయకునికి కలిగిన విరహబాధను తమ పదాల్లో వర్ణించారు.

అన్నమయ్య

"పురుష విరహ మింత పొగులాయ నీవల్ల
సరిబొతువురావమ్మ చక్కని నీ విభుని
తలపోతలనే నీపై దమకించి తమకించి
ఎలుపులనే నిన్ను చేరుకొనీ
చెలుల యెదుట నుంటే చేరి నీ సుద్దు లడిగీ
కలతువు రావమ్మ గక్కన నీప్రియు౯" (13-156)

ఈ కీర్తనలో నాయకుడు నాయికను గూరిం తలచడం, గుణ వినుతి సేయడం అనే అవస్థల్ని వర్ణించాడు

పెద తిరుమలయ్య .

"నెలతజాసి వుండలేను నిమిషమెందునేడు నాకు
తలపులో నీవలెనే రతుల తరుణి గలయు టెన్నడే
ముదిత నా యెదుట నిలిచిమోసులు వారనవ్వునవ్వి
కడలు జూపుల జూచి నాకు కన్ను లార్చుటెన్నడే
వదలు బయ్యెద సవరించి వలపుతేట చవులు చూం
కొదలు మాటల ముద్దుగునిసి కూరిమిగొసరుటెప్పుడే" (2'-20)

ఈ కీర్తనలో "తరుణి కలయుటెన్నడే" 'నెలత జాసి వుండలేను' అనడంలో నాయకుని అభిలాష, విరహం వ్యక్తమవుతుంది

చిన తిరుమలయ్య

"తనువె యిక్కడగాని తలపెల్లా నక్కడనె
మనసులో నాపె నింక మానసైన గలవా
మా యింటాడ నిచ్చకపు మాటలాడే వింతే కాక
వోయీ నావాపె బాస వుండనోపేవా
ఆయేలే మా ముందటను అనము దించవుగాక
చేయార నీవె యాపెను చెనకకుండేవా" (16-2-55)

ఇందు నాయకుడు నాయిక పైననే మనసు గలిగివుండడం నాయికను విడువ లేక పోవడం అనె విరహావస్థల్ని వర్ణించాడు

సారంగపాణి

"వలచితివ్వ నీపై ముద్దు చాలా
తలచితే నామది
తాళదు విరహమగ్గలమాయె
వంచన మానవే మంచి మాటాడవే
సంచున బాడవే వంచకతని చిలుకా
యించు బోణుల మేటి వంచు సభాస్థలి వినివే
నమ్మిన వాడనే కొమ్మల వేడనే
తెమ్మెర డాయెనే నెమ్మది నోర్వగలనా
సమ్మతి చిగురాకు కెమ్మోవి తేనే లానగానే" (సా వ 49)

నాయకుడు తనకు గలిగిన విరహాన్ని నాయికకు వర్ణించడం ఈ పదంలో విశేషం

4 3 పరిశిష్టం

ఈ విభాగంలో రాయలసీమ వదకవులు వ్రాసిన మార్మిక తత్త్వాలు చేరుతాయి

4 3 1 మార్మికత 1

కీర్తనలో భావం స్పష్టంగా ఉండదు దీన్నే మార్మికత అంటారు మర్మమంటే రహస్యం, నిగూఢం అని సామాన్య అభిప్రాయం మర్మ మంటే జీవస్థానం, కిటుకు అని శబ్దార్థ రత్నాకరం

మార్మిక తత్త్వాల్లోని భావాలు అంటీ అంటక, చిక్కీ చిక్కక, దక్కీదక్కక దాగుడుమూతలాడుతుంటాయి వేదాంత పరమైన సొంకే తి శబ్దాల్ని వాడడమే దానికి కారణం వేదాంత విషయాలతో బాటు యోగ సంబంధ విశేషాలు చెప్పబడ్డాయి సంకేతాల ద్వారా, సంజ్ఞల ద్వారా,పొడుపు కథల ద్వారా విషయాన్ని నిగూఢపరచినట్లు చెప్పవచ్చు ఈ నిగూఢమైన తత్త్వాల్ని కొందరు అయోమయం అంటే మరికొందరు అర్థవంతం అని అన్నారు

వేదాంత విషయాల్ని గురుముఖంగానే నేర్చుకోవాలనే ఉద్దేశ్యం తోనే నిగూఢంగా చెప్పినట్లు ఊహించవచ్చు

రాయలసీమ పదకవుల్లో అన్నమయ్య, వీరబ్రహ్మం, సిద్ధయ్య, యాగంటికవులు, సారంగపాణి ఇలాంటి తత్త్వాల్ని ప్రస్తావించారు

అన్నమయ్య ·

దిక్కులేక పోయెనిట్టె దినదినము
వెక్కసపు లోకమేలే విభుడెవ్వడో ॥పల్లవి॥

గుత్తముగా నెల్లవారు గుడిచేటి కంచము
ఎత్తుక లోబెట్టుకొనె నెవ్వడో దొంగ
కొత్తగా యింతి గట్టికోక బయట వేసిన
మెత్తని దంటా బట్టి మింగె నెవ్వడో ॥దిక్కు॥

పై కీర్తనలోని భావం అస్పష్టంగా ఉండడం గమనించవచ్చును కీర్తనంతా ఇలాగే సాగుతుంది దీన్నే మార్మికత అంటారు

యాగంటి కపులు

గండుపిల్లి లోకమెల్ల గౌరవించి యేలంగాను
కొండ యెలుక లోక రెండు కొలుపు చేసెరా
అరిదగాని చిలుకలైదు అరవిగాచు చుండగాను
వండు కోతులోక రెండు ప్రియుముతో దిరిగెరా"
గుట్టు దెలసి తెలియరోరి గురుతుగాను జాణలారా
బట్టబయలునుండు దీని భావమెల్లను ॥గుట్టు॥ (డి-<489)

సారంగపాణి

మనసా నమ్మబోకే-యీయాద్రిగాము కళేభారం
మనసా నమ్మబోకే
మనసా యీయాద్రిగాము-మట్టి నట్టెంటిది
వనిశీటిలోనుండె-వరమాత్ముడెల్లాతటి ॥మను॥

తొమ్మిది సోరంఘాళతో శే వరమాశిగ
బెమ్మగా యించిది-బెష్టకారికట్టె ॥మను॥ (సా ప 150)

పై పదంలో మార్మికత స్పష్టంగా తెలుస్తుంది

వీరబ్రహ్మం

చెప్పెద గురుమహిమ తెలిసినంతట మీరు తెలుసుకోండి
విప్పిజెప్పగ నేనెంతటివాడను-శరణంటి నొవ్వుకొండి ॥చెప్పె॥

చింతమానీ మీద చేమంతి పూసేను తెలుసుకోండి-ఆ

చేమంతి మీదన చెంగల్వ పూసెను తెలుసుకొండి ॥చెప్పు॥

భూరూహమున రెండు పుట్టలు గలవయ్య తెలుసుకొండి–ఆ

పుట్టలలో రెండు పెను బాములున్నవి పట్టుకొండు ॥చెప్పు॥

(సుజ్ఞాన రత్నావళి – 4)

పై కీర్తనలో భావం నిగూఢం చింతచెట్టులో చేమంతి పూయడం చేమంతి మీద చెంగల్వ పూయడం, మొదలైనవి జరగవు కాని వీటికి ఏదో నిగూఢమైన అర్థం ఉందనడంలో సందేహం లేదు కాబట్టి దీన్నే మార్మిక తత్త్వం అనవచ్చు

సిద్ధయ్య

"తియ్యని మామిడిపండు – పండు

తినబోతే దొరకదు తిపులు రెండు తియ్యని

పండుకు వృక్షము – వ్రజలెవ్వరెఱుగరు

పరమాత్ముడనే యూఇ పై నుండరా

పండు ఇరవై యొడు పర్వములై యుండు

చరమ గురుధ్యాన పరులకే పండు" ॥తియ్య॥

(సుజ్ఞాన రత్నావళి – 30)

ఈ పదంలో పొడుపు కథ రూపంలో భావం దాగివుంది

1 4 సంకీర్తనల్లోని భాష

రాయలసీమ పదకవులలోని సంకీర్తనల్ని భాషాదృష్టితో రెండు రకాలుగా వర్గీకరించవచ్చు, 1 సంస్కృత సంకీర్తనలు 2 తెలుగు సంకీర్తనలు

4 4 1, సంస్కృత సంకీర్తనలు ~

రాయలసీమ పదకవులలో తాళ్లపాక కవులు, సారంగపాణి

మాత్రమె అంటే వైష్ణవ పదగాయకులు మాత్రమే సంస్కృత సంకీర్తనలు వ్రాశారు

తాళ్లపాక కవుల్లో మొదటివాడైన అన్నమయ్య సంస్కృత సంకీర్తనలు వ్రాయడానికి ప్రధానంగా ఆరు కారణాలు కనిపిస్తున్నాయి

1 అన్నమయ్య సంకీర్తనకారుడు కావడం వల్ల, లాక్షణికుడు కావడం వల్ల లక్షణాల్ని విశదంగా చెబుతూ లక్ష్యంగా సంస్కృత కీర్తనలు వ్రాసి ఉండవచ్చు

2 తనకున్న సంస్కృత భాషావైదుష్యాన్ని ప్రదర్శించడం కారణం కావచ్చు

3 అన్నమయ్య కాలం నాటికి ఆంధ్రదేశంలో గీత గోవిందానికి ఉన్నప్రచారాన్ని దృష్టిలో పెట్టుకొని తాను కూడా వ్రాయాలనుకోవడం కారణం కావచ్చు,

4 అన్నమయ్యది భక్తి మతం కావడం వల్ల పండితుల్ని మధ్య తరగతి ప్రజానీకాన్ని తనవైపు తిప్పుకోవడానికి సంస్కృతంలో కూడా కీర్తనలు వ్రాసి ఉండవచ్చు

5 వేదాంత బోధనకు ప్రౌఢభావ ప్రస్ఫుటీకరణకు, శిష్ట సాహిత్య సృష్టికి సంస్కృత కీర్తనలు తగిందని నిరూపించడం కారణం కావచ్చు

6 కన్నడ హరిదాసులలో శ్రీపాదరాయలు, వ్యాసరాయలు కూడా సంస్కృతంలో "దేవరనామ" అనే పేర్లతో కృతులు వ్రాయడం

అన్నమయ్య దృష్టిలో ఆకళించుకొన్న పెదతిరుమలయ్య కూడా ఆ పంథాలోనే సంస్కృత కీర్తనలు వ్రాశారు అయితే అన్నమయ్య సంస్కృత ఆధ్యాత్మిక, శృంగార సంకీర్తనలు వ్రాశాడు పెదతిరుమలయ్య

చిన తిరుమలయ్య, సారంగపాణి సంస్కృత ఆధ్యాత్మ సంకీర్తనలు వ్రాశారు

అన్నమయ్య సంస్కృత శృంగార సంకీర్తన

"అహో సురత విహారోయం
సహజ వశాజయశంకానాస్తి
యమునాకూలే సుమలతా గృహే
విమలసైకత వివిధస్థలే
రమణీ రమణౌ రమతస్తయోః
ప్రమదస్య పరాత్పరం నాస్తి ॥అహో॥ (14-78)

సంస్కృత ఆధ్యాత్మిక సంకీర్తన

నమిత దేవం భజే నారసింహం
సుముఖ కరుణే క్షణం సులభ నరసింహం ॥పల్లవి॥

విజయ నరసింహము వీరనరసింహం
భుజ బలపరాక్రమ స్ఫుట నృసింహం
రజనీచర విదళన విరాజిత నృసింహం
సుజన రక్షక మహాశూర నరసింహం ॥నమిత॥ (3-514)

పెద తిరుమలయ్య

వందేహం జగద్వల్లభం దుర్లభం
మందర ధరం గురుం మాధవం భూధవం ॥పల్లవి॥

నరహరిం మురహరం నారాయణ పరం
హరి మచ్యుతం ఘన విహంగవాహం
పురుషోత్తమం వరం పుండరీకేక్షణం
కరుణా భరణం కలయామి శరణం ॥వందే॥ (21-235)

చిన తిరుమలయ్య

మాజహిహా దుష్టమనాయితి
యోజయ తవ పదయుగా మృతేన ||పల్లవి||

పరమాత్మన్ మమ పామరచిత్తం
చిరం పాపం చికీర్షతి
కరుణానిధే ర్యకారణ బంధో
గురుతరాం కృపాంకురుమయిదేవ ||మాజ|| (16-1-7)

సారంగపాణి.

శ్రీలలనామణి రమణా – శ్రితపోషణ సుగుణా
శిలాఖిల మమ వేణుగో-పాల హెచ్చరికె
మురళిరవలోలా సుందర లలిత కపోలా
పరమాత్మా శ్రీవేణుగోపాలా హెచ్చరికె
దివిజార్చిత చరణా నమధిక విఖ్యాతకరణ
భవపాశహరణ వేణుగోపాలా హెచ్చరికె
నవకాంచన చేలాదా – తవ గర్వ విషాలా
భావ సమ్మత శ్రీవేణుగోపాలా హెచ్చరికె (సా.ప 197)

4 4 2 తెలుగు సంకీర్తనలు

తెలుగునాట వెలసిన వాగ్గేయకారులు తెలుగులో సంకీర్తనలు వ్రాయడానికి కూడా నాలుగు కారణాలున్నాయి

1 వైష్ణవుల "నాలాయిర" దివ్య ప్రబంధపఠన ప్రభావం
2 వీర శైవుల వచనాల ప్రభావం
3 కన్నడంలో నరహరి తీర్థ, శ్రీపాదరాయ, వ్యాసరాయాదుల "దేవరనామగళ్" ప్రచారం,

4. నరసింహాచార్యుల చాతుర్లక్ష సంకీర్తన ప్రభావం

రాయలసీమ వదకవుల తెలుగు సంకీర్తనల్ని భాషాదృష్టితో మూడు శకాలుగా వర్గీకరించవచ్చు,

1 గ్రాంథిక సంకీర్తనలు
2 శిష్టవ్యావహారిక సంకీర్తనలు
3 వ్యావహారిక సంకీర్తనలు

4 4 2 1, గ్రాంథిక సంకీర్తనలు

ఈ కోవలో చేరిన సంకీర్తనలు వ్యాకరణ నియమాలకు చాల దగ్గరివిగా ఉన్న పదజాలంతో సాగుతాయి. తాళ్ళపాక కవులు, సారంగపాణి ఇలాంటి కీర్తనలు వ్రాశారు

అన్నమయ్య

ఇంతి చెలువమే యూతనికి
కంతుని చేతల గలసిన వేళ "పల్లవి"
చిత్తజ కేళి నీ చెలి కువగిరులివి
హత్తిన రమణుని కాధ (దః) రవు
నెత్తమి తావుల నిట్టూర్పుగములు
కొత్తగు బడలికకును పరిహారము" "ఇంతి" (30-45)

పెద తిరుమలయ్య :

"తలపులో విరహమో తరుణిపై మోహమో
చెలియ సింగారమో చెప్పరమ్మ చెలులా ॥పల్లవి॥

చిత్తరు పటముమీద జెలియనెమ్మోము వ్రాసి
గుత్తపు బందుకుడవని గుండె వగిలె

కొత్తగా ద్రిమ్మరశాకై కుచమండలము వ్రాసి
చితరి జక్కవలని వ్రాయుడట్టి భ్రమసే ॥తలపు॥ (23_511)

చిన తిరుమలయ్య

ఇందరు నేడదూరేరు వాతవే నీవు సేయగా
ముందు ముందె తమ్ముగర్మములు సేయుమంటివా ॥పల్లవి॥

తెలిసి నిన్ను గొలువ దేహమిచ్చితివి గాక
ఒలిమినె మాయలలో బడుమంటివా
మలసి నిన్ను దలచ మనసిచ్చితివి గాక
కొలగొట్టి విషయాల గోరుమంటివా ॥ఇంద॥ (16-1-40)

సారంగపాణి

"వనజాక్షి బోటులెవ్వరైనా యిచ్చట యున్నా
వనిదాని సముఖాన మనవి జేసిరైన
చెరనమ్మిన చనవ సుంతైన కొనియాడునా
అనువుగను నమదినము రాజ
వ్వనిని గలసిన వనులు హాయలుగ
తనిసి యున్నది నీకు మనవుమా" (సా వ 62)

4.1 2 2 శిష్టవ్యావహారిక సంకీర్తనలు

వేదవిదులే శిష్టులని కొందరి అభిప్రాయం వ్యాకరణం చదువు కొన్నవారు శిష్టులని మరొక అభిప్రాయం ఎవరి భాషవేషాదులు ఇతరు లకు అనుకరణ యోగ్యలవుతాయో వారే శిష్టులని మరొక భిప్రాయం అలాంటి వారి భాషలో సంకీర్తనలు వ్రాయడం శిష్టవ్యావహారిక సంకీర్త నలవుతాయి ఈ సంకీర్తనల్లో అక్కడక్కడ గ్రాంథికం దొర్లినా భావ ప్రకటనలో వ్యావహారిక సరళి ఎక్కువగా కన్పిస్తుంది .

రాయలసీమ పదకవులందరు ఇలాంటి రచనలు చేసినవారే

అన్నమయ్య

ఇన్నిటా జాణలైన వారెరుగుదు రీయింపు
చెన్నుగా దైవము తొల్లె సేసిన దీయింపు ॥పల్లవి॥

పేసగి కాలము నాటి వెన్నెల లింపు
సేసలు వెట్టే యప్పటి సిగ్గులింపు
వేసరక అత్తవారి విందులు యింపు
మోసపోని యట్టి రతిమోవి తేనెలింపు ॥ఇన్ని॥ (30-551)

చిన తిరుమలయ్య

తలపెన్నడు నిను దగులునయ్యా
చలమెన్నడు కడు చనునోయయ్యా ॥పల్లవి॥
మోహం బెన్నడు ముదుసునయ్యా
దాహం బెన్నడు తలగునయ్యా
సాహసమెన్నడు జరగునయ్యా
శ్రీహరి తెలియంగ జెప్పగనయ్యా ॥తల॥ (16-1-18)

పెద తిరుమలయ్య

మగరూపు గైకొన్న మగువ వంటివాడవు
నిగుడి నిన్ను గెలువ నేడు మాతరమా ॥పల్లవి॥
మాటలు నీవాడగానే మచ్చికలు నోరూరి
తేటల నీచేతలెంత తియ్యనుండునో
ఆటదాన నేనింత ఆన్నిటాను జొక్కితిని
పాటించి పురుషులెంత భ్రమతురో యింకాను॥మగ॥ (23-137)

సారంగపాణి

భక్తితో పిలిచి పెట్టిన యన్నము
పట్టెడైనను చాలు-చెవులకు ॥పల్లవి॥

రక్తిగా వాతమైన పాట
పల్లవి విన్నా చాలు కృష్ణా ॥అనుపల్లవి॥

భావము దెలిసిన నాయకురాలితో
భాషించిన చాలు - తెలిసిన
కోవిదులకు కరుణ నిచ్చుదానము
కొంచెమయినా చాలు కృష్ణా ॥భక్తి॥ (సా వ 165)

వీరబ్రహ్మం

ఎంతమంచి గురుడు దొరికెనే - ఓయమ్మలారా ॥పల్లవి॥
ఎంతమంచి గురుడు దొరికె
అంతరంగమందు నన్ను
చింత లేక గురునిపాదము
చెంతజేరియుండుమనెనే ॥అనుపల్లవి॥

కన్నులు వీనులు మూసి-గాలిరాక పోకదెలిపి
పున్నమ వెన్నెలబైట-కన్నుదెఱచి చూడుమనె ॥ఎంత॥

(సుజ్ఞానరత్నావళి 3)

సిద్ధయ్య

"జలజాక్షి రమ్మనెనే
సద్గురుడు ప్రసాదముకొమ్మనెనే
కలికిరో యేమనుచు జెప్పుదు
కంటిలోపలి ముంటి కుదవల
వెలుగు సూక్ష్మపు జ్యోతిలోపల
విశ్వరూపము తెలజూపును" (సుజ్ఞాన రత్నావళి)

యాగంటి కవులు

యెన్ని నేర్పులు గలవు యిల్లాలుతనమునకు వన్నె ॥పల్లవి॥
పతితో యెదిరించి పలుకనది యిల్లాలు
పతిదేవుడని చేపట్టుడిల్లాలు ॥అనుపల్లవి॥

పరమేశు కథ వినుచు ప్రబలునది యిల్లాలు
పరధనంబున కాశపడనిదిల్లాలు
ఇహము పరము నెరిగి బ్రతికినదిల్లాలు
పరనింద చేయదు ఆ పరమ యిల్లాలు ॥యెన్ని॥ (డి-2494)

తరిగొండ వెంగమాంబ

బ్రహ్మ మేదో దెలుపరయ్యా బ్రాహ్మణులారా ॥పల్లవి॥
పరబ్రహ్మ మేదో దెలుపరయ్యా బ్రాహ్మణులారా ॥అనుపల్లవి॥

బ్రహ్మ మేదో దెలుపరయ్యా భ్రాంతి లేక జీవునకు
కర్మరహితమైన మోక్షగతికి పొయ్యేటందుకు బ్రహ్మ॥
[సుజ్ఞాన రత్నావళి - 81]

గుంటుపల్లి కోటిలింగయ్య -

తెలియరాదు సుమీ నిజగురు మహిమ తెలియరాదు సుమీ
కలజాగ్రత్త లోకతీయని తెలిసితె
నిలకడ బయలు నిజముగయున్నది ॥పల్లవి॥

పిండమనగరాదు అది బ్రహ్మాండ ఖండననరాదు
ఖండాఖండముగాక నంతటను నిండియుండిన నిత్యమితరులకు
॥తెలియ॥ [తత్త్వాలు-18]

4 4 2 3 వ్యావహారిక సంకీర్తనలు

సమాజంలో కులం, ఐశ్వర్యం, పదవి కారణంగా ఉన్నతులు తదితరులు అనే విభాగం చేయడానికి వీలుంది ఉన్నతులు కాని వారి భాషా పేషాడల్లో వింతలు గోచరిస్తాయి సాంసారిక జీవనంలో కలుపుగోలుతనం, అది సమయంలో కలహప్రియత్వం వినోదాపేక్ష మొదలైనవి చోటుచేసుకొంటాయి పట్టణాలు తక్కువై పల్లెటూర్లలో ప్రజాజీవనం సాగుతున్న రోజుల్లో వ్యావహారికభాషకు, వ్యావహారిక భాషలో వ్రాసిన వాఙ్మయానికి వాడివేడి ఉండేవి అందువల్లనే మతప్రచారానికి కంకణం కట్టుకొన్న వాడు ఈ భాషను, ఈ భాషకు దోహదం చేసే జానపద గేయ ధోరణుల్ని విరివిగా ఆశ్రయించాడు

రాయలసీమ పదకవుల్లో తాళ్ళపాక కవులు జానపద గేయ ధోరణుల్ని చేపట్టి రచనలు చేశారు సారంగపాణి మరొక మెట్టు క్రిందకు దిగి గ్రామీణభాషలో పదులు సంఖ్యలో పదాలు పాడాడు తదితరులు శిష్టవ్యావహారానికే పరిమితం అయ్యారు

అన్నమయ్య

సి(చి)న్న వాడవని నమ్మసెల్లదు నిన్ను
సిన్నెన యాటదెల్ల సిక్కసిరై వోయారు ॥పల్లవి॥

అవురబాలకి సునరాయడ నీవు సంటిపాలు
సవులంటా నెత్తురెల్ల సప్పరించగా
కవకవనవ్వి నవ్వి కన్నులు దేలగిలగ
"నవరన్ని (ని) యాటదెల్ల సస్సినారై వోయాను ॥సిన్న॥
[12–15]

అదే విధంగా—

"ఓహో అదేడ సుద్ది వోశక్క
కోపగించు కొందురటె గొబ్బున నోశక్క ॥పల్లవి॥
చెల్లుండి గిలవాడు చేతికి బడెవియ్యగ
వొల్లనందుర టవె వోశక్క
గొల్లదానవంటా నీ కొంగుపట్టి తియ్యగాను
మల్లాడు దురట శేమరియు నోశక్క ॥ఓహో॥ (31-427)

పెద తిరుమలయ్య

"దొమ్మి సరసాలాడితే దొరతనాలు సెల్లునా
వుమ్మడినే సక్కనాయ మండవయ్య నాయడా ॥పల్లవి॥
వోసోసి నీవనగా వోరోరి నేననగా
జేసిసరి మాటలివి ఔరసిగారా
కాసు సేయని పనికి కల్లలు గారులు నీపై
మోసిరాగా మళ్ళీ మళ్ళీ మొక్కవద్దు నాయడా" (23-128)

చిన తిరుమలయ్య

అంతేవో నాతోడ నేగాదనగరాదు
వంతమాడి గెలిచితే బంటవయ్యేవా
కానీ తేరా బొడుపుడుగతలు వొడుపుమని
ఆనవెట్టి నన్నేల అడ్డగించేవు
పూని నాకతలు నీకు బొందుగా దిలియకుంటె
పానివట్టి నీవె నా బంటవయ్యేవా" (16-2-88)

సారంగపాణి

మానల కరీదికరంగా బదలక - శుచిగా మంచల వీరందోయి
॥పలవి॥

యేసనదెల్దోయి రేతిరి దొరద్ద
యానగొట్టియాల నిలబడదిగితే ||అనుపల్ల వి||

నెగిరొర్లో నక్కంగ బట్టల్నినే
నడిమద్దెపు నా కొండల కిరితిరెం
బగుమానము సేసి దండపడుదురె
యాటికెల్ని - చాముర్తి యిద్దెకు ॥మాస॥ (సా ప 146)

రాయలసీమ పదకవుల్లో తాళ్ళపాక కవులు, సారంగపాణి, యాగంటి వారు తమ సంకీర్తనల్లో పండిత, పామర జనుల వ్యవహారంలో అయా చితంగా దొరలేసామెతల్నికూడ వ్రాశారు వాగ్గేయకారులలో అన్నమయ్య కీర్తనల్లో ఎక్కువగా సామెతలు కన్పిస్తాయి

4 5 సామెతలు

సామెతలేనిమాటవిందులేని ఇల్లులాంటిదని ప్రతీతి అందుకే రాయల సీమ పదకవుల్లో ప్రత్యేకించి అన్నమయ్య పదాల్లో విరివిగా సామెతలు చెప్పబడ్డాయి

అన్నమయ్య

అంగము విడు జానలు అనకొండలపొడవు 8-115
అద్దమువంటి వయసు అమ్ముకొంటి కోపము 13-258
అకటికి గ్రుక్కిళ్ళు అగుయినట్టు 6-96
ఊరు దియ్యం జేను వచ్చె 2-233
ఎంత తొండమున్న దోమ ఏమగన్నునా? 13-191
ఏనుగు మీది వానిని సున్నమడుగుట 5-187
కూడు వండుట గంజి కొరకా 2-115
కూడు లేక యాకటికి గూర్చదిన్నట్లు 5-137

కొండంత కనకపోకకు వెలయిడినట్లు 9-285
గడ్డపార మింగితే నాకలి దీరేనా 5-119
గుడ్డికుక్క సంతకుపోయి తిరిగి దుడ్డుపెట్లెకాక దొరికేనా 11-౬-8
చంచలము మానితేను సంసారమే సుఖము 10-25
చెప్పరాని మాటలు చెవియొగ్గి విననేల 18-391
చనువు గలుగు వారు జడియుగనేటికి 30-346
జల్లెడ నావాలు జారినట్లు 7-260
జతగాని తరుణి యేజాతై ననదే చాలు 2-114
తేలు తొక్కితే యొడ్డించకుండునా 8-273
తప్పులెంచే పనులైతే తాజేయనేల 19-365
తెలిసిన మాటకు తెరమరుగేటికి 17-416
తేనెతీపు తేనీగకు తెలివియౌనా? 30-116
నిం న యుద్ధములోన సీడవాడ చూపినట్టు 6 140
నిప్పుదెచ్చి ఒడిలోన పెట్టుకొను 5-301
నెయ్యని పోసుకోరాదు నీళ్ళని చల్లగరాదు 14-35
పరిగతేరే వానిని పట్టపురాజు చేయుట 5-185
పరుసము చేతనుంటే బట్టినదెల్లా బంగారమే 30-224
పూవువల్ల తుంగ తలకెక్కినట్లు 9-151
పెనురాతిపై గడవపెట్టగా గుదురైనట్టు 6-140
పెళ్ళిచెట్టు మందుగాదు 25-92
బచ్చువరూపులు పచ్చల కోలపుల 5-24
భూమెల్లా మేసినా నా పోతుకు ఒందలేదు 6-29
మంచు గుంచాన కొలిచినట్లు 3-329
మన్నుదినేటి దూడను కన్నుగట్టి యెండాక కాయవచ్చునా 2 19
మగడు విడిచినా మామ విడువని యట్లు

పెద తిరుమలయ్య

మాని పండ్లు రాలితేను మానికిందనే 23-41
మింగిన కథికి నిక చవులెంచనేల 23-416
ముందరి చెవుల కంటె గొప్పలై వెనకవచ్చే కొమ్ములవాడియగు 23-35
ముంజేతి కంకణాన కద్దమూ యింక 23-44
ముంతనీట బడబాగ్ని ఆరునా 21-10
మోపు మోయనేగాని మూలుగగ పొద్దులేదు 21-199
రెండికి కొరగాని రేవని కథ 21-93
విత్తొకటి పెట్ట చెట్టొకటి మొలచునా 21-154
శిరసుండ మోకాల సేసలు వెట్టు 21-120

చిన తిరుమలయ్య

అదము చిలు మబ్బినట్లు 16-1-15
అల్లము తెల్లమౌనా 16-1-16
ఎంత సేసినా జతెత యేల తీపుమాను 16-2-18
కలగన్న చోటికి గంప నెత్తినట్లు 16-1-14
కొండలనీరు నేలకు పారు 16-1-16
గద్ద మూకలో కోడిపిల్ల 16-33
చంచల మతులకు దెలియునే సాత్విక ధర్మములు 16-2-15
చప్పనయు దీపు చెఱకునందె 16-1-13
తల్రిందేల మేరువు తలనుండగా 16-1-14
తెలిపే గురుడుండగ తెలియగ నేరవు 16-1-14
నాతుల సుద్దులు చింతకాయల వంటివి 16-2-9
పారే బండికి కాలు చాచేవా 16-1-14
పైడి పక్షి సకినగాడు 16-1-22

సారంగపాణి

రోతము వంగేది లోతునీళ్లకే గదా 102
వంకాయకు వచ్చిన చాలేగదా బెంకాయకు వచ్చేది 107
వానలు గురిసితే వాతలు మానునా 182
వేముల తీయదన మాయెగా 25
శివశివా అతని మోము జూచి సేతు యాత్రకాయి వచ్చిన దీరదు 57

యాగంటి కవులు -

"వటులింగ తేజ సర్వాణి గాకుండెను
చెట్టు మీద నొకరాయి చిక్కినట్లు గాదా
అటు దేహ ఒహురూప మిటు గానకుండెను
వట్టి గుళ్ళలో నముశ్శివో యుమటు గాదా (డి-2489)

"నివురు గప్పిన రీతి" (డి-2494)

4 6 వింత పద ప్రయోగాలు

తాళ్లపాక పదకవులు, సౌరంగపాటి తమ పదాలలో తమ కాలం వ్యవహారం లోని కొన్ని పదాలను ప్రయోగించారు తాళ్లపాక కవులు ప్రయోగించిన నాటి వ్యవహార పదాలకు కొన్ని నిఘంటువుల్లో ఉన్న అర్థం కుదరదు ఇలాంటి వాటిని శ్రీగౌరిపెద్ది రామసుబ్బశర్మగారు శ్రీరాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు, శ్రీవేటూరి అనంతమూర్తి గారు చర్చించారు సౌరంగపాటి ప్రయోగించిన పదాల్ని డా!! ఎస్ గంగప్ప గారు చర్చించారు

అన్నమయ్య

అన్నమయ్య వాడిన అశేష పదాలను రాయలసీమ వ్యవహారిక

భాషతో సరిపోల్చి చూచినపుడు కొంతవరకు అర్థ వివరణ చేయడానికి వీలుంది

అరవిరి అందము (3-269)

శబ్దరత్నాకరంలో సగము విరిసిన మొగ్గ, ముకుళము అని అర్థం కాని అన్నమయ్య అందము అను అర్థంలో ప్రయోగించాడు

ఉదా "అందపు రెంటుకన్నుల నరవిరి నీమోము
చెందమ్మి రేకుల బోల జెల్లునయ్యా విరల" (3-269)

అల్లిరము పెండ్లి విందు

ఈ పదానికి నిఘంటువుల్లో అర్థం కానరాదు పదబంధపారిజాతంలో ఈ ప్రయోగానికి "అల్లెము" "తిను" అని అర్థనమ్మది కాని అన్నమయ్య పెండ్లివిందు అను అర్థములో ప్రయోగించాడు మచ్చుకు–

"అన్ని చోట్లామండి అల్లిరము లారగించ
వెన్నుడపై వేడుకతో విచ్చేసినట్లు" (9–144)

ఏటవేయు గుడిపెట్టు

ఈ పదానికి శబ్దరత్నాకరంలో ఏట=పక్షము అని అర్థం పదబంధ పారిజాతంలో బలియిచ్చు, ఖారము వేయు అను అర్థాలున్నాయి

కాని అన్నమయ్య "చూపునిగుడ్చు" దృష్టిని సారించు అనే అర్థంలో ఉన్నట్లు వేటూరి ఆనందమూర్తి అభిప్రాయం ఉదా -

"వేగి లేచి సంసార విధులకే వొడిగట్టి
యేగతి గొసరి నీపై నేటు వేసేము" (10-2)

కపురు   రూపు ఆకృతి

ఈ పదాన్ని నిఘంటువులు పేర్కొనలేదు అన్నమయ్య
ప్రయోగించాడు.

యిపుడు శ్రీవేంకటేశ యిన్నిటా నన్నేలితివి
కపురైన మానుతులు ఘనము గాదయ్యా (2-176)

కొచ్చు   తొలగ జేయు

ఈ పదానికి ప్రౌఢ్య నిఘంటువులో "త్రవ్వుట" అను
అర్థమున్నది,

కాని అన్నమయ్య "తొలగజేయు" అను అర్థంలో ప్రయో
గించాడు

"కోపమెల్ల గలిగిన-కొచ్చి శాంతమిచ్చుటకు" (7-196)

గరివడు   చిక్కువడు, తగుల్కొను

శబ్దరత్నాకరంలో "గడ్డకట్టు" అను అర్థముంది కాని
అన్నమయ్య "చిక్కువడు" "తగుల్కొను" అను అర్థంలో
ప్రయోగించాడు

"తిరువేంకటాద్రి పై దేవుని గొలువక
గడివడే భవమెల్ల కర్మశేషం" (11-347)

గురుసు   పెద్దరికము, మహామ

శబ్దరత్నాకరంలో ఈ పదం లేదు అన్నమయ్య "పెద్ద

రికం, మహిమ అనే అర్థాల్లో ఈ పదాన్ని ప్రయోగించాడు
"పొన్నలలో వేగబొద్దు పొనివే యిక (25-449)

గుల్కుసేయు ఖాడిసేయు, నిథుత ప్రహరచు, బాధించు పదకొశాల్లో ఈ పదం లేదు అన్నమయ్య తనపదాల్లో పేర్కొన్నాడు

"మించు మురిపాలె కావా మిగులంజొక్కించేవి
కొంచని బీరాలె కావాగుల్కుసేసేవి" (3-132)

గొడ్డేరు వ్యర్థం, దండుగ

పదబంధ పారిజాతంలో "నిర్దిష్ట లక్ష్యముతో" తెచ్చు అను అర్థముంది

కాని అన్నమయ్య వ్యర్థం, దండుగ అనే అర్థంలో ప్రయో గించాడు

"గొడ్డేరే చిన్నదిడ్డి తెరవుపోక
దొడ్డ తెరువు వంక తొలగు మీ" (2 89)

గోదిలి పశువులను కట్టు గాడి

ఈ పదం తెలుగు నిఘంటువుల్లో లేదు అన్నమయ్య ఈ పదాన్ని ప్రయోగించాడు

"గోదిలి కడు గుంగుటకు నెక్కుటకు
యీదెస కడు విజ్ఞానమే కలది" (10-7)

కర్ణాటక నిఘంటువులో ఈ అర్థమే స్ఫురిస్తుంది,

గోరుపోవు తప్పిపోవు, పొల్లుపోవు

నిఘంటువులందు ఈ పదం లేదు అన్నమయ్య 'తప్పి పోవు' "పొల్లుపోవు" అను అర్థంలో ప్రయోగించాడు

'మాట గోరు పోయినంటా మౌనాన నుందువు గాని
నీటున ముచ్చటాడకు నేమానరా" (3-518)

చింతాయకుడు = చింతలను పోగొట్టువాడు
పదకోశాల్లో ఈ పదం లేదు
అన్నమయ్య ప్రయోగించాడు

"శ్రీరమణుడే చింతాయకుడేని
వూరకవుండుట వొక సుఖము" [9-256]

చేలాగు = చేయూత
శబ్దరత్నాకరములో ఈ పదంలేదు
అన్నమయ్య ప్రయోగించాడు

"చెమట చన్నులు దాక చేలాగు లిచ్చి
అమరలోనికి దెచ్చునది యెవ్వతో" (25-14)

తావళించి = అలస్యం
సూర్యరాయాంధ్ర నిఘంటువులో అవకాశము అను
అర్థముంది

కాని అన్నమయ్య "అలస్యం" అనే అర్థంలో ప్రయో
గించాడు

"నీవు విచ్చేయుండగాను నేలోన జలకమాడి
తావళించి వచ్చుదాకా దడవాయుగా" (22-259)

దూష్టికము = పొగరు బోతుతనం
శబ్దరత్నాకరంలో ఈ పదంలేదు.
అన్నమయ్య ప్రయోగించాడు.

"అమర శ్రీవేంకటేశ అట్టినన్ను గూడితివి
సముకాన నీకె కెంత సంగది దాక్షిణము" (24-143)

నుసికిలు = జారు, అంటీ అంటని యట్లు
నిఘంటువుల్లో ఈ పదంలేదు
అన్నమయ్య ప్రయోగించాడు

"చెనటి యే పుణ్యమైన జేయని యోగీశ్వరుడు
నూనే గొల్పిన కుంచమై నుసి కిలుము" (8-375)

వల్లించు = ఆయత్తము చేయు, సాధించు
ప్రౌఢ్య నిఘంటువులో "గుర్రానికి జీను కట్టించక"
అని అర్థముంది. కాని అన్నమయ్య గుర్రాన్ని

"ఆయత్తం చేసికొనక" అనే అర్థంలో ప్రయోగించాడు
"వల్లించిన నీవసిడి గరుడనిని-కెల్లున నీవెక్కిన యపుడ
[11-3-20]

బయకారించు = అభినయించు, లేనిది పైకి నటించు
బయకారము=సంగీతం
బయ కా (రి) డు=సంగీత విద్వాంసుడు మున్నగు
రూపాలు ప్రసిద్ధాలు కాని అన్నమయ్య "అభిన-
యించు, లేనిది పైకి నటించు" అను అర్థాల్లో
ప్రయోగించాడు

"నయము చాలనిచోట నవ్వులు నవ్వంగ బోతే
బయకారించె ననవా పక్కన నీవే" (17-553)

బొనదాన = సులభం
ఇది నిఘంటువుల్లో కానరాదు

అన్నమయ్య ఈ పదాన్ని ప్రయోగించాడు.

"యెనగ శ్రీవేంకటేశుడు డితడె మా యేలిక
సునరాన నిన్ను నీవె గుణ సుగాక" (22-7)

పెద తిరుమలయ్య

అరడు   అలరి యరడు (?) వద్ది తీగె అంటబార కేలమాను" (21-438)

ఆనివట్టి   "తానింత నేర్పరి యౌట తరుణు లెఱుగరా
ఆనివట్టి ఆపెకు నాట నేర్పిని" (23-188)

బఱ్ఱిబాగు   "వెగ్గలించ వచ్చుగాని వేసటి పుట్టినవేళ
వొగ్గికొన వేయరాదు వ్రెఱ్ఱిబాగు గుణము" (23-209)

ఓరికొట్లు   సారె జారు దురుము నిలిపి చనుమొనల దాకించి
వోరికొట్లు (?) దనవుదుటు చూ౦" (23-65)

కపురా   "ఆందుకేమి దోసము అంతవాడ వౌదువయ్యా
గంధము పూసిన యట్టి కపురా (?) యిది" [23-135]

కూబలు   "చీకటి బెడ బాపేటి చేరువ సూర్యోదయము
చీకటి కూబల కైతే చిమ్మిరేచును" (21-136)

గుద్దిరాన   "యిద్దరము బానుపై యేకత మున్నార మంటా
గుద్దిరాన వాకిటనే కూచున్నది" (23-397)

చవుతము   "తెపెనే బిలిచితే లెక్కసేసినా తాను
సానివోయిపుమినాకి? చవుతమా? యింక [23 44]

చరణాయుతా   "అనఘాచరణాయుత భూతరణా
దినకర సన్నిభ దివ్యాభరణా" (21-260)

రుమూరాడు — "చేరువ సంతోషమెచ్చె శ్రీధరా
చిరు మూరాడి (?) దమి శ్రీధరా" (21-245)

చెరపు — "దిన సంభ్రమములతో దేవదుందుభులు మ్రోయ
తన చెరపులు పైపై దాసులు సేయ" (21-189)

తప్పబారు — "ఎఱుగు కోలేని జీవి యెడ్డగాక
గుఱి నెంతయినా గోతికొమ్ము దప్పబారునా"
(21-154)

తుంగిన — "తూలిన శ్రుతులు దెచ్చి తుంగిన (?) భూమి
యెత్తె" (21-236)

తొడలు — "తొడమీద దొడవేసి తొదలు [?] మాటాడి, నీ
కడ చూచెనిది యెంత కలికి యోకాని (23-58)

దిడువు — "దిడుప్పై [?] శ్రీహరి నీవు తిద్దితే నేమోకాని
వెడగు నాగుఱ మిది విడువ దెంతయినా"
[21-121]

దైలువారు — "మితిలేని తురుము తుమ్మెదల బోలుచరే"
తలి బతిమోవిడేనె దైలువారు గాని"[23-240]

నుశికేశును — "చేనంటి యే పుణ్యమైనా జేయని యోగీశ్వరుడు
నూనె గొల్పిన తుంచమై నుశికేలును (?) "
[21-425]

పొనివట్టి — ప్రత్యముగా చూపు
'పొనివట్టి శరణంటేగా చేత వరమేకాంతము చెప్పె
డునా" [21-17]

పీగుచు — కౌగిట శ్రీవేంకటేశ గళలేల కాక్రించె
పీగుచు నాతడు వొట్టువెట్టుకో గాను" [23-306]

బండాలించు — "అంచుల నాకర్ణమనే అలుగు బండాధించితి
పెంచి యం|దియాల బంపు వెట్టకుమయ్యా
[21-111]

అగ్గస్తుడు — "అలిజిత్త మింద్రియముల అగ్గస్తుడూ (?)
తొలగ దోయగ నేది దొరతనమా" (21-62)

పీచరపెళ్ళి — "అదిగాని నన్నుటాయ మతరాత్మపై నీవు
పీదరపెళ్లి(?)పొందులు వినసంగతము" 21-165

పెంబలపెల్లి — "వెన్నెలగాయగా జూచీ పెంబాలపెల్లి యనేవు
తన్నుదానే పతిరాక తడసెనటే" (23-207)

సొత్తింపి — బుద్ధిమంతుడవుటెన్నడు భూమెల్లావెట్టులుగాక
తిద్దుకొనక సొత్తించి (?) తిరిగేరుగాక" (21-67)

సొడగిలి — "చూచి చూచి సొడగిలి సొంపుల నీచేతలెల్ల
తాచి తెరమాటుకైనా దలగరాదా" (23-446)

సారంగపాణి

ఈదోవ — ఈ మార్గం

"యీడున నను గూడి యీ దోవలావైతి
పింతంటి చెంద్రుడవు" (సా వ 35)

తుసకారమటే — తిరస్కారమటే
"రశిక శిఖామణీ రాజ్యాలేలే వరు
తుసకారమటే తెచ్చి దోసేటి కలికేవు" (సా వ, 109)

గాంధారి తనాలు — ఆగడం చేయడం
"ఏణాక్షిరో యీ సాంద్రాజ్యాని
యేమిటికే గాంధారి తనాలు" (సా.వ 116)

వారానికి — కౌలుకు తీసుకోవడం
"వారానికి పందుల సాకింది

వల్లమాల్పి కోళ్ళను బెంచింది" (సొ వ 119)

బయిశారి = బగిసి (మానంపోవడం)

"బారలు సామక జగడానికి రాకే
బయిశారి పోయ్యేవు మొలమ" (సొ ప 132)

పొంచులు విని = పొంచి వినడం

"ప్రొద్దెక్కక మునుపే రారాదు
పొంచులు విని బయట చెప్పరాదు" (సొ వ 194)

బంగిరుగెట్లు = బంగారు దిమ్మలు

"మాట్లాడిన లేదంటివి బంగరు
గెట్లు దాని కిచ్చితివిక నీసి" (సొ ప 15)

మచ్చుజల్లి = మత్తు జల్లి

"గచ్చులాడి నాపై వలి-గల్పించె గదమ్మా
మచ్చుజల్లి నాదువిభుని - మనసు విరచెనమ్మా"
(సొ వ 14)

ముడికే = కట్టుకోవడానికి

"ముడికే చాలని గుడ్డ ముచ్చట మరుపాయె" (సొ వ 83)

శాంధలము = నీచంగా ఉండడం

"వయి రొయెన్నె అడుగున - వరమ శాంధలము
మయిదు యిప్పుడు శిశి-మచ్చిగప్పిండాడు(సొ వ 149)

ఇవేగాక రాయలసీమ పదకవులలో అనాటి వ్యవహారిక పదాలను కూడ గుర్తించవచ్చు.

అన్నమయ్య

అగ్గువ = చవుక 8-170

| | | | |
|---|---|---|---|
| అద్దో | = | అదిగో | 22 269 |
| అడబాల | = | వంటకత్తె | 2-160 |
| అయు | = | అయ్యేను | 8-108 |
| అనిమి | = | పొడుగాటి సంచి | 22-327 |
| ఇల్లటము | = | ఇల్లరికం | 12-296 |
| ఈటు | = | ఈడు | 6-74 |
| ఉందానము | = | ఉన్నదానము | 13-322 |
| ఉద్దుఉద్దులై | = | ఒతజతలై | 2-74 |
| ఉంబళి | = | వన్నెలేనిది | 2-103 |
| ఏగుతా | = | వెళ్ళుతాను | 4-6 |
| ఏపొద్దు | = | ఏ దినం | 9-127 |
| ఒట్టు | = | తాకు | 2-30 |
| ఒడ్డారాలు | = | బయ్యారము | 24-170 |
| బలపక్షము | = | పక్షపాతము | 3-574 |
| కణజాలు | = | పాతరలు | 24-235 |
| కపురు | = | రూపు | 10-235 |
| కరగుకో | = | కరగించుకోవయ్యా | 13-527 |
| కవడువాయు | = | చీలిపోవు | 2-19 |
| కసవు | = | గడ్డి | 2-290 |
| కుదువ | = | తాకట్టు | 3-631 |
| కూడుకొందుగా | = | కలుసుకొని | 2-12 |
| కెల్లురేగు | = | విస్తారమగు | 7-256 |
| గబ్బు | = | కంపు | 26-373 |
| గునిసిని | = | ఎగిరిని | 25-43 |

| | | | |
|---|---|---|---|
| చాగతకొను | = | అదుము | |
| జంపు | = | పొడవు | 22_544 |
| జూటరి | = | మోసగాడు | 15-3 |
| దావతిపడు | = | అడ్డురాపడి | 12-18 |
| తీలు | = | కీడు | 11-2-41 |
| తెంకి | = | స్థానము | |
| దొబ్బేవు | = | తోసేవు | 22-91 |
| నాము | = | యూత్సర్వం | 7_56 |
| నిమ్మలాన | = | నిశ్చింతగా | 22-45 |
| వంగించు | = | నిందించు | 14-249 |
| పట్నాలు | = | పొట్లాలు | 26-485 |
| పై | = | ఒళ్ళు | 24-374 |
| బయకారించు | = | లేనిది పైకి నటించు | 17_553 |
| మంకు | = | మూర్ఖత్వం | 24_445 |
| మెకురు | = | మొండితనము | |
| ముయికిముయారొ | = | సరికి సరియయ్యె | 28-277 |
| మొరిగేవు | = | అబద్ధమాడెవు | 3_508 |
| యాడ | = | ఎక్కడ | 2-340 |
| లూటి | = | దోపిడి | 11_2-22 |
| సంబళము | = | జీతం | 5-143 |
| సొవివోవు | = | క్రమం తవ్వు | 8-105 |
| సవరేతిరి | = | అర్ధరాత్రి | 24_27 |
| శానాశానా | = | చాలచాల | 22_240 |

ఈ విధమైన రాయలసీమ మాండలిక పదాలు అన్నమయ్య
ందాల్లో కోకొల్లలు

ఎద తిరుమలయ్య

| | | |
|---|---|---|
| అచ్చలము | = కోపము | 23-48 |
| అద్దలించు | = ఊహించు | 23-67 |
| అడియాలము | = గుర్తు | 21-16 |
| అడబాల | = వంటవాడు | 21-154 |
| అగ్గువ | = సరసము | 23-440 |
| అక | = అడ్డము | 23-417 |
| ఎగపు | = గర్వము | 23-60 |
| ఎడకాటము | = తార్పుడు | 21-117 |
| ఒల్లనె | = తిన్నగ | 21-99 |
| ఓదెడు | = కొలత | 23-152 |
| కవణము | = ముద్ద | 23-180 |
| కిల్లాకు | = లేఖ | 23-541 |
| గజరు | = కోరిక | 23-138 |
| గోణము | = గోచి | 23-532 |
| జంగిలి | = ఆవులమంద | 21 424 |
| తొడుకు | = దొంగ తిండి | 23-416 |
| తారము | = కన్ను చూపు | 24-52 |
| దొబ్బట | = త్రోయుట | 23-16 |
| పులుగు | = గుర్తు, జాడ | 21-252 |
| బడకెళము | = కావలి | 21-118 |
| ముయికిముయి | = సరికి సరి | 23-268 |

| | | |
|---|---|---|
| మొల్లమి | = తరచు | 21-99 |
| వహమానము | = అహంకారం | 23 248 |
| సాపెన | = దూషణ | 23 420 |
| సుగుడి | = సరసుడు | 21-161 |
| సొంటు | = సొతు | 21-93 |

చిన తిరుమలయ్య

| | | |
|---|---|---|
| అటమటము | = మరుగుమాటు | 16-2-91 |
| ఆబిగాడు | = ఘనుడు | 16-2-98 |
| కుశిలిగాడు | = సమర్థుడు | 16-2-98 |
| పానివట్టి | = పురిదొక్కించి అని అర్థమేమో | 16-1-55 |
| తినుకు | = ఆవేదన | 16-1-40 |
| బతిమి | = వ్రతము (?) | 16-1-28 |
| బాలకి | = బాలిక | 16-2-119 |
| రుత్తవోవు | = రిత్త (వ్యర్థము) | 16-2-66 |
| వలుకు | = నింద | 16-1-30 |
| సటలడు | = బాధపెట్టు | 16-1-55 |

సారంగపాణి

| | | |
|---|---|---|
| ఒక బోకి | = ఒక పాత్ర | 131 |
| ఒక్కపొద్దు | = ఒంటిపూట భోజనం | 132 |
| కణజాలు | = పాతరలు | 83 |
| కోడ్దికొంటబోతే | = కోడిని తీసికెళ్ళితే | |
| గురకాయింతివో | = పరిగెత్తితివో | 131 |
| జాబుజట్రలు | = జాబులు మొదలైనవి | 117 |

| | | |
|---|---|---|
| బిగ్గె | = బిగ్గరగా | 19 |
| మడ్డి శరీరం | = సోమరితనం | 136 |
| రెయ్యి | = రాత్రి | 147 |
| వుండింది పండింది | = పూర్తిగా | 140 |
| శానా | = ఎక్కువగా | 136 |

తెలుగులో నిఘంటువులు చాలా తక్కువ. ఉన్నవికూడ బాగా ప్రచారం పొందిన గ్రంథప్రయోగాల ఆధారంగా కూర్చబడినవి. ఆ విధంగా కాకుండా పదసాహిత్యం, అనుసరించి కూడా నిఘంటువులను కూర్చవలసిన అవసరం ఎంతైనా ఉంది

సంఖ్యా సూచిక

1 అన్నమయ్య దశావతార కీర్తనలు — ఒక పరిశీలన

* *

# రాయలసీమ పదకవులు - పద ప్రయోగ విశేషాలు

5 1 పద స్వరూపం

"పదము"న్నమాట ఒక పారిభాషికశబ్దం ఈపదం ఛందోవ్యాకరణ శాస్త్రిలలోను, సంగీతంలోను వ్యవహరించబడుతుంది

5,1 1 నిఘంటువులలో పదం

"పాదం, పద్యపాదం, చరణం ఇసుకలోనగు చోట్ల గనబడెడు పాదచిహ్నం, చిహ్నం, శబ్దం, వాక్యం, పాట (అని కొందరు) ప్రయత్న స్థానం, కిరణం, కత్తెము (Term), ధనం "

"పదానికి సంబంధించిన పారిభాషిక పదాలు శుద్ధపదం, తుల్య పదం, పూర్వపదం, సాధారణపదం, శుద్ధసాధారణపదం "

—ఆంధ్ర వాచస్పత్యమ్

"పదం వ్యవస్థితత్రాణ, స్థానలక్ష్మాఙ్ఘ్రివస్తుషు"

"పదశబ్దము ఉద్యోగమునకు, రక్షించుటకును, స్థానము నకును చిహ్నమునకును అడుగునకును, వస్తువునకును పేరు"

"పద్యతే అనే నేతిపదమ్ పద్‌గత్" దీనిచేత పొందుదురు
—గురుబాల ప్రబోధిక అను (అమరకోశము)

"పాదం, పద్యపాదం, ఇసుకలోనగుచోట్ల కనబడు పాదచిహ్నము చిహ్నం, శబ్దం వాక్యం, ప్రయత్నం, స్థానం, కపటం, వస్తువు
—శబ్ద రత్నాకరము

"పాదం, అడుగు, పద్యపాదం, పద్యచరణం, అడుగుపెట్టి, గురుతు ఇసుకలోనగు చోట్ల కనబడెడు పాదచిహ్నం, చిహ్నం, స్థానం, ఆశ్రమము అధికారాది స్థానం, వాక్యం, శబ్దం, వేదమంత్రముల పదవి భాగం, వ్యాజరు, కపటం, త్రాణం, రక్షణం, ప్రయత్నం, వస్తువు పాట, గీతి భేదం"
—శ్రీ సూర్యరాయాంధ్ర నిఘంటువు

"I నాయికా నాయకలక్షణము గలిగి శృంగారరసప్రధానమైనట్టి సంగీత రచనలకు పదమనిపేరు ఇందు పల్లవి, అనుపల్లవి, చరణము అను విభాగములు గలిగియుండును దీనిలోని సంగీతముయొక్క నడక నెమ్మదిగను ఆకర్షణీయముగను ఉండును సాహిత్యం పాండిత్య ప్రతిభ గలిగి గంభీరమైన వేదాంతార్థం ఇమిడియుండును

II క్రియాకారం క్రియలచే ధైర్యశౌర్యాదులను చెప్పబడునట్టి ప్రబంధములోని ఆరు అంగములలో మూడవదానికి పేరు
—సంగీత శబ్దార్థ చంద్రిక

5 1.2 లక్షణ గ్రంథాలలో "పదం"

లాక్షణికులలో పదాల గురించి మొదట నిర్వచించినవాడు భరతుడు

ఆతడు "స్వర తాళ పదాత్మకమైంది గాంధర్వమనీ, స్వర తాళాను బావకమైన పదమే వస్తువనీ, అర్థసహితమైన అక్షరాలతో కూడినది పద మనీ, ఈ పదం నిబద్ధం, అనిబద్ధం అని రెండువిధాలనీ, అవి అతాలం, సతాలం అని రెండు విధాలనీ వివరించాడు.[1]

తాళ్ళపాక అన్నమాచార్యుడు "సంకీర్తన లక్షణ"మను లక్షణ గ్రంథాన్ని సంస్కృతంలో వ్రాశాడు. దీనికి పెద తిరుమలాచార్యుడు వ్యాఖ్యానం వ్రాశాడు ఈ రెండుదొరకలేదు. అయినా వాటినను సరించి తెలుగులో "పద" లక్షణం గురించి ప్రస్తావించిన వాడు తాళ్ళపాక చిన రుమలయ్య ఆతడు—

పదమగు సుప్తిఙ్గన్తము
పదమువ యవమవ యవీయును బదమన బరగున్
దుదినీ తెలుంగులన్నియు
బదకవితామార్గసార్వభౌము డు దెలిపెను[2]

అని పద స్వరూపాన్ని వివరించాడు

5 1 3. విమర్శకుల దృష్టిలో పదం

పదం అంటే సామాన్య అర్థంలో పాట అని వాడుక. పదం రాగ తాళాలతోను ఉండవచ్చు. లేకపోవచ్చు. ఇది జానపదులసాహిత్యంలో స్పష్టంగా కన్పిస్తుంది.

శ్రీ సుబ్బరామ దీక్షితులు గారు—

"పదంయొక్క మాతువు శృంగార రస నాయికానాయక లక్షణ వ్యవహారాదులతో పల్లవిపెంట అనుపల్లవి చరణమాతువులు విళంబకాల ముగా పాడదగినది.[3]

శ్రీ రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ గారు—

"శృంగారమయమై ఎక్కువగా విలంబకాలమందు, క్వచిత్తుగా మధ్యమకాలమందు నడచుచు పల్లవానుపల్లవములు, మూడింటికి తక్కువ కాని చరణములు కలిగి ప్రాచీన రక్తిరాగములతో చేయబడిన గేయరచనకు పదములని పేరు"— అని పదనిర్వచనం చేశారు.

సంగీతానికి, సాహిత్యానికి సమాన ప్రాధాన్యమీయగల సంగీత శిల్పి పదాలను వ్రాశాడు. జనంతో ఎక్కువ వ్యాప్తికి, మననం చేయడానికి పద్యాలకన్నా పాటలెక్కువ పనికివస్తాయనే తత్త్వాన్ని పండితులు గమనించలేదు కాని పామరులు మాత్రం గుర్తించారనీ వీరు స్పష్టం చేశారు.[4]

శ్రీ వడ్లమూడి గోపాలకృష్ణయ్య గారు—

"పదమంటే లోకంలో చాలాకాలంగా పాట అన్న అర్థం పరివ్యాప్తమై ఉంది. ఈదృష్ట్యా పాటలుగా ఉన్న భాగాన్ని పదభాగమనీ పద్యాలుగా ఉన్న భాగాన్ని పద్యభాగమనీ అనవలసి వస్తుంది. వస్తుస్థితిని పరిశీలిస్తే పదపద్యాలకు భేదం కన్పించదు పదమంటే పద్యమనీ పద్యమంటే పదమనీ భావించడంలో శాస్త్రీయంగా దోషంలేదు అవగా పదం అంటే పాట కావచ్చు. పద్యం కావచ్చు[5] అని సంయుక్తికంగా వివరించారు.

## 5.2 పదలక్షణాలు .

పదాలు వర్ణ్యవిషయాన్నిబట్టి శృంగారపదాలని, వైరాగ్యపదాలని రెండు విధాలు

శృంగార పదాలలో పాత్రోచిత భాష అవసరం. గ్రామ్యాలైనా పొందిక ఉంటే చాలు వైరాగ్యపదం. సంస్కృతంలోగాని లేదా దేశ భాషల్లోగాని వ్రాయవచ్చు. పాత్రోచితభాష ఉండవచ్చుగాని గ్రామ్య

భాష మాత్రం నుతరామూ వాడరాదు. వైరాగ్యపదాలలోని విషయం ఉదాత్తంగా ఉండాలి.

పదాలు లక్షణభేదాన్నిబట్టి వృత్తపదం, నిబంధపదం, అనిబంధపదం అని మూడు రకాలు.

1 వృత్తపదం

సంస్కృత ఛందస్సులో ప్రసిద్ధాలైన 26 ఛందఃప్రక్రియల నుండి రూపొందబడినవే వృత్తపదాలు.

ఈ పదం సమం, అర్ధసమం, విషమం అని మూడు రకాలు

(అ) సమపదం

సాధారణంగా చరణాలలో నాలుగుపాదాలుంటాయి. చరణంలోని నాలుగుపాదాలు ఒకే ఛందస్సులో వ్రాయడం.

(ఆ) అర్ధసమపదం :

చరణంలోని 1-3 పాదాలు ఒక రకంగా, 2-4 పాదాలు మరొక రకంగా వ్రాయడం.

(ఇ) విషమపదం

చరణంలోనినాలుగుపాదాలు నాలుగురకాలైనఛందస్సులోవ్రాయడం

(2) నిబంధపదం

నిబంధపదానికి అంగాలు మరియు అవయవాలనేవి ఉన్నాయి యతులుప్రాసలు, మాత్రాగణాలు, మార్గదేశి తాళాలు, ముద్రలు అనేవి అంగాలు.

5.3 రాయలసీమ పదకవుల పదాలు - లక్షణ నిరూపణం :

రాయలసీమ పదకవుల పదాల్లో నిబంధపదాలే ప్రధానాలు. వృత్త

పదంలోని త్రివిధభేదంలాగే వీరినిబంధపదాల్లోను, సమ, అర్ధసమ, విషమపదాల్ని గుర్తించవచ్చు.

5 3 1 సమపదం :

పదంలోని నాలుగుపాదాలు ఒకే రకమైన ఛందస్సుతో ఉండడం సమపదం.

అన్నమయ్య – సమపదం

" సకల ఉద్యోగము లు చాలించుటె శాంతి
సుఖదుఃఖములు విడచుటే శాంతి
వొకరేమి యిచ్చినను వొల్లకుండుటే శాంతి
ప్రకటించి రచ్చలకు పాయుటే శాంతి" (2-377)

సారంగపాణి – సమపదం .

" నిదురబోతే లేచమనసు బుట్టదు
ఎదుట యేనాడు బొట్టుబెట్టదు
ఇదియుగాక తమలపాకు ముట్టదు
ఏడాదికి కొప్పు విడిచి కట్టదు" (సా.ప. 77)

తరిగొండ వెంగమాంబ – సమపదం :

" దేహము జూచి నిందించిననేమి
దేహిసెవ్వడు జూచి తిట్టండీ భూమి
సాహసకులకు నీకు సంబంధమేమి
సాహాయ్యుడే స్వామి సర్వాంతర్యామి"(సుజ్ఞానరత్నావళి.77)

యాగంటి కవులు – సమపదం :

" అరయ నాలుక జిడ్డు నంటకుండినయట్లు

వరగదామర నీరువట్టనట్లు
గరిమ బూడిద గచ్చకాయునంటని ఘట్టు
బురదయును కుమ్మర పురుగంటని యట్లు" (డి-2487)

పై పదాల్లోని నాలుగు పాదాల వృత్తాలు ఒకే విధంగా ఉండడంవల్ల ఇవి సమపదాలు.

5.3 2 అర్ధసమపదం ·

పదంలోని 1-3 పాదాలు ఒకరకంగా, 2-4 పాదాలు ఒకరకంగా ఉండడం.

అన్నమయ్య - అర్ధసమపదం :

" కందువ నలమేల్మంగ కౌగిటనే వలలొద్దె
మందలించి తగులక మానగలవా
ముందె శ్రీవేంకటేశమోవి నీకు లంచమిచ్చె
చెంది చెప్పినట్టు నీవు సేసుకుండగలవా" (28-154)

చిన తిరుమలయ్య - అర్ధసమపదం

" యేడనైనా నిలిచి నీవెవ్వరితోనైన నమాట
లాడుకొన్న నిన్ను నేనడ్డలింతునా
యీడ నుండె నన్ను నీవెవ్వతెపేర బిలిచినాను
కోడెకాడ నిన్ను నిట్టె కోపగింతునా" (16-2-10)

వీరబ్రహ్మం - అర్ధసమపదం :

" ముట్టులోనె బ్రహ్మ విష్ణు జన్మించె
ముట్టులోనె శివుడు మూలమాయెన్
ముట్టులోనె జగము మునింగి తేలుచునుండు
వట్టినీళ్ళలోమునుగ ముట్టెడబోయెన్"(సుజ్ఞానరత్నావళి-26)

సారంగపాణి - అర్ధసమపదం :

" సమర భూమి జొరని పిరికిబంటూ
సాధన వ్యర్థము దశవిధ
గమకములతో వాయించని వీణా
గానము వ్యర్థము నిజముగ" (సా.ప. 187)

యాగంటివారు - అర్ధసమపదం :

" అష్ట అనువులకు ఆదివర్గ త్రిగుణాలు
నష్టము చేసియు అమరంగనూ
అష్టభరణము అన వుగ ధరియించి
నిష్టతో నే చిందు నెమ్మదినాడునా" (డి-2489)

పై పదాలో 1-3 పదాలు ఒకరకంగాను, 2-4 పదాలు ఒకరకంగాను ఉండడంవల్ల అర్ధసమపదాలు. ఇవి దూదేకుల సిద్ధప్ప, వెంగమాంబ, కోటిలింగయ్య రచనల్లో కన్పించవు.

5 33. విషమపదం :

పదంలో నాలుగుపదాలూ వేరువేరు ఛందస్సులతో వ్రాయడం విషమపదం

అన్నమయ్య - విషమపదం .

ఎద్దవై వన్నెల తొక్కియేమి గట్టుకొంటివి
ఒద్దనైన వచ్చి పూరకుండపైతివి
వొద్దిక భూమెత్తిన యీ యెద్దుకు నే ముద్దుగాక
నిద్దురచిత్తము తోడి నీకు నేముద్దా" (11-3-4)

పెదతిరుమలయ్య – విషమపదం

"చెప్పొగాక ప్రకృతిని చేరి వాల్లు వేదముల
గప్పియనిర్వాచ్యమని కద్దాకొంత
అప్పటి వుపనిషత్తులన్ని ముఖ్యము గాక
తప్పికొన్నియతత్వ వేదకములున్నదా" (21-298)

చినతిరుమలయ్య – విషమపదం :

"బడలని వంటవో పైపై నె హరిభక్తి
కడలేని కల్ప వృక్షము వంటిది
కడగి కొలువ శ్రీవేంకటనాథుడె గురి
బడినె యీతనిగని బ్రదుకగ వలదా" (16-2-19)

వీరబ్రహ్మం – విషయ పదం :

"ఏడు కొండలెక్కరా
యెగువ తిరుపతిరా
యెగువ తిరుపతిమీద
వెంకటాచలపతిరా" (సుజ్ఞాన రత్నావళి 27)

దూదేకుల సిద్ధప్ప - విషమపదం ·

"పండుకు వృక్షము ప్రజలెవ్వరెఱుగరు
పరమాత్ముడనే యాకుపై నుండురా
పండు ఇరవైయైదు పర్వములై యుండు
పరమ గురుధ్యానె పదుటకే పండు" (సుజ్ఞానరత్నావళి-30)

తరిగొండ వెంగమ్మ–విషమపదం :

"ఎవరిచే చిక్కదోయమ్మ – దాని విధ

మిట్టిదని చెప్పరాదు గదమ్మ
శివ కిళిలోగూడి సిద్ధించు భావమై
పూనిక్రమమున చాల బుధులందున" (సుజ్ఞానరత్నావళి-8(?)

సారంగపాణి – విషమపదం :

"సరసుడ నీవద్ద జేరి మఱియుఁచు భాగాలందిచ్చి
పరిమెళగంధి వక్కలో పవ్వళించి తా
సరిప్రొద్దున లేనిదాని నరిపెణ కత్రించుకొనీ
శిరవళ్లూరు దాటిపోయి తిరిగిచూచి నవ్వెనట" (సా ష 65)

యోగంటివారు – విషమపదం :

"వడిపాశముల సరువడి గట్టు
వడిలో బడిన యేనుగ వీడినయట్లన్
విడవడ్డ సంసార మోహ పాశంబులను
యెడబుటి శివయోగి యెంత భాగ్యవంతుడో" (డి–2494)

5.3 4. పల్లవి

పల్లవం అంటేచిగురు. పాటలోగాని, పదాలలోగాని, ముందు పొడబడ్డ ఒకపాదంగాని, లేదా రెండుమూడు పాదాలు పల్లవి ఇదిపాట విస్తృతికి దోహదం చేస్తుంది. పాటకు పల్లవిప్రాణం అన్నది వాగ్గేయకులోని మాట.

పల్లవి – నిర్వచనం :

పదం లయం విన్యాసం అను ఈ మూడు పదాలమొదటి అక్షరాల సంయోగానికి "పల్లవి" అని పేరు. పల్లవి అంటే కర్ణాటక సంగీత రచనల్లోని మొదటి భాగం. ప్రాచీన విద్వాంసులు ఈ మొదటి భాగాన్ని

చక్కగా విస్తరించి పాడడంవల్ల ఈ పేరు వచ్చింది పల్లవి కృతి, కీర్తన, పదం, జావళి, రాగమాలిక, తిల్లానం, స్వరజతి, జతిస్వర వర్ణం మొదలైన సంగీతరచనల్లోని మొదటి భాగం "పల్లవి" అని సారాంశం.

వివిధ స్థాయిలను బట్టి పల్లవి ఆలాపన, పల్లవి ద్రవం పల్లవి కాలం, పల్లవి సంగతి అని అనేక పేర్లతో పిలుస్తారు.

పల్లవి – పరిణామం :

జయదేవుని అష్టపదుల్లో ఉద్గ్రాహం, ధ్రువం అనే అంగాలున్నాయి నేటి స్వరూపంతో చూసినపుడు ఉద్గ్రాహం అనుపల్లవిగా. ధ్రువం పల్లవిగా కన్పిస్తుంది.

నారాయణ తీర్థుల "తరంగాల"లో పల్లవి (ధ్రువం) ముందుకు అనుపల్లవి (ఉద్గ్రాహం) వెనుకకు పోవడం జరిగింది.6

తాళ్లపాకవారు పల్లవి, అనుపల్లవి, చరణం అనే అంగాలతో సంకీర్తనల్ని సంపూర్ణంగా వ్రాశారు.

5.3 4 1. రాయలసీమ పదకవుల్లో పల్లవి" .

సాధారణంగా పల్లవిలో రెండు పాదాలుండటం పరిపాటి అయితే రాయలసీమ పదకవుల రచనల్లో "పల్లవి" పాదాల సంఖ్యలో వైరుధ్యం ఉంది.

అన్నమయ్య సంకీర్తనల్లో 1,3,4 పాదాలు గలిగిన పల్లవులు ఉన్నాయి.7

చినతిరుమలయ్యి కీర్తనల్లో ఒకపాదం గలిగిన పల్లవి ఉంది.8

వీరబ్రహ్మం రచనల్లో ఒకపాదం గలిగిన పల్లవి 9

దూదేకుల సిద్ధప్ప రచనల్లో ఒక పాదం గలిగిన పల్లవి ఉంది.[10]

తరిగొండ వెంగమాంబ రచనల్లో కూడా ఒకపాదం కలిగిన పల్లవి ఉంది [11]

సారంగపాణి పదల్లో 1,3, పాదాలు కలిగిన పల్లవులు కన్పిస్తాయి [12]

యాగంటికవుల రచనల్లో 4 పాదాలు కలిగిన పల్లవి కూడా కన్పిస్తుంది [13]

పై పరిశీలనవల్ల తేలిన అంశాలు

రాయలసీమ పదకవులందరిలో రెండు పాదాలు కలిగిన పల్లవి అసంఖ్యాకంగా కనిపించడం ఒక సామ్యం. పెదతిరుమలయ్య పదాల్లో రెండు పాదాల పల్లవి మాత్రమే ఉంది. అన్నమయ్య, చిన తిరుమలయ్య

బ్రహ్మంగారు, సిద్ధప్ప, తరిగొండ వెంగమాంబ, సారంగపాణి రచనల్లో ఒకపాదం కలిగిన పల్లవి ఉంది. యాగంటికవుల్లో ఒకపాదం పల్లవిలేదు అన్నమయ్య, యాగంటికవుల్లో నాలుగుపాదాల పల్లవి ఉంది.

5.3 5. అనుపల్లవి .

"పల్లవి" తరువాత వచ్చే రెండు పాదాల్ని "అనుపల్లవి"గా చెప్పవచ్చు. "పల్లవి"ని అనుసరిస్తుంది కాబట్టి దీనికి "అనుపల్లవి" అనే పేరు వచ్చివుండవచ్చు, అనుపల్లవి పల్లవి అంతగాని, పల్లవికి రెట్టింపు పొడవు గాని ఉండవచ్చు.

సాధారణంగా అనుపల్లవిలో రెండుపాదాలుండడం సహజం అన్నమయ్య రచనలో ఒకపాదం అనుపల్లవి ఉంది.[13A]

బ్రహ్మంగారి రచనల్లో 1,2, పాదాలు గలిగిన "అను
ఉంది.[14]

దూదేకుల సిద్దప్ప రచనల్లో 1,2, పాదాలు గలిగిన అను
ఉంది,[15]

సారంగపాణి పదాల్లో 1,2, గలిగిన అనువల్లవి ఉంది.[16]

తరిగొండ వెంగమాంబ రచనల్లో 1,2, పాదాలు కలిగి
వల్లవి ఉంది.[1]

యాగంటి కవుల్లో రెండుపాదాలు గలిగిన అనువల్లవి ఉం

పై పరిశీలనవల్ల తేలిన అంశాలు :

అన్నమయ్య, బ్రహ్మంగారు, సిద్దప్ప, సారంగపాణి, త వెంగమాంబ, యాగంటి కవులరచనల్లో అనువల్లవులున్నాయి, తిరుమలయ్య, చినతిరుమలయ్య, కోటిలింగయ్య పదాలలో పల్లవులు లేవు.

సిద్ధప్ప, వీరబ్రహ్మం, సారంగపాణి, వెంగమాంబ, అన్న రచనల్లో ఒకపాదం పల్లవి కూడ కన్పిస్తుంది. యాగంటి కవుల్లో పాదాల పల్లవి మాత్రం కనిపిస్తుంది.

5.3.6, చరణం :

భారతీయ సంప్రదాయంలో పాదపూజకు ప్రత్యేక స్థాన దేవతా విగ్రహాన్ని ఆపాదాంతం దర్శించాలని పెద్దలంటారు. దేవతా వర్ణనల్లో కూడా ఆపాదాకేశాంతవర్ణనకు ప్రాధాన్యం కనిపి దేవతలకే గాక మహాధిపతులకు, వయోజ్ఞానవృద్ధులకు, పాదాభివ చేయడం అలవాటు, మనిషి మనుగడకు కళ్లుకాళ్ళు ముఖ్య

పదాలకు పల్లవి చరణాలు అవసరం, వాగ్గేయకారులు తన భక్తిని పదాల చరణాలతో శరణు పొందుతారు,

ఒక పదంలో ఎన్నిచరణాలుండాలి అనడంలో ఖచ్చితమైన నియమాలు లేవు. కాని సంఖ్యాదృష్టితో పరిశీలించినపుడు మూడు చరణాలుండడం ఎక్కువగా కన్పిస్తుంది,

అలాగే చరణంలో నాలుగు పాదాలుండడం పారిపాటి. రాయలసీమ పదకవుల్లో "చరణ" వ్యవస్థను రెండురకాలుగా వర్గీకరించవచ్చు. మొదటిది చరణాల సంఖ్యలో అనియత రెండవది చరణపాదాల సంఖ్యలో అనియని.

అన్నమయ్య కీర్తనల్లో 2,4 5,7,8,10,11,13,15 చరణాలున్న పదాలున్నాయి.[19] అదే విధంగా చరణాల్లో 2,3,8 పాదాలున్న కీర్తనలు కూడ ఉన్నాయి.[20]

పెదతిరుమలయ్య సంకీర్తనల్లో 5,15, చరణాలున్న పదాలున్నాయి [21] చిన తిరుమలయ్య పదాల్లో చరణాల సంఖ్య నియతంగా ఉంది. చరణాల పాద ల్లో 2పాదాలు గలిగిన పదాలున్నాయి [22]

బ్రహ్మం రచనల్లో 4,5,8,8,9 చరణాలున్నాయి. చరణం పాదాల్లో 2 పాదాలు గలిగిన పదాలున్నాయి [23]

దూదేకుల సిద్దప్ప రచనల్లో 5,6,7,10 చరణాలున్న పదాలున్నాయి. రెండు పాదాలు గలిగిన చరణాలు కూడా ఉన్నాయి [24]

కోటిలింగయ్య రచనల్లో 4,5,6,7,8,9,10 చరణాలున్నాయి చరణంలో 2,3,6 పాదాలున్నాయి [25]

సారంగపాణి రచనల్లో 4,5,6,7,8,9,10,15 చరణాలున్న పదాలు కన్పిస్తాయి చరణంలో రెండు, మూడు, పాదాలు కూడ ఉన్నాయి.[26]

తరిగొండ వెంగమాంబ రచనల్లో 4,5,6,8,16 చరణాలున్నాయి 2 పాదాలు కలిగిన చరణాలున్నాయి [27]

యాగంటి వారి పదాల్లో 1,2,4,5,6,7,8,10,11,14 చరణాలున్న పదాలు కన్పిస్తాయి చరణాల్లో 2,3 పాదాలున్న చరణాలు కన్పిస్తాయి[28]

పై పరిశీలనవల్ల తెలిన అంశాలు :

రాయలసీమ పదకవులందరిలో మూడు చరణాలున్న పదాలు ఎక్కువగా ఉన్నాయి.

సిద్ధప్ప, కోటిలింగయ్య, సారంగపాణి తర్గిగొండ్ల వెంగమాంబ, యాగంటి కవులరచనల్లో ఆరు చరణాలున్న పదాలు కన్పిస్తాయి. ఈ నియమం శాశ్లపాక కవుల్లో కన్పించదు యాగంటి వారి పదాల్లో ఒక చరణం ఉన్న పదం కూడ ఉంది.

రాయలసీమ పదకవులందరి రచనల్లో రెండు, నాలుగు పాదాలున్న చరణాలున్నాయి. అన్నమయ్య కీర్తనలో ఎనిమిది పాదాలు కలిగిన చరణం ఉంది. కోటిలింగయ్య రచనలో ఆరుపాదాలు కలిగిన చరణం ఉంది.

5.3.7. యతి :

పద్యంలోని ప్రతిపాదం మొదటి అక్షరాన్ని "యతి" అనవచ్చు. యతిగా ఉన్న అక్షరం మరల అక్షరాన్ని బట్టి ఆయాపాదాల్లో నియమిత స్థానాల్లో వస్తుంది. యతికి విచ్ఛేద రూపయతి కావచ్చు లేదా స్వరాక్షర యతి మైత్రి కూడకావచ్చు. తెలుగు భాషలో రెండవదానికే ప్రాధాన్యం

రాయలసీమ పదకవులందరి రచనల్లో యతి నియమం పాటించ బడింది. అయితే పెద తిరుమలయ్య, వీరబ్రహ్మం, వెంగమాంబ సారంగ పాణి, యాగంటికవుల రచనల్లో యతి నియమం పాటించని పదాలు కూడా కొన్ని కనిపిస్తాయి.

పెద తిరుమలయ్య

"యుక్తి కలిగితే నే నొడలు మోతునా
యుక్తియు శక్తియు నొకటి లేక నీ" (21—12)

వీరబ్రహ్మం

భావా భావము నిందుజూతాము
భక్తి జనులు సంతోషము చేతాము
భావమందు గురుని దలుతాము
భక్తితో హరిపూజ జేతాము" (సుజ్ఞానరత్నావళి-16)

తరిగొండ వెంగమాంబ

పరగదేహము మంటి పాలు—ఈ వికట
సంసారము విడచుటే ఫేలు" (సుజ్ఞానరత్నావళి-82)

సారంగపాణి :

చల్లని అన్నము నోటికి పోదట
సరిగెబుటేదారి చీరముదుగట (సా.వ 114)

యాగంటి కవులు

అందమగు జలసింధు మధ్యమునందు బుద్బుద
బృందములలో సంధు లేక కల్లత నైశ్వర్య ఛిద్రబ్రహ్మం
అందమగు కల్పాంబువులనున్నది చిక్కబలికృతంబై
సంధు లేకయు జూడ బొందని కాయమట్లు నుండేనంత
యును (డి-2497)

5.3 8. ప్రాస

పద్యంలోగాని పాటలోగాని ప్రతిపాదంలో రెండవ అక్షరానికి

ప్రాస అని పేరు. ఈ ప్రాసాక్షరం అన్ని పాదాల్లోను ఒకే రకంగా ఉండాలి.

రాయలసీమ పద కవులందరిరచనల్లో ప్రాసనియమంఉంది కాని దూదేకుల సిద్ధప్ప, సారంగపాణి, యాగంటి కవుల రచనల్లో ప్రాస నియమం పాటించని పదాలు కూడా కన్పిస్తాయి.

దూదేకుల సిద్ధప్ప :

"కలికిరో యేమనుచు జెప్పుదు
కంటిలోపలి మింటి తుదపలె
వెలుగు సూక్ష్మపు జ్యోతి లోపల
విశ్వరూపము లెల్ల జూపును" (సుజ్ఞానరత్నావళి-28)

సారంగపాణి :

"ఊరి మించి కలలోవచ్చి పై కొన్నట్లు
ఉలికి దిగ్గునలేచి నీనెదిరించినట్లు" (సా.ప. 67)

యాగంటి కవులు :

యే కులము యేకలిమి యే చెలిమి
యే బలిమి యే నిత్యమే సత్యము
యే తల్లి యేదండ్రి యేరూపు యేరేఖయురుగు
నా వశమా కారంబున యిట్లు వచ్చిపోవుటేగాక (డి 2494)

5.3.9. మాత్రాగణం .

ఛందస్సుల్లో అక్షరాల కూర్పుకు గణమనిపేరు. ఈ గుణాలు అక్షర గణాలని మాత్రాగణాలని రెండురకాలు. వృత్తాలన్నింటికి అక్షరగణాలు గేయాలకు, పదాలకు మాత్రాగణాలుంటాయి. వృత్తాల్లో అర్థవంతమైన

పదదృష్టితో గణవిభజన చేయవచ్చు, చేయకను పోవచ్చు. కాని గేయాలలో, పదాలలో అర్థవంతమైన పదమే సాధారణంగా ఒక గణసమూహకంగా పాడిస్తారు వృత్తాల్లో వంటి పదాల్లో, గేయాల్లో నడకకు ప్రాధాన్యముంది. దీనినే గతి అని కూడా వ్యవహరిస్తారు

రాయలసీమ పదకవుల రచనల్లో ఎక్కువగా నాలుగు ఐదు మాత్రాగణాల నడకే కనిపిస్తుంది.

5.3.10. మార్గదేశి తాళాలు :

భావాన్ని వ్యక్తపరచడానికి రాగమెంత ముఖ్యమో తాళంకూడా అంతముఖ్యమైంది. దీన్ని పాట నడకను బట్టి నిర్ణయిస్తారు

**అన్నమయ్య వాడిన తాళాలు**

అన్నమయ్య కీర్తనలన్నింటికి రాగ నిర్దేశం ఉంది కాని తాళ నిర్దేశం లేదు. కాని నాల్గింటికి మాత్రం రాగతాళ నిర్దేశం ఉంది.

| కీర్తన | తాళం | రాగం | సంఖ్య |
|---|---|---|---|
| మంథరధర | అట | కురవంజి | 1–267 |
| నొగియునామటి | జంపె | లౌళి | 1–242 |
| విచ్చేయువమ్మా | రూపక | రామక్రియ | 4–104 |
| నీమతములన్నియు | ఏక | సామంతం | 17–599 |

అన్నమయ్య సంకీర్తనల్ని స్వరపరచిన రాళ్ళపల్లివారు, శ్రీనేదునూరి కృష్ణమూర్తి గారు కొన్ని సంకీర్తనలకు "తాళ్ళపాక అన్నమయ్య పాటలు, అనే పుస్తకంలో తాళ నిర్దేశం చేశారు.

| కీర్తన | తాళం | రాగం |
|---|---|---|
| అదిగో అల్లదిగో | ఆది | హిందోళం |

| | | |
|---|---|---|
| అలమేలుమంగ | ఖండచాపు | భైరవి |
| అలరులు | ఆది | శంకరాభరణం |
| ఆకటి వేళలు | రూపక | ముఖారి |
| ఇప్పుడిటు | జంపె | భూపాళం |
| ఊగ్గుపెట్టరే | ఆది | కమాస్ |
| ఉయ్యాల | ఆది | మధ్యమావతి |
| ఏమొకొచిగురు | ఆది | తిలంగ్ |
| కంటి శుక్రవారం | ఆది | ఆనంద భైరవి |
| చేరికొల్వరో | మిశ్ర | శ్రీరాగం |
| తెప్పగా | రూపక | లలిత |
| పలుకు తేనెల | ఖండచాపు | కర్ణాటక దేవగాంధారి |
| సామాన్యమా | జంపె | ధన్యాసి |
| మలసిజూడరో | రూపక | శంకరాభరణం |
| ముద్దుగారే | ఆది | కురంజి |
| మొత్తకురే | రూపక | కాంభోజి |
| ఎలరాడమ్మ | త్రిశ్రత్రిపుట | కాంభోజి |
| కులుకక నడవరో | ఆది | ఆరాణా |
| కొలనిదోపరికి | ఆది | యదుకుల కాంభోజి |
| చక్కని తల్లికి | ఆది | పాడి |
| జయ జయరామా | ఆది | మణిరంగు |
| దిబ్బలు వెట్టుచు | ఆది | కాంభోజి |
| దీనుడనేను | ఆది | నీలాంబరి |
| నారాటి | ఆది | రేవతి |
| భక్తి కొలది | రూపక | రామక్రియ |

| | | |
|---|---|---|
| భావములోన | ఆది | శుద్ధ ధన్యాసి |
| మోపుల చిగురుల | ఆది | వరాళి |
| విన్నపాలు | రూపక | భూపాళం |
| సువ్విసువ్వి | మిశ్రచాపు | కేదారగౌళ |

చినతిరుమలయ్య శృంగార కీర్తనల్లో కొన్నింటికి తాళనిర్దేశం చేయబడింది,

| సంకీర్తన | తాళం | రాగం | సంఖ్య |
|---|---|---|---|
| కాదని వేగిరించితే | అట | పాడి | 16-2-53 |
| తలపు దలపు | అట | రామక్రియ | 16-2-102 |
| తేటతెల్లమిమాటల | ఏక | ముఖారి | 16-2-79 |
| ఇంకా నేలానాతోడ | వర్మ | బౌళి | 16-2-100 |

బ్రహ్మంగారి పదాలు మచ్చునకు—

| సంకీర్తన | తాళం | రాగం | సంఖ్య |
|---|---|---|---|
| ఓం నమశ్శివాయ | చాపు | నాదనామక్రియ | (సు.1) |
| ఎంతమంచి గురుడు | ఏక | ఆనందభైరవి | 3 |
| చెప్పెదగురుమహిమ | అట | కాంభోజి | 4 |
| ఊదేతిత్తులపైగానుండే | ఆది | నాదనామక్రియ | 5 |
| చిల్లరరాళ్ళకుమ్రొక్కుచు | ఏక | ధన్యాసి | 6 |
| కాశికిపోవలెనా | ఆది | మాయామాళవి | 7 |
| ఎంతలెక్కదిరిగిననేమి | రూపక | బ్యాగ్ | 20 |

సిద్ధప్ప పదాలు ·

| | | | |
|---|---|---|---|
| జలజాక్షి రమ్మనెనే | ఆది | మోహన | సు-28 |

| | | | |
|---|---|---|---|
| తియ్యని మామిడి | అట | నాదనామక్రియ | సు-30 |
| ఏల ఈదేహము | అట | మోహన | సు-31 |
| కులమెంచగా నేల | అది | కాఫి | సు-32 |
| మనసు మనసున | చాపు | నాదనామక్రియ | సు-33 |

కోటిలింగయ్య పదాలు :

| | | | | |
|---|---|---|---|---|
| వున్నాది పరిపూర్ణమా | అట | శుద్ధసావేరి | తత్త్వాలు-1 | |
| దయచేసెనమ్మా | చాపు | శ్రీరాగము | " | 3 |
| సాధింపనలవికాదు | ఏక | కళ్యాణి | " | 4 |
| పరిపూర్ణమింతాని | అది | ఆనంద భైరవి | " | 5 |
| గురుడె దైవమనుచు | ఝుల్వ | పంతువరాళి | " | 15 |

తరిగొండ వెంగమాంబ పదాలు ·

| | | | |
|---|---|---|---|
| పద్వస్తువునందే నమ్మినిలుపురా। | చాపు | నాదనామక్రియ | సు 76 |
| సోహం సోహం | అట | కాఫి | సు. 78 |
| బ్రహ్మ మద దెలుపరయ్యా | ఏక | ఆనందభైరవి | సు, 81 |
| ఎందుకే నీకంత మోహము | చాపు | సహనా | సు. 84 |
| పడతినేస్తం | జంపె | పంతువరాళి | సా 5 |
| కడపదాటిరానియకె | అది | పంతువరాళి | సా. 6 |
| పిలుచుక రావమ్మ | త్రిపుట | శ్రీ | సా. 12 |
| రమ్మనే సామిని రమ్మనే | చాపు | ఫరజు | సా. 23 |
| ఇట్టువెట్టుదుసుమ్మీ | రూపకం | ఆనంద భైరవి | సా. 51 |
| నీవిందు పేయక | అట | బేగడ | సా 76 |
| హరిదాసులను | ఏక | గౌళిపంతు | సా 186 |
| లాలెనుచు పూచేరు | దివ్యజాతిలఘువు | నవరోజు | సా. 198 |

పరిశీలనవల్ల తేలిక అంశాలు :

రాగతాళాల స్పష్ట నిర్దేశం తాళ్లపాక కవుల తర్వాతి వాగ్గేయ
సల్లోనే కన్పిస్తుంది పెదతిరుమలయ్య కీర్తనల్లో యాగంటి పదాలలో
క నిర్దేశం లేదు,

అన్నమయ్య, చినతిరుమలయ్య కీర్తనల్లో కొన్నింటిలో మాత్రం
క నిర్దేశం స్పష్టంగా ఉంది. బహుశః వ్రాతకెక్కించినవారు ఈ
శం చేసి ఉండవచ్చు లేదా ఇతరుల పదాలు తాళ్లపాక కవులవిగా
వారం పొంది ఉండవచ్చు.

తాళాల విషయానికి వస్తే రాయలసీమ పదకవులలో అది, ఆట
, చాపు, తాళాలు సమంగా ఉండడం. జంపె, త్రిపుట రూపక
ాలు అన్నమయ్య, సారంగపాణి పదకవుల్లో కన్పిస్తాయి. చిన
ములయ్య పదాల్లో వర్మతాళం, కోటిలింగయ్య తత్త్వాల్లో జుల్వ
ళం, సారంగపాణి పదాల్లో దివ్యజాతి లఘువు ప్రత్యేకంగా
పిస్తాయి

11 ముద్ర :

ముద్ర అంటే అంకితమని అభిప్రాయం. పాటనో లేదా పదాన్నో
సేవారు తమ పేరునో లేదా తాము అర్పించేస్వామి పేరునో చెప్పడం
ద్ర అని చెప్పవచ్చు. ఇలాంటి "ముద్ర"ఒకే రకంగాను ఉండవచ్చు
ా భిన్న భిన్న మార్పులతోను ఉండవచ్చు ఈ సంప్రదాయం
డం నుండి తెలుగుకు వచ్చిందని అభిప్రాయం,39

అన్నమయ్య ఏదైవాన్ని దర్శించినా వేంకటేశ్వర ముద్రతోనే
నలు వ్రాశాడు. ముద్రలన్ని ఒకేరకంగా ఉండవు. మచ్చుకు...

| | |
|---|---|
| శ్రీ వేంకటపతి | 7-116 |
| శ్రీ వేంకటేశుడు | 14-153 |
| శ్రీ తిరువేంకటాద్రీశు | 1-34 |
| శ్రీ తిరువేంకటగిరి దివ్యవినోది | 4-45 |
| శ్రీ తిరువేంకటేశ | 11-2-5 |
| వేంకటగిరిరాయుని | 1-10 |
| వేంకటనాథ | 4-85 |
| వేంకటాద్రి విభుడు | 12-55 |
| తిరువేంకటాచలం స్థితం | 5-79 |
| తిరువేంకటగిరి నిలయ | 11-3-111 |

పెదతిరుమలయ్య సంకీర్తనల్లో కూడా ముద్రలు అనేక రకాలుగా ఉన్నాయి. ఉదాహరణకు

| | |
|---|---|
| శ్రీ వేంకటేశ్ | 21-2 |
| శ్రీ వేంకట విభుడు | 21-5 |
| శ్రీ వేంకటాధిపా | 21-28 |
| శ్రీ వేంకటాద్రీశు | 21-42 |
| శ్రీ వేంకటగిరిరఘునాథా | 21-31 |
| శ్రీ వేంకటోత్తముడు | 21-192 |
| శ్రీ వేంకటమిందిరానాథా | 21-168 |
| శ్రీ వేంకట గిరివరదా | 21-178 |
| శ్రీ వేంకట మాధవా | 21-236 |
| తిరువేంకటాద్రి | 21-87 |
| తిరు వేంకటపతి | 21-453 |
| తిరువేంకటాచలధీశు | 21-456 |
| శ్రీ వేంకటాద్రిపతి | 23-24 |

చిన తిరుమలయ్య కీర్తనల్లో క్రింది ముద్రలుంటాయి.

| | |
|---|---|
| శ్రీ వేంకటగిరి | 16-1-1 |
| శ్రీ వేంకనాథుడు | 16-1-10 |
| శ్రీ వేంకటగిరినాథుడు | 16-1-9 |
| శ్రీ వేంకటనాథా | 16-2-18 |

బ్రహ్మం రచనల్లో క్రింది ముద్రలుంటాయి.

| | | |
|---|---|---|
| శివపోతులూరయ్య | సుజ్ఞానరత్నావళి | -1 |
| గురు వీరేశ | " | -2 |
| పోతులూరి వీరన్న | " | -5 |
| వీరయ్య | " | -6 |
| వీరగోవిందు | " | -7 |
| వీర గురు | " | -9 |
| వీరాచారి | " | -10 |
| వీరయ్యదాసు | " | 11 |
| పోతులూరి వీరభోగవసంతరాయలు | " | -15 |
| పోతులూరి వీరగురు | " | -16 |
| పోతులూరి బ్రహ్మస్వామి | " | -20 |
| వీరపోతులూరు | " | -22 |
| వీరదాసు | " | -21 |

దూదేకుల సిద్ధప్ప రచనల్లో రెండు ముద్రలు మాత్రమే ఉంటాయి.

| | | |
|---|---|---|
| సిద్ధ గురుడు | సుజ్ఞాన రత్నావళి | -31 |
| సిద్ధయోగీశ్వరుడు | " | -28 |

కోటిలింగయ్య రచనల్లో క్రింది ముద్రలుంటాయి.

| | |
|---|---|
| కోటిలింగయ్య | కోటిలింగయతత్త్వాలు-1 |
| వేల్పూరి కోటీశుశ్వరు | ” -7 |
| కోటిలింగకవి | ” -11 |
| వేల్పూరి కోటేశ్వర ప్రభో | ” -29 |
| యెల్పూరి ప్రభువు | ” -85 |

సారంగపాణి పదాల్లో క్రింది ముద్రలు ఉంటాయి.

| | |
|---|---|
| వేణుగోపాల | సారంగపాణి పదాలు-1 |
| వేణుగోపాలరాయ | ” -7 |
| శ్రీ వేణుగోపాల | ” -137 |
| శ్రీ వేణుగోపాలస్వామి | ” -193 |
| వేణుగోపాల కృష్ణా | ” -187 |
| వరదనారాయణుడ | ” -68 |
| ప్రసన్న వేంకటశౌరి | ” -71 |
| చెంగల్వరాయ | ” -74 |
| కల్యాణ వేంకటేశ్వరా | ” -75 |
| శ్రీసాళువమాకరాజ కార్వేటి రాజేంద్రా | ” -60 |

తరిగొండ వెంగమాంబ రచనల్లో క్రింది ముద్రలుంటాయి.

| | |
|---|---|
| తరిగొండ నృకేసరి వేంకటగిరివర | సుజ్ఞానరత్నావళి-76 |
| తరిగొండాధిపుడు | ” -77 |
| శ్రీ తరిగొండ నరహరి | ” -78 |
| తరిగొండ భ్రమరాంబ | ” -81 |

తరిగొండ ధాముడు " -83
తరిగొండ హరి " -82

యాగంటి కవుల పదాల్లో క్రింది ముద్రలుంటాయి

యాగంటి గురుడు
యాగంటి శివుడు
యాగంటి లింగడు
యాగంటి హరుడు
యాగంటి వ్రతి
యాగంటి ప్రభువు
యాగంటి వరదా
యాగంటి శంభుడు
యాగంటి నంజేశుడు
పెడువర్తి గురుడు
యాగంటి సిద్ధయ్య

స్వామిపేరుతో ముద్రలుండడం

అన్నమయ్య, పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య, సారంగపాణి తరిగొండవేంగమాంబ, యాగంటి కవుల్లో స్వామిపేరుతో ముద్రలున్నాయి యాగంటి కవులు సారంగపాణి ముద్రల్లో అక్కడక్కడ వ్యక్తిపేర్లను గూడ పాటించడం ఉంది.

స్వనామాంకితం, దైవనామం జతకావడం కోటిలింగయ్య ముద్రల్లో కన్పిస్తుంది

బ్రహ్మంగారు, సిద్ధప్ప రచనల్లో వక్తినామాలతో మాత్రమే ముద్రలుండడం కన్పిస్తుంది.

ముద్రస్థానం :

సాధారణంగా చివరి చరణంలో ముద్ర ఉంటుంది. చివరి చరణంలో 1,2,3,4 పాదాల్లో ఎక్కడైనా ముద్ర ఉం ఈ లక్షణాలు రాయలసీమ పదకవులందరిలో సమానంగా కని

సారంగపాణి పదాల్లో ముద్ర "పల్లవి" "అనుపల్లవి"ల ఉండడం విశేషం. ఈ లక్షణం రాయలసీమ పదకవుల్లో కని

మచ్చుకు: పల్లవిలో ముద్ర

పల్లవి, "కదలివచ్చెను జూడరే- వేణు
గోపాలుడు కమల పండుగగాను" (సా.వ 169)

అనుపల్లవిలో ముద్ర ·

అనుపల్లవి "వెలయాండ్లకు జీవనమేమిక శ్రీ
వేణుగోపాలకు సంకరమై" (సా.వ. 138)

54. రాగ విశేషాలు ·

"రంజయతీతి రాగః" అని రాగానికి వ్యుత్పత్తి. రంజిం అని అర్థం "రంజకః సర్వ సందర్భోరాగ ఇత్యభిధీయతే పి. సాంబమూర్తి పేర్కొన్నారు.

రాయలసీమ పదకవులు వివిధ రాగాల్ని ప్రయోగించిన రచనల్ని బట్టి చెప్పవచ్చు.

అన్నమయ్య పదాల్లో రాగాలు :

ఇంతవరకు వెలువడ్డ సంకీర్తనల్ని పరిశీలించడంవల్ల అన్న 96 రాగాల్ని వాడినట్లు తెలిసింది.

అహాలి, అమరసిందు, ఆందోళి, ఆరభి, అహిరి, అహిరినాట, కన్నడగౌళ, కన్నడబంగాళం కాంబోది, కుంతల, వరాళి, కురంజి, కేదారగౌళకౌశి, కొండమలహరి, కోకిల, పంచమం, ఘంటారావం, జాళ, చెంచుమలహరి, చాయ, ఛాయనాట, తెలుగు కాంబోది, తోడి, దేవక్రియ, దేవగాంధారి, దేసాక్షి, దేసి, దేసాళం, ద్రావిడ భైరవి, ధన్యాసి, నట్టనారాయణి, నాగగాంధారి, నాగవరాళి, నాట, నాదరామక్రియ, నారాయణి, నారణి, నారాణిదేసాక్షి, నీలాంబరి, పడ (డి) (ళ) పంజరం, పాడి, ప్రతాపనాట, పిహళం, పూరభి, పూర్వగౌళ, బలహంస, బౌళి, బౌళిరామక్రియ, భంగాళం, భల్లాటి, భూపాళం, భైరవి, మనోహరి, మలహరి, మంగళకేశిక, మధ్యమావతి, మాళవి, మాళవిగౌళ, మాళవశ్రీ, ముఖారి, ముఖారిపంతు, మేఘరంజి, మేచబౌళి, రామక్రియ, రేవగుప్తి, రాయగౌళ, రీతిగౌళ లలిత వరాళి, వసంతం, వసంత వరాళి, వేళావళి, శంకరాభరణం, శ్రీరాగం, శుద్ధదేశి, శుద్ధ రామక్రియ, శుద్ధవసంత, శోకవరాళి, సామంతం, సామరాగం సామవరాళి సాళంగం, సావేరి, సాళంగనాట, సింధురామక్రియ, సౌరాష్ట్ర, సౌరాష్ట్ర గుజ్జరి, హిందోళం హిందోళ వసంత, హిజ్జిజి మొదలైన రాగాల్ని ప్రయోగించాడు

పెదతిరుమలయ్య పదాల్లో రాగాలు :

అహిరి, కన్నడగౌళ, కన్నడబంగాళం, కాంభోది, కుంతలవరాలి, కేదారగౌళ, కొండమలహరి, గుండక్రియ, గుజ్జరి, గౌళ, ఛాయానాట, తెలుగు కాంభోది, దీపకం, దేశాక్షి, దేసాళం, ధన్యాసి, నాదరామక్రియ, నారాయణపాడి, నారాయణగౌళ, బంగాళం, బౌళి, బౌళిరామక్రియ, భైరవి భూపాళం, మంగళకౌశిక, మధ్యమావతి, మలహరి, మాళవశ్రీ, మాళవిగౌళ, ముఖారి, మేచబౌళి, రామక్రియ, రామగౌళ, రీతిగౌళ, లలిత వరాళి, శంకరాభరణం, శుద్ధదేశి, శుద్ధవసంతం, శ్రీసామంతం, సాళంగం, సాళంగనాట, సౌరాష్ట్రం, హిందోళం, హిందోళవసంతం, హిజ్జిజి

చిన తిరుమలయ్య పదాల్లో రాగాలు :

అహిరి, అహిరినాట, కన్నడబంగాళం, కాంభోది, కేదారగౌళ గుండక్రియ, గుజ్జరి, గౌళ, తెలుగు కాంభోది, దేవ గాంధారి, దేసాళం, దేసాక్షినాట, నాదనామక్రియ, నారాయణదేసాక్షి, పాడి, భూపాళం, బౌళి, బౌళిరామక్రియ, భైరవి, మలహరి, మధ్యమావతి, మాళవి, మాళవిగౌళ. ముఖారి, మేచబౌళి, రామక్రియ, లలిత వరాళి శంకరాభరణం శుద్ధవసంతం శుద్ధదేశి శ్రీరాగం సామంతం సాళంగనాట హిందోళం హిజ్జిజి.

బ్రహ్మంగారు ప్రయోగించిన రాగాలు :

ఆనందభైరవి ఇంగ్లీషు–వర్ణనమెట్టు ఎదుకులకాంభోది కళ్యాణి కాంభోది చక్రవాకం ధన్యాసి నాదనామక్రియ ఖ్యాగ్ ఖేగడ మాయా మాళవి ముఖారి శౌకవరాళి సౌరాష్ట్ర హిందుస్తాని.

సిద్ధప్ప రచనల్లో రాగాలు

ఆనందభైరవి కాఫి నాదనామక్రియ మోహనరాగాలు

కోటిలింగయ్య పదాల్లో రాగాలు :

ఆనందభైరవి కళ్యాణి కేదారగౌళ కమాచి నాదనామక్రియ పంతువరాళి బిలహరి బేగడ భూపాళం మారువ ముఖారి రేగుప్తి శుద్ధ సావేరి శుద్ధకాంభోజి శ్రీరాగం శహన సౌహిరి సురటి

తరిగొండ వెంగమాంబ పదాల్లో రాగాలు :

ఆనందభైరవి కాఫి నాదనామక్రియ సహావా

సారంగపాణి ప్రయోగించిన రాగాలు :

అసావేరి అహిరి ఆనందభైరవి అపదూప ఆరభి అఠాణా కళ్యాణి

కన్నడ కాఫీ కేదరగౌళ కర్నాటక ఘంటారాగం సారంగ కాంభోజి గౌళి ంతు గౌళపంతువరాళి గౌరితోడి ధ్వజావంతి ధన్యాసి నవరోజు నీలాంబరి నందభైరవి నాదనామక్రియ పంతువరాళి పున్నాగవరాళి ఫరజు భైరవి బేగడ బిలహరి మధ్యమావతి ముఖారి నాటకురంజి మోహన యదుకుల కాంభోజి రాగమాలిక రేగుప్తి శ్రీ శంకరాభరణం శహన శుద్ధసావేరి సావేరి సౌరాష్ట్ర సరట సారంగ హుసేని.

పై పరిశీల వల్ల తేలిన అంశాలు :

నాదనామక్రియ అనే రాగం రాయలసీమ పదకవులందరిలోను ఉంది. ముఖారి అనే రాగం అన్నమయ్య పెదతిరుమలయ్య చిన తిరుమలయ్య బ్రహ్మంగారు సారంగపాణి రచనల్లో కన్పిస్తుంది. అహిరి రాగం తాళ్లపాక కవుల్లోను సారంగపాణిలో మాత్రమే కన్పిస్తుంది. భ్యాగ్ అనే రాగం బ్రహ్మంగారిలో మాత్రమే కన్పిస్తుంది. కాఫి అనే రాగం సారంగపాణి సిద్ధప్ప వెంగమాంబలలో మాత్రమే కన్పిస్తుంది బ్రహ్మంగారు ఇంగ్లీషు - పర్దమెట్టు అనే రాగాన్ని ప్రయోగించాడు. సారంగపాణి రచనల్లో "అవరూప" అనే రాగం కన్పిస్తుంది. ఇది మిగిలిన పదకర్తలలో కన్పించదు.

తాళ్లపాక కవులతో సారంగపాణికి రాగాల విషయంలో కొంత సామ్యముంది. తాళ్లపాక కవులు ప్రయోగించినన్ని రాగాల్ని ఇతర రాయలసీమ పదకవులు ప్రయోగించలేదు.

అన్ని శాస్త్రాలలో వికాసం పున్నట్టే సంగీతంలో కూడా క్రమ పరిణతి కనిపిస్తుంది. కొన్ని రాగాలు ఆయాకాలాలలో ప్రచారంలో వుండి తరువాతి కాలంలో విస్మృతం కావచ్చు ఉదాహరణకు అన్నమయ్య కాలంనాటి రాగాలు నేడు వాడుకలో లేవు అలాగే ఇతర సంగీతాల ప్రభావం వల్ల క్రొత్త రాగాలు క్రొత్త తాళాలు కూడా చేరవచ్చు. ఈ దృష్టితో పరిశీలిస్తే బ్రహ్మం, తరిగొండవెంగమాంబ రచనల్లో విదేశీయ సంగీత రాగాలు కనిపించడం గుర్తించవచ్చు.

55. పదాలలో జానపద రీతులు :

"జనానాం పదం"-జనులకు నెలవైంది అని జానపదశబ్దానికి వ్యుత్పత్తి జనపదం సంబంధమైంది జానపదం జనపదమంటే పల్లెపట్టు ఈ పల్లెపట్టుకు సంబంధించినవారు జానపదులు. కష్టసుఖాల్లో భావావేశాలకు లోనైనపుడు వారి గుండెలోతుల్లోంచి అప్రయత్నంగా వెలువడే పాటలే జానపద గేయాలు,

కన్నడంలో జానపదగేయానికి "జనపదగీతి" అని తమిళంలో "నాట్టువప్పారపాట్లల్" -"వాయ్‌మొళి ఇలక్కియం" అని వ్యవహరిస్తారు.

551. జానపదగేయ కవులు - వాగ్గేయకారులు :

"వాఙ్మాతు రుచ్యతే గేయం
ధాతురిత్యభిధీయతే
వాచం గేయం చకురుతే
యఃస వాగ్గేయ కారకః" — అని శార్ఙ్గదేవుడు వాగ్గేయకార లక్షణాన్ని చెప్పాడు.

వాగ్గేయకార లక్షణాన్ని గూర్చి ఆచార్య జి. యన్. రెడ్డిగారు- "వాగేయ కారుడు అంటే వాక్+గేయం-వాక్కును గేయాన్ని చేసి నేర్పుగలవాడు. అంటే వాక్కారుడు, గేయకారుడు అని తెలుసుకోవాలి. గేయమంటేపాట, పాటల నిర్మాణంలో రెండు అంశాలు ముఖ్యం (1) భాషాపరంగా పాటలోని మాటలు ఆమాటలకూర్పు ఇదే వాక్కు, (2) సంగీత పరంగా పాటకు రాగలక్షణ నిర్ణయం, అంటే సంగీతపు కూర్పు ఇదే గేయం సంగీతపు పరిభాషలో వాక్కును అంటే పాటల్లోని మాటల కూర్పును మాతువు అని గేయాన్ని అంటే సంగీతపు కూర్పును ధాతువు అని వ్యవహరిస్తారు "

"వాగ్గేయకారుడు" అన్నపుడు వాక్కారుడు వాక్కును (మాతువును) కూర్చగలవాడు. గేయకారుడు సంగీతాన్ని (ధాతువును) కూర్చగలవాడు అయినవాడని గ్రహించాలి. ఇంకా వివరించి చెప్పాలంటే మన సినిమాల్లో లాగ పాట వ్రాసినవాడు ఒకడు. దానికి సంగీతం కూర్చినవాడు ఒకడు పాడి రంజింపజేసేవాడు మరొకడు లాగా కాకుండా వాక్కారుడు, గేయకారుడు అయినవాడే వాగ్గేయకారుడు30అని తెలియజేశారు.

మహాకవుల కంటే వాగ్గేయకారులు జానపదకవులకు దగ్గరివారు కారణం వీరి లక్ష్యమెల్లా సామాన్య ప్రజాజాగృతే. ప్రజలుదేన్ని ఆదిరిస్తారో, ఎలా చెబితే ఇష్టపడతారో తెలిసినవారు. ప్రజలభాషను తమ గేయభాషగా, కృతిభాషగా మార్చుకొన్నవారు, ఈ రహస్యాన్ని తెలిసిన వారు ఆచరించిన వారు వాగ్గేయకారులుగా రాణించారు

రాయలసీమ పదకవుల రచనల్లో కూడా జానపదగేయ రీతులు కన్పిస్తాయి. వీరి జానపదగేయ రీతుల్ని నాలుగు విధాలుగా వర్గీకరించవచ్చు.

5.2. పదకవుల జానపద రీతుల వర్గీకరణ.

1 కాలానుబంధి
2. కార్యానుబంధి
3 పర్వానుబంధి
4. పరిశిష్టాలు

5.5.2.1. కాలానుబంధి :

కొన్ని ప్రత్యేక సమయాల్లో మాత్రమే పాడే పాటల్ని ఈవర్గంతో చేర్చవచ్చు. ఈ పాటల్ని ఆయాసమయాల్లో తప్ప ఇతరత్రాపాడరు.

ఇందులో మేలుకొలుపులు, ఉయ్యాలపాటలు, లాలిపాటలు, జోలపాటలు చందమామ పాటలు మొదలైనవి ఉంటాయి.

5 5 2 1 1. మేలుకొలుపు పాటలు :

భగవంతునికి జరిగే వైభవాల్లో ప్రభాతసేవ ఒకటి ఆసేవలో మొదటిది మేలుకొలుపు పాడడం దీనినే సుప్రభాత సేవగా జరపడం దేవాలయాలలో సంప్రదాయంగా నేటికి నిలచిఉంది, తమ ఇష్టదైవాని మేలుకొలిపి అపై కైంకర్యాదులు నిర్వహించడం ఆచారం దీనినే పాల్కురికి సోమనాథుడు "ప్రభాత పదాలు" అన్నాడు ఈ పదాలు కాలక్రమంలో రోజులు, సామాన్య జనుల్ని శిశువుల్ని మేలుకొలిపే రీతులలో పరిణితి పొందాయి.

మేలుకొలుపు పాటల్ని గూర్చి-ఆచార్య బిరుదురాజు రామరాజు గారు-"వైష్ణవ పరముగా నున్న మేలుకొలుపులందు సాధారణముగా కృష్ణునుద్దేశించిన వానిలో మధురభక్తి గాన్పించును. సాధారణముగా నీ మేలుకొలుపులు వ్రాసిన వారందరు కొంత సాహిత్య జ్ఞానము కలవారే యతి ప్రాసాది నియమములు చక్కగా పాటింపబడుటయే గాక శబ్దాలంకారములు, ప్రౌఢ పదబంధములును వీనిలో అక్కడక్కడ కాన నగును.

ప్రాతఃకాలమున పల్లెపట్టులందిప్పటికిని ప్రాతర్వేళల పూజారులు మందిరములందును, స్త్రీలు చల్లచేయుచునో, ఇల్లలుకుచునో, పురుషులు కార్యములు దీర్చుకొని తమ ప్రక్కల పైననో కూరుచుండియో, భూపాల రాగములందు భగవంతుని విభూతిని కొనియాడి తమయాత్మలను, ఇరుగుపొరుగు సోమరులను మేల్కొల్పెదరు[31] అని వివరించారు.

ఆచార్య తూమాటి దోణప్పగారు - "ఆనందభైరవి ముఖారి

కేగుప్తి రాగాలు కూడా మేలుకొలుపులో అప్పుడప్పుడు వాడుక చేయడం లేకపోలేదు"[32] అని తెలియజేశారు,

కృష్ణశ్రీ గారు "భూపాళం జానపద రాగము "బౌళి" పండిత గాయకుల రాగము"[33] అని పేర్కొన్నారు

ఆచార్య యస్వీ జోగారావుగారు-"ఇదియొక వైతాళిక గీతము చిరప్రసిద్ధమైనది యక్షగానములందు తరచుగనే కన్పట్టుచుండును అలచు దేశాక్షి, మలహరి దేవగాంధారి భైరవి బౌళి సౌరాష్ట్ర మొదలైన ఉదయరాగాలలో ఉండును భూపాల రాగము తోడి దాని అనుబంధము కడుప్రసిద్ధము"[34] అని అభిప్రాయపడ్డారు.

శ్రీమతి యస్ లక్ష్మీనరసమ్మగారు-"తెల్లవారు జామున ప్రకృతి యంతయు ఆహ్లాదకరముగా నుండి మనస్సునకు ఉత్తేజము కలిగించుచుండును అటువంటి ప్రశాంత సమయమున స్త్రీలు తమ ఒంటరితనము తెలియరాకుండుటకున, తాను చేయుపనియందలి కష్టమును మఱచుటకును పాటలు పాడుకొనుచుందురు విషయము బట్టి వీనిని పది విధములుగా విభజింపవచ్చు సేవా భావమును వ్యక్తము చేయునవియును తమ్ము రక్షింపుమని ప్రార్థించునట్టివియును స్తోత్రరూపముగా నున్నవియును, జీవితగాధలను తెలుపునవియును వర్ణనాత్మకముగా నున్నవియును శృంగార పరముగునవియును మధుర భక్తి పూరితములును వేదాంత పరముగ నున్నవియును వదినగారిపై రచింపబడిన హాస్యపు మేలుకొలుపును దేశభక్తి మేలుకొలుపులునుగలవు"[35] అని అన్నారు.

పై అభిప్రాయాల వల్ల తేలిన అంశాలు :

ప్రాతఃకాలములో పరాత్పరుని లీలావిభూతినికొనియాడడం మేలుకొలుపుల మొదటి లక్షణం,పూజాకార్యక్రమాలలో కూడా పాడడం రెండవ

లక్షణం పాదాదిలోను లేక పాదాంతంలోను "మేలుకో" అనే మాట ఆవృత్తి కావడం మూడవలక్షణం వీటిని ఎక్కువగా భూపాళరాగంలో పాడతారనడం నాల్గవ లక్షణం.

రాయలసీమ పదకవుల్లో అన్నమయ్య, పెదతిరుమలయ్య, యాగంటి కవులు, గుంటుపల్లి కోటిలింగయ్య మేలుకొలుపుల్ని వ్రాశారు

అన్నమయ్యలో "మేలుకొలుపులు"

"మేదిని జీవులంగావ మేలుకోవయ్యా
నీదయ మాకెల్ల రక్ష నిద్రమేలుకోయ్యా ॥పల్లవి॥

తగు గోపికల కన్నుదామరలు వికసించె
మిగుల సూర్యనేత్రుండ మేలుకోవయ్యా
తెగువరాక్షసులనే తిమిరము విరియంగ
నెగడిన పరంజ్యోతి నిద్రమేలుకోవయ్యా" మేదిని॥
(2-403)

పెదతిరుమలయ్య "మేలుకొలుపులు

"మేలుకొనవే నీలమేఘ వర్ణుడా
వేళ దప్పకుండాను శ్రీవేంకటేశుడా ॥పల్లవి॥

మంచము పై నిద్రదేర మల్లెల వేసేరు
ముంచి తురుము ముడువ మొల్లల వేసేరు
కంచము పొత్తారగించ కలువల వేసేరు
పించెపు చిక్కుదేఱ సంపెంగల వేసేరు" ॥మేలు॥
(సం 21-200)

చిన తిరుమలయ్య "మేలుకొలుపులు"

గోవిందా మేల్కొనవయ్యా
కావించి భోగము కడమా నీకు (16-1-52)

యాగంటి కవులు "మేలుకొలుపులు"

మేలుకొనవె ఏవనపతిపై మించి రేచక
పూరక కంభక నాళవిధుల నంటగానమునటు చేయగును
॥వల్లవి॥

శివశివా మేలుకొనవె
అరయ అజ్ఞానపు తిమిరమున నణిగి నరులను
జారచోరులను సొరది అవగుణ తారవతుల సొంపులెడలెను
॥మే॥ (డి. 2494)

గుంటుపల్లి కోటిలింగయ్య - "మేలుకొలుపులు"

మేలుకొనరా జీవజగముల మేల్కగన
కలనిలువ నట్టికీలు గురుపద మరసి బయలును కేవలము
గాంచి ॥మే॥

యాలనీకి యెరుక దుర్భము మూలమెన్నడు లేక కలగతి
లీలదోచు ప్రపంచమిది మృషబాల గురుకృపచే ॥మే॥
(తత్త్వం - 26)

పై పరిశీలనవల్ల తేలిన అంశాలు :

అన్నమయ్య కీర్తనల్లో "మేలుకొలుపులు" అనేమాట స్పష్టంగా కనిపిస్తే ఇతరుల్లో ఆ మాట లేకపోవడం. అన్నమయ్య పెదతిరుమలయ్య చిన తిరుమలయ్య కీర్తనల్లో "మధురభక్తి ప్రధానమైతే యాగంటి వారు కోటిలింగయ్య కీర్తనల్లో మేలుకొలుపులో ఆధ్యాత్మిక భావనలు స్పష్టమవుతాయి.

5.5 2.1.2. ఉయ్యాల పాటలు :

బిడ్డను ఉయ్యాల్లోవేసి ఊస్తూ పాడేపాటలు ఉయ్యాల పాటలు.

ఈ పాటల్ని డోల్లరి గీతాలని శారఙ్గదేవుడు పేర్కొన్నాడు ఈ ఉయ్యాల పాటల ప్రసక్తి ప్రాచీన గ్రంథాల్లో కూడా కన్పిస్తుంది. నన్నెచోడుడు కుమార సంభవంలో "ఉవిదలింపు మిగుల నూయల పాటలు పాట మధుమదమున బాడెనలులు" (4-89) అని పేర్కొన్నాడు.

పెద్దన కవిత్వం వ్రాయడానికి కావలసిన హంగుల్ని పేర్కొనే సందర్భములో ఆశువుగా చెప్పిన. .

> నిరుపహతి స్థలంబు రమణీప్రియ దూతిక తెచ్చి యిచ్చు క
> ప్పూర విడెమాత్మకింపయిన భోజనముయ్యెల మంచ మొప్పు
> తప్పొప్పరయు .... "

అనే పద్యంలో ఉయ్యాలకున్న ప్రాముఖ్యం స్పష్టమవుతుంది,

ఆచార్య యస్వీ జోగారావుగారు–"లాలి యన్నదియు ఉయ్యాల పాటయే జోల ఉయ్యాల పాటగ గూడ నున్నది గాని వాని గతియే వేరు చిన్న పిల్లలను నిద్ర బుచ్చుటయు, దేవాయతన కళ్యాణోత్సవములను వాని సందర్భములు. వివాహవేళ వధూవరుల నుయ్యాలలూచు నాచారము తమిళమలయాళాది రాష్ట్రములందీ నాటికి నున్నదని విందుము [38] అని పేర్కొన్నారు.

ఎల్లోరా గారు–"అసలు ఈ ఉయ్యాల పాటలు అనేవి, ఉయ్యాల అనేది చిన్నవారికే కాదు ప్రేమీ ప్రేమికులు, భార్యాభర్తలు వారు వీరూ అనేమిటి అందరూ సరదాగా పాడుకుంటూ ఊగుతారు. ... అటు ఏ చెట్టు కొమ్మకో వ్రేలాడ గట్టిన పాతచీరలో పరుండి ఆడుకొనే పసికూన నుంచి, ఇటు అంతఃపుర సౌధాలలో చక్కని తూగుటుయ్యాలలో ఊగే కలవారి బిడ్డదాకా ఈ ఊయలపాటల మధురమైన గాలుల మధ్య నిద్రపోయి ఆడుకోవడం సహజంగా జరుగుతుంటుంది. వారూవీరూ. అనే భేదం లేకుండా అన్ని తరగతులలోను ఈ పాటలకు విలువ గౌరవ

స్థానముంది. అదే ఈ పాటలకున్న ప్రత్యేకత, ఆకర్షణ"37 అని వ్యక్తం చేశారు,

కల్లూరి వీరభద్ర శాస్త్రిగారు–"పరమ భాగవతుల దాసభక్తి సంప్రదాయములో "డోలోత్సవము" మిక్కిలి రమ్యమైనది ఈ ఉత్సవములందు బ్రహ్మాది దేవతలు దేవమునులు, నారదాదులు పరమ భాగవతులు, వేదపండితులు, సామగానములు, స్తుతులు, సంకీర్తనములు చేయుచున్నట్లు దివ్యసన్నివేశమును భావించారు."38 అని తెలియజేశారు.

పై అభిప్రాయాల వల్ల తేలిన అంశాలు :

ఉయ్యాల పాటల్లో "ఉయ్యాల" అనే పదం ఆవృత్తికావడం మొదటి లక్షణం ఇవి చిన్నపిల్లలకే కాకుండ పెద్దలకు కూడా ఉపయుక్తం కావడం రెండవ లక్షణం ఉత్సవసమయాల్లో భగవంతునికి, వివాహసమయాల్లో వధూవరులకు కూడా

ఉయ్యాల పాడకారనడం మూడవ లక్షణం

రాయలసీమ పదకవుల్లో ఉయ్యాల పాటలు అన్నమయ్య, యాగంటికవుల్లో కన్పిస్తుంది మిగిలిన వారిలో ఉయ్యాల పాటలు కన్పించవు

అన్నమయ్య "ఉయ్యాల పాట" :

అలరంజంచలమైన ఆత్మలందుండ నీయలవాటుసేసె
వుయ్యాల
పలుమారు నుచ్ఛ్వాస పవనమందుండ నీభావంబు దెలిపె నీ
వుయ్యాల
... ... .. .. .... .. . "పల్లవి'

వదిలముగ వేదములు బంగారు చేరులైపట్టి వెరపైతో
చెనుయ్యాల
వదలకిటు ధర్మదేవత పీఠమై మిగుల వర్ణింప నరుదాయ
నుయ్యాల ॥౫॥ (1-67)

యాగంటి కవుల "ఉయ్యాలపాట"

"ఉరులింగమూర్తి దావుయ్యాల లూగా
ప్రణవ పంచాక్షరీ పొన్పు తాగాగా
శరలింగ చిత్కళలు దీపములు గా గా
పరమ సద్గురు నందు పవ్వలించుకోగా" (డి-2494)

అన్నమయ్య పాటలో ప్రతి పాదాంతంలోను "ఉయ్యాల" అనే మాట ఆ వృత్తమయ్యింది దేవేరులతో కలసివున్నస్వామిని ఉయ్యాల్లో ఉంచి ఊపడం ఈకీర్తనలో కన్పిస్తుంది స్థితి కారకుడైన విష్ణువు యొక్క విరాట్ స్వరూపాన్ని వివిధ వర్ణనలతో కీర్తించాడు. కన్నుల పండువుగా ఉన్న ఉయ్యాల దేవతలకూడా ఆనందదాయకమైంది.

యాగంటి కవుల కీర్తనలో పంచాక్షరియే పొన్పుగా, చిత్కళలు దీపములుగా వర్ణించి ఈశ్వరుని ఉయ్యాల్లో ఉంచి ఊపడం విశేషం.

అన్నమయ్య కీర్తనలో శృంగార భావం చోటుచేసుకోగా యాగంటి కవులు యోగపరిభాషతో వర్ణించారు

5.5 2.1 3 లాలి పాటలు

మారాం చేస్తూ ఏడుస్తున్న బిడ్డల్ని తల్లులు లాలిస్తూపాడే పాటలు లాలిపాటలు ఆంగ్లంలో వీటిని "లల్లబీ" అని హిందీలో "లోరి" అని, తమిళంలో "తాలాట్టు" అని కన్నడంలో "లాలిహాడుగళు" అని అంటారు

ఆంగ్లంలో లల్లబీ అనడానికి వివరణ ఇలా ఉంది.

OXFORD ENGLISH DICTIONARY లో– 'A Soothing refrain used to please or pacify infants, 'A Song Sung to Children to Soothe them to rest, 'Also any Song whick Sooths to rest,

THRONDIKA JUNIOR ILLUSTRATED DICTIONARY లో 'A Strain Sung to soothe a child to sleep', Cradle soft song to put a baby to sleep'

ADVANCED TWENTIETH CENTURY DICTIONARY లో 'Lallaby (Lull-a-bi) Song for lulling a baby to Sleep,

ఆచార్య బి. రామరాజుగారు– "సంతానము వడయుటకు స్త్రీలు పడరాని పాట్లు పడెదరు, వ్రతములు నోములు, తీర్థయాత్రలు చేసెదరు. ఇట్టి యాశ ఫలించి ఇంటి వెలుగును కన్నతల్లి సంతోషమునకు మేర యుండదు. ఆ సంతోషపారవశ్యమున తనబిడ్డ రాముడుగనో కృష్ణుడుగనో, శంకరుడుగనో భావించి తల్లి లాలించును. ఇవి శంకరాభరణ, నవరోజు, ఆనందభైరవి, శ్రీరాగములందుండును. లాలు లందుండు కవిత్వమునకదియేసాటి. మనోహరమైన భావములు లలితములగు పదబంధములు సుకుమారమగు శయ్యను సంతరించుకొనును"39 అని పేర్కొన్నారు.

డా॥ యస్వీ జోగారావుగారు– "ఇది యొక ఊయలపాట. సర్వ సాధారణముగా ఊంజల జోలపాటల వలె జంపెగతిగలదగుట గమనింపదగినది. ఈ పాటలు ప్రజావతి యందును బిడ్డపుట్టుక అసలుపాట పుట్టుకను యెంత ప్రాచీనములో అంతప్రాచీనము"40 అని పేర్కొన్నారు

డా॥ అర్వియస్ సుందరంగారు–"ప్రపంచ మంతటా వ్యాపించి వున్న ఈ లాలి పాటలలో పల్లవికే ఎక్కువ ప్రాధాన్యం ఉంటుంది.

అర్థరహితమైన శబ్దాలు మాత్రమే ఉండే పాటలు కొన్ని ఉన్నాయి. చిన్న పిల్లలను కాళ్లమీద వేసుకొని ఆడిస్తూనో, చక్కలిగింతలుపెడ్తూ, తమాషాలు చేస్తూనో పాడే పాటలు కొన్ని. వీటిలో కొన్ని చారిత్రక ప్రాధాన్యం ఉండేవి. ఏదో ప్రదేశాన్నో వ్యక్తినో తీసుకొని అల్లబడిన పాటలివి. ఇవి, పిల్లల బుద్ధి శక్తిని ప్రబోధించేవి. లాలిపాటలలో ముఖ్యంగా తల్లి తనయుని గూర్చి ఎన్ని విధాలుగా అనుకొంటుందో అన్నీ ప్రేమ ప్రవాహంలా, అమృతధారలా, రసవద్గంగలా ఆమె నోటి నుండి మాటలు పాటలుగా వెలువడడం కన్పిస్తుంది"[41] అని అన్నారు.

కృష్ణశ్రీగారు– "గేయ వాఙ్మయ నిశ్రేణిలో లాలిపాటలు మొదటి మెట్టుకావలెను. వీటిలో సాహిత్యార్థము, గౌణము, సంగీతము చివరి స్వరాలు మాత్రమే ప్రధానము. ఈ పాటలు బిడ్డలకు విశ్రాంతి నివ్వడానికి నిర్మించినవి కనుక శ్రుతిలలితములగు మాటలనే వీటిలో ఉపయోగిస్తారు. లాలిపాటలు వింటున్న బిడ్డలకోసం పాడతారేమోనని అనుమానము కలుగుతుంది. 'లాలి'లో రసాలను వినిపించి స్వరాలను నిద్ర లోకి అవరోహింపజేస్తాయి. లాలిపాటలలో సేవలూ లీలలూ వుండవచ్చు పరిపాటి"[42] అని అన్నారు.

పై అభిప్రాయాలవల్ల తెలిన అంశాలు :

మొదటి లక్షణం లాలిపాటల ఎత్తుగడలోగాని, చరణాంతంలో గాని, "లాలీ" అనే మాట ఆవృత్తి కావడం–లాలిపాటల్లో బిడ్డను భగవత్స్వరూపుడుగా భావించడం రెండవ లక్షణం. ఈపాటల్లో సాహిత్యాని కంటే సంగీతానికి ఎక్కువ ప్రాధాన్యత వుండడం మూడవ లక్షణం, విభిన్న భాషల్లో వుండే జానపద గేయాల్లో ఇతర పాటలు లేకున్నా లాలి పాటలు మాత్రం ఉండి తీరుతాయనడం నాల్గవ లక్షణం.

రాయలసీమ పదకవుల్లో అన్నమయ్య, సారంగపాణి, యాగంటి

కవులు మాత్రమే లాలిపాటల్ని ప్రస్తావించారు. మిగిలిన వారి రచనల్లో ఇటువంటివి లేవు

అన్నమయ్య "లాలిపాట" :

ఊయ్యాల బాలు నూచెదరు కడు
నొయ్య నొయ్య నొయ్యనుచు ॥ పల్లవి॥

బాల యవ్వనలు పసిడి వుయ్యాల
బాలుని వద్దబాడేరు
లాలి లాలి లాలి లాలెమ్మ యెల్ల
లాలి లాలి లాలి లాలనుచు ॥ఊయ్యాల॥ (12-246)

సారంగపాణి - "లాలిపాట"

లాలెనుచు వూచేరు - లలనలింపునను
శ్రీల చెన్నలరును-య్యాల పాన్పునను
గోల రుక్మిణీదేవి-కోరి సొంపునను
బాలితో వచ్చెనీ-పై తలంపునహా ॥లాలి॥
(సారంగపాణి పదాలు 198)

యాగంటి వారి "లాలిపాట" :

లాలీ అనుచు ఊచేరు లలన లందరునూ
ఫాలలోచన నిన్ను పాన్పుపై నునిచి । లాలీ
శ్రీగురుని పాదములు చేరిసేవింతు
నాగభూషణ నిన్ను నాత్మలోనుంతు
అగణిదీపు పాద్యమమర బూజింతు
బాగుగా ప్రమథగణ భావమదినుంతు ॥లాలీ॥

సారంగపాణి, యాగంటివారి పదాల్లో మాత్రం "లాలి" అనే ఎత్తుగడ కనిపిస్తుంది ఇది అన్నమయ్యలో కనిపించదు

పై పరిశీలనవల్ల తెలిన అంశాలు

అన్నమయ్య, సారంగపాణి యాగంటి వారి పాటలలో "లాలి" మాట స్పష్టంగా కనిపించడం రెండవది అన్నమయ్య సారంగపాణి పాటలలో అవతార కీర్తనలకు ప్రాధాన్యం కనిపిస్తే యాగంటి వారి పాటలలో భక్తి ప్రదర్శనకు ప్రాధాన్యం

5 5 2 1 4 జోలపాటలు

పిల్లల్ని నిద్రపుచ్చడానికి తల్లులు జోకొడ్తూ పాడే పాటలు జోల పాటలు జోల పాటలు ప్రసక్తి ప్రాచీన గ్రంథాల్లో కూడా కనిపిస్తుంది పాల్కురికి సోమనాథుడు బసవపురాణం (పు 68)లో "జోసబుచుల" పాడే జోల పాటల్ని పేర్కొన్నాడు పోతన భాగవతంలో స్త్రీలు చిన్న పాపడైనా కృష్ణునికి శాస్త్రోక్త పద్ధతిలో తలన్నానాదులు ముగించిన తర్వాత దీవిస్తూ జోలపాడడం కనిపిస్తుంది

ఇల్లిందల సరస్వతి గారు-

"జోల పాటలకు గానపటిమ, సరళత్వము రాగధోరణి ముఖ్యాలు, పాటల్లో సాధారణంగా ఎత్తుగడలో గాని చరణంలో చివర గాని "జోజో" అనే మాట పునరుక్తమౌ తుంది ఈ పాటలద్వారా విజ్ఞానబోధ, తత్వ బోధ కూడా జరిగినట్లు తెలుస్తున్నది నిద్రపోయే మనసు శాంతిని కోరు తుందని గాఢ సుషుప్తిలో ఏకత్వసుఖము, శాంతి ఉంటాయి కనుక ఆసమయంలో బిడ్డల ఆత్మను ప్రబోధిస్తూ దేహధారియై జీవుడు పర మాత్మలోని ఒక అంశమని, కర్తవ్యము నిర్దేశిస్తూ గానము చేయుట ఆచారమైనది అదిగాక బిడ్డలు నిద్రించేటప్పుడు గాలిధూళి బిడ్డలకు

సో ఃతుంకాను వారి అంతఃకరణమును ప్రజ్వలింపజేయడానికి కూడా ఈ పాటలు తోడ్పడతాయి అందుకొరకే వీరగాథలు ఈ పాటల్లో ఇమిడి ఉన్నాయి [43] అని పేర్కొన్నారు

ఆచార్య బి రామరాజుగారు–

"గృహశ్రీ కవనమున జోలపాటలు ముఖ్యములు ఇవి శంకరాభరణం, నవరోజు, ఆనంద భైరవి, శ్రీరాగములందుండును ఇట్టివి పూర్వమునుండియు మన యక్షగానములందు వచ్చుచునే యున్నవి"[44] అని తెలియజేశారు

ఆచార్య యస్వీజోగారావు గారు–

"ఇది తామస దేశమున చిర ప్రసిద్ధమైన పాట ఇది ఊయెల పాటయును గమక సంస్కృత "డోలా" శబ్దభవమని యొక అభిప్రాయము (హిందీ తద్భవము ఝూలా) జో అను ఊతమాటకు బహువచన రూపమని మరియొక అభిప్రాయం "లాలి" వలెనిది కేవలమూయెల పాటయే కానక్కరలేదు ఎక్కడ పడున్న పిల్లలైనను నిద్రపుచ్చునపుడు పాడబడునదగుటయే దీని లక్షణము జోకొట్టుటకు నిదురపోయొని, వీపుతట్టుటయని యర్థము జోలపాట సర్వసాధారణముగ జంపెగతిలో నడచునట్టిది"[45] అని వెల్లడించారు

కల్లూరి వీరభద్రశాస్త్రి గారు–

"పవ్వళింపు సేవతో ఉయ్యాల నూచుచూ పాడునది లాలి యనియు జోకొట్టుచూ పాడునది జోలపాట యనియు, కొద్ది భేదము జోలయందు కేవల విశేషములే యుండును"[46] అని భావించారు

పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు

జోలపాటల ఎత్తుగడలోగాని చరణాంతంలో గాని "జోజో" అనే

పదం ఆవృత్తమవుతుంది ఇది మొదటి లక్షణం -పిల్లలను నిద్ర పుచ్చడానికి, మరియు వారి మనస్సును ప్రజ్వలింప జేయుడం రెండవ లక్షణం, జోలపాటలు జంపెగతితో నడవడం మూడవ లక్షణం

జోల పాటలు అన్నమయ్యలో మాత్రమే కన్పిస్తుంది మిగిలిన రాయలసీమ పదకవుల్లో కనిపించదు

అన్నమయ్య జోలపాట

జోజో యని మీరు జోల పాడరో
సొజపు జయంతి నేడే సఫల మిందరికి ||పల్లవి||

అదె చంద్రోదయము మాయ హరి అవతారమందె
మొదల జాత కర్మములు సేయురో
అదన పుత్రోత్సవమట పుణ్యాహము చేసి
కదిసి యిట్టి నామకరణము జేయరో ||జోజో||

"జోజో" అనే మాట పల్లవిలో మాత్రం వస్తుంది శ్రీకృష్ణ జయంతి సందర్భంలో స్త్రీలు గుమిగూడి పై జోలపాట పాడినట్లు చెప్పవచ్చు ఈ కీర్తనలో శ్రీకృష్ణుని జన్మవృత్తాంతం వర్ణింపబడింది

5 5 2 1 5 చందమామ పాటలు :

వీటిని తమిళంలో "వెణ్ణిలా పాడల్ గళ్" అని కన్నడంలో బెళదింగళు హాడుగళు అని అంటారు

ఆంధ్ర సాహిత్యంలో చందమామ పాటలకు ప్రత్యేక స్థానం ఉంది ప్రబంధ సాహిత్యంలో చందమామ దూషణాదున్నాయి మరి యయాతి చరిత్రలో వెన్నెల వర్ణనలు (2-79,8081,83,85) కన్పిస్తాయి

చిన తిరుమలయ్య "తెలుగు సంకీర్తన లక్షణం"లో చందమామ పద లక్షణాన్ని ఈ విధంగా చెప్పాడు

దుస్తర విప్రలంభమున
        దూతిక తోడ మెఱింగి చంద్రవి
స్వస్త భర స్వభావమున
        నాయకుడే యుగాంత యేనియున్
విస్తర పాదపాదముల
        వేడుక జందురు పేరు కొన్న చో
ప్రస్తుతి కెక్కి పత్పదము

భాసురమై ద్విచతుష్పాద కృతిన్ (పద్య - 64)

విరహావస్థలో నాయకుడుగాని గాని నాయిక పాదపాదంలో చంద్రుడుద్దేశించి పాడే పాటలు చందమామ పాటలు

జానపదుల్లో చందమామ పాటల్లో ఆధ్యాత్మికాంశం శృంగారాంశం రెండూవున్నాయి ఆధ్యాత్మికాంశరంలో యోగ విశేషాలు సామాన్యకటుంబ జీవితంలో వుండే నిర్వేదాదులు వర్ణించబడ్డాయి. శృంగారాంశంలో నియోగానికే పైచేయి ఈ పాటల్లో చివర "చందమామ", చందమామవోలె చందమామ "చందమామోఘ్" "చందమామయ్యో అనే మాటల అవృత్తి కన్పిస్తుంది,

చందమామ పదాల్ని అన్నమయ్య పెదతిరుమలయ్య దూదేకుల సిద్ధప్ప వ్రాశారు మిగిలిన రాయలసీమ పదకవుల్లో ఇవి కన్పించవు

అన్నమయ్య - చందమామ పాట

"చందమామ రావో జాబిల్లిరావో మంచి
కుందనపు పైడి కోర వెన్నపాలు తేవో" "పల్లవి"

(శ్రీవేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనానిలయం)

"చల్లనై కాయగదో చందమామ నీ
వెల్ల (ల్లి) గా దిరువేంకటేశు నెదుర
మొల్లిమిగ నమృతంపువెల్లి గొల్చుచులోక
మెల్ల నిన్ను గొనియాడగాను" "పల్లవి" (12-228)

పెదతిరుమలయ్య - "చందమామ పాట",

"సారెకు మగనాలి సంగాతమిది అట్టు చందమామా-నీవు
చేరి దగ్గరితే చీకటి తప్పవును చందమామా ||పల్లవి||

సందెకాడ నీ చాయల చూపేవు చందమామా - భూమి
నిండల గట్టేరు నిన్నుజూచితేను చందమామా
విందుల నీరాక వెల్లిపిరియను చందమామా-నీవు
ముందు నానాటికి మోసపోకువయ్యా చందమామా ||సారె||
(23-516)

దుదేకుల సిద్దప్ప-"చందమామ పాట

చందమామ-చందమామ-చందమామ
ఈ సంధితెలిపే జ్ఞానులెవరే-చందమామ ||పల్లవి||

కాయమనే పుట్టలోను చందమామ-పాము
మాయగనే మెలగుచుండు చందమామ' ||చంద||
(సుజ్ఞాన రత్నావళి_నం-29)

పై పాటలన్నింటిలోను "చందమామ" అనే మాట ఆవృత్తమవుతూవస్తుంది,

అన్నమయ్య మొదటి కీర్తనలో చంద్రాహ్వానం చేస్తాడు

రెండవ పాటలో వాతులు, అప్పయు, రసికులు, వందిమాగధులు, వేదవే దాంగ వేత్తలు మొదలైన వారు స్తుతిస్తుండగా, దివిజాంగనలు దివ్య విమానాల నుండి ఎఱ్ఱని తామర పుష్పాల్ని చల్లుతుండగా, వేం కటేశ్వర స్వామి వేడుకతో విహరించే విధంగా, లోకమంతా కొనియాడే విధంగా, అమృతపుజల్లులు కురిపిస్తూ చల్లగా వెన్నెల కాయమని చందమామను కోరడం కన్పిస్తుంది

తిరుమలయ్య చందమామను వర్ణిస్తూ నీ చల్లని వెన్నెలలు ఎల్లకాలము ఉండాలని కోరడం జరిగింది

దూదేకుల సిద్ధప్ప కీర్తనలో వెన్నెముక క్రిందిభాగంలోని మూలాధారం మీదున్నర చుట్టు చుట్టుకొని ఉన్న అజ్ఞాతశక్తి నే కుండ లినీ అంటారు దీన్ని నిద్రిస్తున్న సర్పంతో పోల్చుతారు యోగ సాధనలో కుండలినీ మేలుకొలిపితే అది సుషుమ్నమార్గంలో షడ్చక్రాల్ని దాటి సహస్రార చక్రాల్ని చేరుతుంది ఇది పైకిపోయే కొద్ది మానవునిక మానసిక పొరలు వదిలి దివ్యదృష్టి, అద్భుత శక్తులు కలుగుతాయని స్పష్టం చేశాడు

తాళ్లపాక కవుల చందమామ పాటలు మధురభక్తి పూరితంగా ఉంటే సిద్ధప్ప గారి పాట యోగ పరిభాషతో ఆధ్యాత్మికంగా గోచరి స్తుంది

5 5 2 2 కార్యాను బంధి

జానపదులు శ్రమించేటపుడు తమ శ్రమను మరచి పోవడానికి, ఉల్లాసంగా ఉండడానికి, హాయిగా పనుల్ని చేయడానికి పాడే పాటలే "కార్యాను బంధి" పాటలుగా చెప్పవచ్చు

రాయలసీమ పదకవుల్లోని "ఏలపాటలు" "సువ్విపాటలు" సోది పాటలు ఈ వర్గంలో చేరుతాయి

5 5 2 2 1 ఏల పాటలు

ఏల పాటలకు యాలపాటలని, యాలపదాలని కూడ పేర్లు తమిళంలో "ఏలేలో" అనే సంబోధనతో కూడిన పాటలున్నాయి ప్రాచీన ఆంధ్ర సాహిత్యంలో ఏల పాటలు ప్రసక్తి కన్పిస్తుంది

పాల్కురికి సోమనాథుని "పండితారాధ్య చరిత్ర"లో–
"ఏలలు వెట్టుచు నింపుసొంపారు శైలిచే గ్రోలుచు"(పు–513)

అని, పాలవేకరిదరిపతి– "శుకసప్తతి"లో–పీనెగెడు ప్రౌఢ విటుడు వింతయాల పదాలిట్టియాలకించు" (2–172) అని, పింగళి సూరన– "ప్రభావతి ప్రద్యుమ్నం లో "నానా కాళములు యథోక్త స్ఫూర్తి జరగునేలాది ప్రబంధచయము "(4–190) అని, తాళ్లపాక చిన తిరుమలయ్య–"తెలుగు సంకీర్తన లక్షణం"లో దేశరీతుల్ని–"దరువుల్ జక్కుల రేకులేలలును" అని పేర్కొని ఏల లక్షణాన్ని గూర్చి ఇలా చెప్పారు

"నాయకాహ్వాన పూర్వమై నయము గలిగి
మ్లేచ్ఛ పరిభాష దగిరాగ మిళితమైన
యేలపాట పదంబునా నిలజెలగు
మహిత నాయక సంబుద్ధి మధ్యమగుచు'' (పద్యం 65)

ఆచార్య బి రామరాజుగారు–

"జానపదగేయ రీతులలో ఏలలదొక విశిష్టస్థానం ఎత్తుగడలోను మధ్య సంబుద్ధిలోను, ముకాయింపులోను ఏలలను త్రిభంగి ధనస్సుతో పోల్చవచ్చును మొదటి పాదపు ఎత్తుగడతో విల్లెక్కు పెట్టి మధ్యపాదపు సంబుద్ధితో బాణము సంధించి నారి సారించి,మూడవ పాదపు ముగింపుతో ఎదుటివారి గుండె గూడులందు భావములను బాణములను నాటవచ్చును అవి భక్తి భావములు కానిండు, రక్తి భావములు కానిండు ఆ రెండింటికిని కావలసినంత శక్తి ఏల పాటయను విల్లునుండి లభించును'47

ఆచార్య ఎ. స్వీ జోగారావు-

"ఇది హేలగానెట్లు వలసినట్లు రాగతాళములు సాగదీయుచు పాడుకొనుటకను పైనది గొల్లకలాపమునందలి సుందరి కొండని ఏల లిట్టివే అవి గొల్లవారి హేలారసకత్వమునకు గుర్తులు"48 అని అభిప్రాయపడ్డారు

డా|| వేటూరు ఆనందమూర్తి గారు-

"ఆంధ్రుల దేంగాన మంతయు తొలుత 'ఏలపాటలను వ్యవహారమునసే సాగుచుండినది కాని దేశైలావిభాగములోని 'ఆంధ్ర ఏలలు' నెలువడింటిలోఁ నానావిధప్రయోగములు గమకములు, రాగాంశలు, రసభావములు కలిగి ఒక్కొక్క ప్రచారము గాంచిన యొకానొక ప్రక్రియా భేదమే ఏలపదమను పేరుగ నేడు ప్రఖ్యాతముగా నున్నది" 49 అని వ్యక్త పరచారు

కృష్ణశ్రీ గారు-

"ఏలలు అన్ని విసిర్జిత ఛందో నిర్మాణము గల పదములు యౌవనానుభవమును సూచించే భావాలన్న పదములను ఇక్కడ ఏలపాట లంటున్నాము ఈ అర్థములతో "ఏలపాటలు" అన్నమాట పాడుకలో నున్నది"50 అని అభిప్రాయపడ్డారు

పై అభిప్రాయాల వల్ల తేలిన అంశాలు

మహిత నాయిక సంబుద్ధి కలిగి ఉండడం మొదటి లక్షణం శృంగార పూరితంగా వుండడం రెండవ లక్షణం పీటిలో లోకానురాగం, ధార్మికత, ఔదార్యం ప్రదర్శింపబడడం మూడవ లక్షణం ఇవి ఇష్ట మొచ్చిన రీతుల్లో పాడుకోవడానికి అనువుగా వుండడం నాల్గవ లక్షణం

రాయలసీమ పదకవుల్లో అన్నమయ్య, యాగంటి కవులు, బ్రహ్మంగారు ఏలపాటల్ని వ్రాశారు

అన్నమయ్య – "ఏలపాట"

"మేడలెక్కి నిన్ను జూచి–కూడేననే యాసతోడ
వాడు దేరి వున్నారందురా – వేంకటేశ
యాడ నుండి విందాకానురా" (13–223)

యాగంటి వారి "ఏలపాట"

"సూర్య చంద్ర వహ్నినడుమ శౌర్యమనే చిలుకాగంటి
సూర్య దీప్తగాయుచుండగా – యేగంటిలింగా
చూడ చూడ ఆశ్చర్యమాయెరా"

బ్రహ్మంగారి "ఏలపాట"

"శరణు పోతులూరి రామ శరణు
వీర భద్రాయ శరణు–ఓ దైవరాయా
పోతులూరయ్యా కరుణతో నేలయ్యా యేలరా" ||శరణు||
(కాలజ్ఞాన తత్త్వాలు సం 22)

అన్నమయ్య, యాగంటివారు ఏలపాటల్లో "వేంకటేశ" 'యేగంటి లింగా' అని సంబోధించడం జరిగింది, గాని ఆ మంత్రసూచకమైన "ఓ" చేర్చబడలేదు బ్రహ్మంగారి ఏలలో మాత్రం ఉంది

అన్నమయ్య ఒకసారి ఎలుగగానే వేంకటేశ్వరుడు 'ఓ' అని పలికేవాడేమో, అందుకే అన్నమయ్యకు 'ఓ–వేంకటేశ' అని సంబోధించ వలసిన అవసరం లేకపోయింది అని ఆచార్య బిరుదురాజు రామరాజుగారు "అన్నమయ్య పాటలలో జానపద రీతులు" అన్న వ్యాసంలో వ్రాశారు

యాగంటి కవులకు కూడ శివుడు ఆదే విధంగా వలికేవాడేమో అన్నమయ్య ఏలపాట 3 పాదాలు కలిగిన 25 చరణాలు గలిగినది ప్రతి చరణం రెండవ పాదాంతంలో "వేంకటేశ" అనే సంబుద్ధిపుండి శ్రీవేంకటేశ్వరుని ఔదార్య శ్రీలాను రాగాలు ఈ కీర్తనలో చెప్పబడింది

యాగంటి వారి ఏల పాటలో "యేగంటిలింగా" అనే సంబుద్ధి ఉంద ఈకీర్తన భావం నిగూఢంగా ఉంది దీని భావం అతపికి తప్ప ఇతరులకు స్ఫురించదు దీన్నే మార్మికత అని అంటారు

బ్రహ్మం గారి "ఎలపాట" "ఓ వీరులూరయ్య" అనే సంబుద్ధితో సాగుతుంది

5 5 2 2 2 సువ్వి పాటలు

ధాన్యం దంచేటప్పుడు ఉచ్ఛ్వాస నిశ్వాసాలు త్వరితంగా జరుగుతాయి అప్పుడు వారికి శ్రమ అధికంగా ఉంటుంది ఆశ్రమను తగ్గించుకోవడం కోసం 'ఇస్' 'ఇస్' అంటుంటారు, ఈ ధ్వన్యనుకరణ శబ్దమే రోకటిపేసే ఊపులో సువ్విగా మారుతుంది ఈ మాట ఊతగా గల్గిన పాటలే సువ్విపాటలు

నన్నెచోడుడు కుమారసంభవంలో సువ్విపాటల్ని గూర్చి ఒబరకామిని యోర్తు వటికపురోల ముద్దెదురు బ్రాలొగి బోయుచు గౌరు కొమ్ము రోకటగొని దంచుచు రవోత్కటముగ" (6-47) పాడినట్లు వర్ణించాడు పాల్కురికి సోమన బసవపురాణంలో "రోకటి పాటలట్లు వేదములు" (పు 212) అని పేర్కొన్నాడు

విన్నకోట పెద్దన తన కావ్యాలంకార చూడామణిలో—

తలిగొని తగ బ్రాలు దంపెడిచోట
దరుణులచే సొంపు దనరు దర్శోజ" (8–50)

అని దంపుళ్ళ పాటను తరువోజలుగా పేర్కొన్నారు

ఆచార్య బి రామరాజు గారు–

"ఈనాడు వినబడు రోకటి పాటలు కొన్ని తరువోజలను, ద్విపదలను మధ్యగానున్న వరుసలో గలవు వీనిని విన్నచో సువ్విరామచంద్ర సువ్వి సువ్వి కీర్తి సాంద్ర సువ్వి, సువ్వి సీతమ్మ మాకు శుభమివ్వమ్మ, అను కొట్నముల పాటపెండ్లి పాటలలోనిదే గాని అచ్చైచ్చోట వ్యవహారమున గల దంపుడు పాటల కోవలోనిది గాదనిపించును, దీనిని సువ్వాలయుమట కలదు' అని అభిప్రాయపడ్డారు.[51]

ఆచార్య యస్వీ జోగారావు గారు–

"ఇది యొక దంపుళ్లపాట చిరప్రసిద్ధమైనది బహుయక్ష గానము' అందు వివాహసందర్భములందు ప్రయుక్తమైనది దీనికి సువ్వలాలి సువ్వాల, పాట, కొట్నముల పాటయనియు నామాంతరములు గలవు ఇది సువ్వాల, ద్విపద, సువ్వాల ధాతువు అను పేర్లతో కూడ కొన్ని యక్షగానములందు కన్పట్టుచున్నది సువ్వియున్నది ధ్వన్యనుకరణ శబ్దము, నూతపదముకు గావచ్చును రోకటిపోటునకెన్ని యొడుపులుండునో ఈమాటకన్ని గతులుండును అందు తురగవల్ల గతికి ప్రాచుర్యమధికము కొన్ని యక్షగానములందు "సుంకులు దంచేపాట" సువ్విగను "సూరతులు చెరిగే పాట" సువ్వాల గను గన్పట్టుచున్నది ' అని వ్యక్తం చేశారు [52]

డా॥ వేటూరి ఆనందమూర్తి గారు–

ఈ సువ్విపాటలలో రచన విషయమేదో యుండదవలెను గావున శైవులు శైవ సంబంధి రచనలు గావింపగా వైష్ణవులు విష్ణుసంబంధి రచనలు గావించినారు సువ్విపాటలన్నియు ప్రధానముగా తొలి నాళుల నుండియును ఖండగతిలోనే సాగుచున్నవి. సువ్వి సువ్వి రామ

చంద్ర సువ్వి సువ్వి కీర్తి చంద్ర వంటి రచనలొకకొన్ని త్ర్యస్రగతిలో గూడ నడిచినవి లేకపోలేదు దంపుళ్ల సువ్విపాటలకు ఖండగతియే ప్రసిద్ధము గావున తాళ్లపాక వారును అట్లే సువ్వులను రచించినారు 53 అని పేర్కొన్నారు

కన్నడంలో కూడా సువ్విపాటలు కన్పిస్తాయి వీటిని "సువ్వాలి" అంటారు సువ్విగళ ఆలి (ఆళ) సువ్వాలి ఇవి తత్త్వభ తారిలు పర మాత్మ స్తుతిరూపకాలు వాలె (వాలీ) అంటే కమ్మలు సువాలీ అంటే షడ్వర్గము అయిన లేక కమ్మలు అని అర్థం వివాహిత స్త్రీకి ఉండే ఐదు లక్షణాల్లో కమ్మలు కూడా ఒకటి ఇవి కల్గిన స్త్రీని ముత్తైదువ అంటారు అలాంటి స్త్రీలు పాడే మంగళకరమైన పాటలు సువ్వి పాటలు 54

పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు

ఈ సువ్విపాటల్లో సువ్వి అనే పదం పూతగా ఉండడం మొదటి లక్షణం ఇవి త్ర్యస్ర, చతురస్ర, ఖండగతుల్లో సాగడం రెండవ లక్షణం వివాహ సందర్భాల్లో వధూవరుల తలంబ్రాలు కోసం వడ్లు దంచేటప్పుడు కూడా ఈ పాటలు పాడతారనడం మూడవ లక్షణం.

రాయలసీమ పదకవుల్లో సువ్విపాటలు ఒక్క అన్నమయ్యలో మాత్రమే కన్పిస్తాయి మిగిలిన వారిలో కన్పించవు

అన్నమయ్య సువ్విపాట

సువ్వి సువ్వి సువ్వని
సుదతులు దంచెదరోలాల ||పల్లవి||

వనితల మనసులు కుందెన చేసిట
వలపులు తగనింటోలాల
కమసన్నలనెడి రోకండ్లను

కన్నెలు దంచెదరోలాల" ॥సువ్వి॥ (12 353)

ఈ పాటలో "సువ్వి" అనేమాట పూతపదంగా కన్పిస్తుంది "ఓలాల"అనే మాట ప్రతిపాదాంతంలోను అన్నమయ్యింది శ్రీనివాస కల్యాణానికి తలంబ్రాలు తయారు చేయడంకోసం కొందరు స్త్రీలు రోకండ్లతో దంచడం ప్రారంభించారు ఆసమయంలో వారి సింగారాలు శృంగార విలాస చేష్టవిశేషాలు వర్ణించబడి ది ఇది శృంగారాత్మకమైన పాట

5.5 2 2 3. సోది పాటలు

"సోది" అనేమాటకు "రాగలమేలు కీడులను గూర్చిచేయు ప్రయోగం" అని శబ్దరత్నాకరం

సోది శోధన శబ్దభవం కావచ్చును శోధనమంటె అన్వేషంచి సత్యాన్ని తెలుసుకోవడం సోది చెప్పేవారు ఎరుకలు ఎరుక అంటే జ్ఞానం ఈ జ్ఞానం కలవారు సోదెలు వీరు భగవంతుని అనుగ్రహంవల్లా లేద ఎదుటివారి మనస్తత్వాన్ని బాగా అకళింపుకొన్నవారు కావడం వల్ల భూత భవిష్యద్వర్త మానాలు చెబుతారు సాధారణంగా లోకంలో జబ్బుపచ్చినపుడు ఎవరైనా తప్పిపోయినపుడు లేదా పెళ్లి వ్యవహారాలలో సోదెయి చెప్పకోవడం అలవాటు, ఎరుకలు అంతఃపురం ప్రవేశించి కూడా ఎరుక చెబుతుంటారు

ప్రభావతీ ప్రద్యుమ్నంలో-

"వనితః యిటు నీవ వచ్చి నీవలయు సోదె గొనుము"అని ప్రయోగింప బడింది మన్నారు దాసు విలాస నాటకంలో ఎరుకల వేష భాషలు వర్ణింపబడ్డాయి

సోది పాటలు అన్నమయ్యల్లో కన్పిస్తాయి

అన్నమయ్య సోదిపాట

"ఎరుక చెప్పేనీ యివ్వ యెల్లా నెరుగుదు
మెరుగైన సొమ్ములిచ్చిమెచ్చవయ్య నన్ను ॥పల్లవి॥

చేతికి కలవము చెప్పేరావయ్య నీకు
ఘాతలబరాంగనలగాగి లింతువు
ఈతల గన్నుల మేలిటు చెప్పేరావయ్య
నూతకపు మానములు (?) చూడగలది కను" ॥ఎరుక॥
(13-312)

ఈ కీర్తనలో సోది చెప్పించుక నేవాడు శ్రీవేంకటేశ్వరుడు వేంకటేశ్వరుని దివ్యమంగళాకారాన్ని చూసి గోపకలు వలపించుట కాళీయ సర్పాన్ని మదించడం మొదలైన అవతార ఘట్టాల్ని వివరించడం జరిగింది

శ్రీనివాస కళ్యాణంలో ఎరుక కత్తె దగ్గర పద్మావతి జోస్యం చెప్పించుకోవడం ప్రధానమైన విషయమే

మిగిలిన రాయలసీమ పదకవుల్లో ఇలాంటి రచనలు కన్పించవు

5 5 2 3, పర్వాను బంధి

పర్వమనగా పండుగని అర్థం అయా పండుగ సందర్భాల్లో పాడే పాటల్ని ఈ వర్గంలో చేర్చవచ్చు ఉత్సవ సందర్భాల్లో పాడే పాటల్ని కూడ వర్గంలోనే చేర్చవచ్చు

రాయలసీమ పదకవుల్లోని గొబ్బిపాటలు, జాజరపాటలు తందాన దాటలు, మంగళహారతులు ఈ వర్గంలో వస్తాయి

5 5 2 3.1 గొబ్బి పాటలు

గొబ్బిళ్లు అంటే వేడుక, క్రీడావిశేషం, నవ స్కార ఖేదం అని సూర్యరాయాంధ్ర నిఘంటువు

ఈ పండుగ మార్గశిర పుష్యమాసాలలో వస్తుంది సంక్రాంతి అంటే చేరడం అని అర్థం సూర్యుడు నెలకొక్కసారి ఒక్కొక్క రాశిని చేరతాడు దీన్నే సంక్రాంతి సంక్రమణం, సంక్రాంతి పండగ అంటారు ఈ పండుగ రోజులలో స్త్రీలు, బాలికలు ఉదయాన్నే లేచి వాకిళ్లు అలికి గొబ్బి ముద్దలు పెడతారు వాటి చుట్టూ తిరుగుతూ చేతులు తట్టుతూ పాడే పాటలే గొబ్బిపదాలు

పాల్కురికి సోమనాథుడు బసవపురాణం (పు 22)లో పేర్కొన్న "చప్పటులిడుచు" గునిసి గునిసి ఆడే పదాల్ని గొబ్బి పాటలుగా గ్రహించవచ్చు

వేటూరి ప్రభాకరశాస్త్రి గారు-

"ధనుర్మాసమున దెలుగు దేశమున బాలికలు తెల్లవారు జాముననే నిద్రలేచి గొబ్బెమ్మలను పేర గోమయముతో (ముద్దలు) బొమ్మలుగా జేసి ముంగిళ్ల ముగ్గులు బెట్టి పూలతో నలంకరించి పూజింతురు. అట్టి ప్రార్థనము తిరుప్పావైలోను గొంత గలదు దక్షిణభారతమందంత యును సామాన్యమైన యొక వ్రతమును సరించి ద్రావిడ శైవులు శివ ప్రార్థనార్థకమగు తిరువెంబావైని, ద్రావిడ వైష్ణవులు విష్ణు సంప్రార్థనార్థకమగు తిరుప్పావైని గుర్పించుకొనియుందురు "గొబ్బెమ్మ" పదము "గోపెమ్మ' పదభవము అరవమున "గొబ్బియళ్లో" "గోపిగళ్" పదభవము" అని చెప్పారు

ఆచార్య బి రామరాజు గారు-

"బొడ్డెమ్మ" "బతుకమ్మ" పండుగలు తెలంగాణము, ప్రత్యేకతను

చాటునట్టివి ఈ పండుగలు సాగరాంధ్ర దేశమున కానరావు బొడ్డెమ్మ పిల్లల పండుగ ఇది బ్రతుకమ్మ పండుగకు పూర్వము తొమ్మిది దినములు జరుగును ఇందులో పెద్దలంతా పాల్గొనరు ప్రేక్షకత్వమే గాని పెద రికము వారికేమియు నుండదు పుట్ట మన్నుతో నొకపీట మీద ఐదంతరువుల బొడెమ్మను భాద్రపద బహుళ పంచమినాడు నిర్మింతురు దానిపై నొక కలశము నుంచెదరు కలశముపై నొక కణము (కొత్తరవిక ఒట్ట) నుంచి నుపు గౌరమ్మను నిలిపి పసుపుకుంకుమ, కీడి, రుద్రాక్ష, గోరింట చీర పువ్వులతో నలంకరింతురు, ఇది ప్రతి ఇంటిలో చేయనవసరము లేదు. పల్లెటూరి యందు వాడకొక్క కుటుంబము వారైనను చేసిన చాలును. సాయంకాలమున ఇంటిముందర నలికి (ముగ్గులు పెట్టి బొడ్డెమ్మ నచ్చట నిలువగనె ఆవాడలో నుండు ఆడపిల్లలందరచ్చట చేరుకొందురు పెద్దలీవినోదమును చూచుటకై వచ్చెదరు చూడవచ్చిన పెద్దలలో నొకస్త్రీ పాటలు పాడుచుండగ పిల్లలు చేతులు తట్టుచు బొడ్డెమ్మ చుట్టు తిరుగుచూ పాడెదరు సాధారణంగా బ్రతుకమ్మ పండుగ లప్పుడు పాడెడు పాటలను గూడ ఈ సమయమున పాడెదరు ఈ బొడ్డెమ్మ పండుగ మహాలయామావాస్యతో పూర్తియగును బొడ్డెమ్మ నృత్యములను, ఆట పాటలను, మన ఉత్తరాదుల "గర్భో" నృత్యముతో పోల్చుకొనవచ్చును"[56] అని విశదపరిచారు

ఆచార్య యస్వీ జోగారావుగారు—

"గొబ్బిళ్ళనగా ఒక ఆడపిల్లల పండుగ ఇందూతపదము విశేష గతియందును విలక్షణతగలది. అది తాళ్ళపాక వారి సంకీర్తన లక్షణమున నిబంధ పదముగా పరిగణింపబడినది అర్థచంద్రిక పదము, ఏల పదము, చందమామ పదము మొదలగు వానితోపాటు "పాదయుగళమున బహుజన సంప్రయుక్తిక మగు" నని చెప్పబడినది"[57] అని అభిప్రాయపడ్డారు

డా॥ వేటూరి ఆనందమూర్తి గారు–

"మార్గశిర మాసమున స్త్రీలు, బాలికలు గుమ్మాల ముందు గుంపులు చుట్టి వలయాకారముగ తిరిగి చప్పట్లు చరుచుచు నీ గొబ్బి పాటలు బాడుదురు గొబ్బిపదములకీ పేరు వానిపాదాంత చరణాంత ములందావృత్తములగు బ్బి, బొబ్బిళ్లో బొబ్బియల్లో అను పదముల బట్టి యేర్పడినది"[68] అని పేర్కొన్నారు

పై అభిప్రాయములవల్ల తేలిన అంశాలు

గొబ్బి పాటల్ని సంక్రాంతి పండుగ సమయంలో ఆడపిల్లలు స్త్రీలు, మండలాకారంగా తిరుగుతూ నృత్యం చేస్తూ పాడకారనడం మొదటి లక్షణం ఈ పాటలలో గొబ్బి, గొబ్బెమ్మ అనేవి పూత పదాలు గాను, గొబ్బిళ్ళో, గొబ్బియళ్ళో అనేవి పాదాంత అవృత్తి పదాలుగా వుంటాయనడం రెండవ లక్షణం ఈ పాటలలోని విషయం చాలవరకు పౌరాణికం కావడం మూడవ లక్షణం తెలంగాణా ప్రాంతాల్లోని బొడ్డెమ్మ, బతుకమ్మ పండుగలతో సాదృశ్యం వుండే పండుగ గొబ్బెమ్మ పండుగ అని చెప్పడం నాల్గవ లక్షణం

గొబ్బి పాటలు అన్నమయ్యలో కన్పిస్తాయి మిగిలిన వారిలో కన్పించవు

అన్నమయ్య–గొబ్బిపాట

"కొలనిదోపరికి గొబ్బిళ్లో యదు
కులము స్వామికిని గొబ్బిళ్లో ॥పల్లవి॥

కొండగొడుగునా గోవులగాచిన
కొండుక శిశువుకు గొబ్బిళ్లో
దుండగంపుదైత్యుల కెల్లను తల

గుంపు గంటగొరికి గొబ్బిళ్లో" ॥కొలని॥ (12-98)

పై కీర్తనలో "గొబ్బిళ్లో" అనే మాట ప్రతి రెండవపాదాంతంలో అవృత్తమవుతుంది ఇందులో శ్రీకృష్ణుని అవతారాల్లో ప్రసిద్ధఘట్టాల్ని వర్ణించడం విశేషం ఇది శ్రీకృష్ణుని జన్మదిన ఉత్సవ సందర్భాల్లో పాడినట్లు చెప్పవచ్చు

5 1 3 2 జాజర పాటలు

ఈ జాజర పాటల ప్రసక్తి మొట్టమొదటగ నాచన సోమన గ్రంథాల్లో కన్పిస్తుంది ఇతడు రచించిన "వసంతవిలాసం లోనిదిగా లక్షణకారులు ఈ క్రింది పాటను పేర్కొన్నారు

"గీతా గానము వెన్నెలతేట
రాజ మీరగా రమణులపాట
ప్రాణమైన పిన బ్రాహ్మణపీట
జాణలుమెత్తురు జాజర పాట"

అనే తాళ చౌపదాన్ని శ్రీ ప్రభాకరశాస్త్రి గారు ఉత్తర హరివంశ పీఠికలో వెల్లడించారు

శ్రీనాథుని భీమఖండంలో—

"జాదురజాదురంచు మృదుచర్చరి గీతులు వారుణీ రసా
స్వాద మదాతిరేకముల జంద్రికల్ గాయగ దక్షవాటికా
వీధుల మీదటంగనక వీణలు మీటుచుబాడి రచ్చరల్"
(5-10 3

అని పేర్కొన్నాడు

దామెరల వెంగళ భూపాలుడు తన "బాహుళాస్వచరిత్ర"లో ఋతు వర్ణ సందర్భములో

"జాజులు దేటుల జాడలు పేంచెన్
జాజెర పాటల జాగులు రేగెన్" (2-13)

అని వర్ణించాదు

ప్రాచీన సంగీత నృత్య శాస్త్ర గ్రంథాలలో కూడా "చర్చరీ" గీతాల ప్రసక్తి కనబడుతుంది జాయసేనాపతి విరచితమైన నృత్త రత్నావళి పీఠికలో-

డా॥ పోణంగి శ్రీరామ అప్పారావుగారు-

"చర్చరీ" అంటే "ఇది రాసకతుల్యమే కాని ందు నర్తకులు వసంతోత్సవములందు మండలములుగా నేర్పడి నాయక గుణము లను కీర్తించుచు, నర్తింతురు అని చెప్పారు

శ్రీబాలాంత్రపు రజనీకాంతారావుగారు-

"షోడశమాత్రాః బహవఃపాదః 16 మాత్రలు బహుపాదాలు కలిగి అనుప్రాసాన్వితమై ఉంటుంది ప్రాకృతంలోను (ఆంధ్రాది) దేశ భాషలలోను ఎన్నో చర్చరీ పదాలువున్నవని సింహభూపాలుడు వ్రాశాడు

వసంతోత్సవంలో పాడతగినది శ్రీహర్షుని రత్నావళి నాటకములో వసంతోత్సవ సందర్భములో చర్చరి ప్రశంస ఉంది"[59] అని పేర్కొన్నారు

ఆచార్య బి రామరాజుగారు-

"ఇప్పటికి తెలంగాణమున జాజరపాటలు "కామునిపున్నమ" పండగ దినములందు జానపదులు పాడెదరు నేటి జాజరపాటలకిది మాతృకయై యుండవోపు" అని "జాజరయన నేమిటో అర్థము తెలియ

లాడు శృంగార ప్రయులు పరస్పరము చల్లుకొనెడు కస్తూరి, గంధపొడి పుష్పొడి మున్నగు పరిమళ ద్రవ్యముల పొడియని అన్నమయ్యగారు తొలిసారిగా "60 అని పేర్కొన్నారు

డా|| వేటూరి ఆనందమూర్తిగారు-

జాజర పదము ప్రయుక్తమగుటచేత "జాజరపాట" యైనది" జాజరపాట జాజర ఆటగా పూర్వమే యుండినదో లేక తాళ్లపాక వారి తరువాతనే ఏర్పడినదో తెలియరాదు ఈ జాజర ఆటపాటలు తెలుగున నొక వలుకుబడికి దారి తీసినట్లున్నది-'61 అని అభిప్రాయ పడ్డారు.

డా|| ఆర్వీయస్ సుందరం గారు-

"ఈ జాజర పాటలను కోలలు తడుతూ పాడతారు వీటిని పాడే టప్పుడు కస్తూరి, గంధప్పొడి, మొదలైన వాటిని చల్లుతారు ఈ పొడికి జాజర అని పేరు జాజరపాటలు శృంగార హాస్య రస ప్రధానములై ఉంటాయి "62 అని పేర్కొన్నారు

జి వసుంధర గారు-

"జాజర పాటలను మొగవారు కోలాటము వేయుచు పాడెదరు మొగవారు మాత్రమే కాక ఆడమగ కలిసి జట్టుగా కూడా ఆడుతారు జాజర పాటలు సంధ్యవేళ కోలలుచేత ఖూని లయబద్ధమైన ధ్వనిలో పాడెదరు"63 అని తెలియజేశారు

పై అభిప్రాయాల వల్ల తేలిన అంశాలు

ఈ పాటలలో "జాజర" అనే పదం పాదాంతాలలో ప్రయుక్తం కావడం మొదటి లక్షణం వీటిని వసంతోత్సవ సమయాలలో శృంగార ప్రయులు పరిమళ ద్రవ్యాన్ని చల్లేటప్పుడు గాని, వెన్నెల రాత్రులందు

ప్రీలు పీఠ మీటుతు గాని పాడరు రెండవ లక్షణం ఇవి శృంగార హాస్యరసప్రధానాలై వుండడం మూడవ లక్షణం

రాయలసీమ పదకవులలో తాళ్లపాక కవుల రచనల్లో జాజర పాటలున్నాయి పైగా ఇవి తాళ్లపాక అన్నమయ్య, చినతిరుమలయ్య లోనే కనిపిస్తాయి

అన్నమయ్య – జాజరపాట '

జగడపు జనవుల జాజర
సగినల మంచపు జాజర ||పల్లవి||

మొల్లలు దురుముల ముడిచిన బరువున
మొల్లపు సరసపు మురిపెముచ
జల్లనబుప్పొడి జారంగబితి పై
చల్లేరతివలు జాజర ||జగడ|| (12-274)

"చాలుజాలు నీ జాజర నమ్ము
జాలిబరచె నీ జాజర" ||పల్లవి|| (12-332)

చిన తిరుమలయ్య కూడా జాజర ప్రస్తావన చేసినాడు

"జాజర వలపు జాణడే
వోజ దప్పడుగా నోయమ్మా" ||పల్లవి|| (16-113)

అన్నమయ్య జాజర పాటలు శృంగార పూరితాలు వీటిలో జాజర అనేమాట చరణాంతంలో ఆవృత్తి అయ్యింది

చిన తిరుమలయ్య జాజర పాటలో కూడా శృంగార భావముంది కాని ఈ పాటలో జాజర అనే పదం ఆవృత్తం కాదు పల్లవిలో మాత్రం జాజర అనే పదం కన్పిస్తుంది

5 5 2 3 3 తందాన పాటలు

ఈ పాటల్ని సమూహంలో ఒకరు ఏకతారమీటుతూ పాడుతుంటే తక్కినవారు చివర అందుకొని "తందాన" అనిగాని లేదా 'తందాన తాన' అని గాని వంత పాడతారు

ఆచార్య యస్వీ జోగారావుగారు

"ఇది సంగీతంలో గానంగ విశేషమైన తానశబ్దసంబంధియై యుండును"64 అని అభిప్రాయపడ్డారు

సముద్రాల లక్ష్మణయ్య గారు-

"ఇదిగాన సమయమున మాటిమాటికిని లయను చూపుతూ చేయురాగాలాపన ధ్వని"65 అని పేర్కొన్నారు

తందాన పాటలు అన్నమయ్యలో కన్పిస్తాయి
అన్నమయ్య సంకీర్తనల్లో తందాన పాట

పల్లవి తందనాన ఆహా తందనాన పురె
తందనాన భళా తందనాన

బ్రహ్మమొక్కటె పరబ్రహ్మమొకటె పర
బ్రహ్మమొక్కటే పరబ్రహ్మమొకటే ||తందనాన||

కందువగు హీనాధికములిందులేవు
అందరికి శ్రీహరే అంతరాత్మ
ఇందులో జంతుకులమింతా నొకటె
అందరికి శ్రీహరే అంతరాత్మ ||తందనాన|| (7-151)

5 5 2 3 4 మంగళ గీతాలు

"మంగళ శబ్దాదకి శ్వశ్రేయసం శివం భద్రం

కళ్యాణం మంగళం శుభం"- అని అమరం
"మంగళం సుఖంలా తీతి మంగళం"

సుఖమునిచ్చునది మంగళం అలాగే ధన్యుని పొందునది కూడా మంగళమని అర్థం.

వినోదోత్సవ శుభకార్యాదుల్లో స్త్రీలు పాడేవి మంగళ గీతాలు ఈ మంగళ గీతం చాళుక్య సోమేశ్వరుని అభిలషితార్థ చింతామణిలో "ఉత్సవే మంగళ గేయశ్చర్యా యోగి ఒసైస్త్రధా"66 అని చెప్పబడింది అంటే ఉత్సవ సందర్భాల్లో ప్రయుక్తమవుతాయని అర్థం

ఆచార్య యస్వీ జోగారావు గారు-

మంగళం, హారతి ఆరతి, ఆరాత్రికము, నివాళి, ధవళము మొదలగు బహు విధానములలో బహుగతులతో నీరాజనప్రయోజన పురస్సరమైన ఈ గీతము బహుయక్షగానములందు ప్రయుక్తమైనది సామాన్యముగా షష్ఠ్యంతముగను, పాదాద్యంతముల మంగళ శబ్ద పురస్సరముగ నుండును "67 అని అభిప్రాయపడ్డారు

కృష్ణశ్రీ గారు-

"పురుషుడు భావనాబలమువల్ల తన (ఇంటి) అనుభవాన్ని పెంచి అతిలోక దృశ్యాల్ని నిర్మిస్తాడు. స్త్రీ తన అభిమాన బలమువల్ల స్వర్గలోక వాతావరణాన్ని తన ఇంట్లో కుప్పకూరుస్తుంది మంగళగీతాల్లో ఈ ప్రయత్నమే చక్కగా గోచరిస్తుంది ప్రేమ, భక్తి అనే అందపు భావాల సమ్మేళనం వల్ల ఆవిర్భవించిన ఈ మంగళ గీతాలు ఏ యింటిలో పాడిన అక్కడికక్కడ చక్కగా అమరిపోతాయి, కనుక వీటిలో సార్వజనీనతదే ఎక్కువపాలు. ఇక ఈ ఉత్సవమూ వినోదమూ తన ఇంటివి ఎదురుగా ఊయెలా గొలుసులూ, చలువ మడతలూ

పొందడూ తన స్వంతము. వీటన్నిటివల్ల అపాటకి ప్రత్యేకత వాస్తవికత సమకూడుతుంది "[68] అని తెలియజేశారు

పై అభిప్రాయాలవల్ల తేలిన అంశాలు

ఈ పాటల్లో ఎత్తుగడలో గాని పాదాంతాల్లో గాని, "మంగళం" అనే మాట ఆవృత్తికావడం మొదటి లక్షణం వీటిని ఉత్సవ సందర్భాల్లోను, తదితర శుభకార్యాదుల్లోను పాడతారనడం రెండవ లక్షణం ఇవి షష్ట్యంతాలుగా ఉండడం మూడవ లక్షణం

రాయలసీమ పదకవులు కూడా మంగళహారతులు వ్రాశారు అన్నమయ్య, పెదతిరుమలయ్య, సారంగపాణి, యాగంటివారు, బ్రహ్మంగారు, గుంటువల్లి కోటిలింగయ్య మొదలైన వారు ఈ రకం పదాల్ని వ్రాశారు

అన్నమయ్య-మంగళ గీతాలు

జయ మంగళము నీకు సర్వేశ్వరా
జయ మంగళము నీకు జలజవాసినికి ॥పల్లవి॥

శరణాగత పారిజాతమా
కోరిన సురల పాల భూతమా
అరుదయిన సృష్టికి నాదిమూలమా వో
హరినమో పురము పుటాల పాలమా ॥జయ॥ (7-197)

పెదతిరుమలయ్య-మంగళం గీతాలు

"మాధవునకు మంగళము
సాధుప్రియునకు జయమంగళము ॥ పల్లవి॥

మదన గురునకు మంగళమూ—మా

మదిలోని హరికిని మంగళము
మీద (?) రిపుహరునకు మంగళము
చదువుల మూర్తికి జయమంగళము" ||మాధవు||
(2-గ87)

"చిత్తజగురుడ నీకు శ్రీమంగళం నా
చిత్తములో హరినీకు శ్రీమంగళం" ||పల్లవి|| (21 185)

సారంగపాణి — మంగళహారతులు

"జయమంగళము-నిత్య-శుభమంగళం ||పల్లవి||

ఇందిరారమణునకు-నిభరాజ వరదునకు
మందిరోద్ధారునకు – మాధవునకూ
నందనందనుడైన నవనీత చోరునకు
కందర్పశతకోటి సుందరునకూ ||జయ|| (సా ప సం 199)

యాగంటివారి మంగళహారతి

భర్గోదేవస్య వరగ ధీమహీయనుచు
భర్గుడే దైవమని శ్రుతులు
స్వర్గాధిపతి ఇంద సర్వదేవతులెల్ల
ఆర్యమభిషేక మంత్రాదు లితురు ||పల్లవి||

జయమంగళం నిగమాగమ స్తోత్రాతీతునకు
మంగళం మహిమతో మహిమునకు
మంగళం నిత్యనిర్మల కళాతీతునకు
మంగళం యాగంటి లింగమునకు ||జయ|| ||అనుపల్లవి||

కాలాయనమో కలశ కరుణాయనమో యనుచు
కాలాదర్పించు త్రికాలంబునన్

లీలకా పరంజ్యోతి లింగ నమోయనుచు
కాలజిత కాల ఓంకార యనుచు ॥జయ॥ (కీ. 2486)

బ్రహ్మంగారి మంగళహారతి

మంగళం మంగళం
మనువంశ తిలకకు మంగళం
పెమకోడ మాతకిపుడు మంగళం
మముగన్న తల్లికి మంగళం ॥పల్లవి॥

శ్రీ వీరబ్రహ్మమునను మన్నూరు నీనూరు
మరిముద్దగా జేసి నయముతో కరములకొల్మమర్చి
కొల్మి కోపము చేత సుత్తె
అను నాకలి క్రోవంబు నటువలె జేసెనిపుడు ॥మంగ॥
(కాలజ్ఞాన తత్వములు సం 23)

గుంటుపల్లి కోటిలింగయ్య—మంగళహారతి

"మంగళమనిపాడరే అంగనలారా మంగళహారతులివ్వరే
మంగళమని పాడరే సత్సంగముంగము మదిని నిల్పి
సంగా సంగములు విడి నిస్సంగులై గురులింగనికి
॥మంగళ॥

అన్ని దిక్కుల యందున యెడతెరపి లేకన్ని కాలములందున
మిన్నుమన్నగ్నియును జలమున మారుతమును లేమియును
గాకను
వన్నెలన్నియు మీరి అంతటనున్నపరశివ మూర్తికిని
॥మంగళ॥ (గు కో లి, తత్వములు సం. 27)

పై కీర్తనలన్నింటలో "జయమంగళం., "మంగళం" మంగళ

హారతులు" అనే పదాలు పల్లవిలో ఉండి ఆవృత్తమైనాయి పెద తిరుమలయ్య కీర్తనలో "మంగళం" ప్రతి పాదాంతరల్లోను ఆవృత్తమయ్యింది

అన్నమయ్య, పెదతిరుమలయ్య శ్రీవేంకటేశునికి మంగళహారతులు పాడారు వీరి కీర్తనల్లో భగవంతుని విశేషనామాలు, అతడు నెరవేర్చిన కార్యాల్ని స్మరిస్తూ మంగళం పాడడం గమనించవచ్చు

సారంగపాణి కార్వేటి నగరంలో వెలసిన శ్రీవేణుగోపాలుని దివ్య నామాల్ని స్మరిస్తూ మంగళం పాడినాడు,

యాగంటివారు, గుంటుపల్లి కోటిలింగయ్య వేదాల్లో, శ్రుతుల్లో చెప్పబడిన పరమేశ్వరుని వివిధ నామాల్ని, అతని కీర్తిని స్మరిస్తూ మంగళం గీతాలు పాడారు.

బ్రహ్మం గారు మాత్రం ఆయుధాలకు సంబంధించి మంగళం పాడారు ఈ గీతంలో వివిధ ఆయుధాలుండడం మనం గమనించవచ్చు

5 5 2 4. పరిశిష్టాలు

రాయలసీమ పదకవుల్లో కన్పించే ఇతర జానపదగేయ రీతుల్ని, ఈ వర్గంలో చేర్చవచ్చు ఇందులో రెండు రకాలున్నాయి 1) ప్రతీకలకు సంబంధించినవి 2) ప్రవృత్తికి సంబంధించినవి.

5.5 2 4.1 ప్రతీక సంబంధి

వస్తువుల, పక్షుల పేర్లను ప్రతీకలుగా స్వీకరించడం ఈ పాటల్లోని విశేషం సాధారణంగా ఈ ప్రతీకలు ఆత్మనుద్దేశించినవే

రాయలసీమ పదకవుల్లో "తుమ్మెద" చిలుక, "హంస" ప్రతీక కలిగిన పాటలున్నాయి

5 5 2 4 1 1 తుమ్మెద పదాలు

తుమ్మెదకు షట్పదమని పేరు అంటే ఆరుపాదాలు కలదీ తుమ్మెదలు రకరకాలైన పూలపై వాలినట్లు జీవుడు లోకంలోని పైపై ఆకర్షణలకు లోబడి పతితుడవుతాడనే ఉద్దేశ్యంతో "తుమ్మెద" పదాల్ని పాడతారు ఈ పదాల్లో శృంగారత, తాత్త్వికత రెండూ ఉంటాయి

రాయలసీమ పదకవుల్లో "తుమ్మెద" పదాలను అన్నమయ్య యాగంటివారు వ్రాశారు మిగిలినవారిలో ఇలాంటి పదాలు కన్పించవు

అన్నమయ్య-"తుమ్మెదపదాలు" :

"వేడుక కాడవై విడివడి తిరిగేవు తుమ్మెదరో
చూడ జూడగదొంటి చూపు దప్పకుమయ్య తుమ్మెదరో
||పల్లవి||

తలపు దామరలోన తావై యుండుదు నీవు తుమ్మెదరో
తలవగ నీవె తలపవై తివి మమ్ముదుమ్మెదరో
పొలయ గమ్మని తావి పొందువ దిరిగేవుతుమ్మెదరో
పొలసి నీ తిరిగేటి పొందు లెఱుంగుదుము తుమ్మెదరో"

(4-82)

యాగంటి వారి "తుమ్మెద పదాలు"

శ్రీ కంతుడను పువ్వు తుమ్మెదా
మూడు లోకములయ్యేను తుమ్మెదా
ఓంకారమై యుండు తుమ్మెదా
పరమేగంటి శివుని కాంతమున జూడు తుమ్మెదా ||పల్లవి||

శివశివా యనవె తుమ్మెదా
శివుడనగ విన్నమేలు తుమ్మెదా

శివుని భక్తులకు తుమ్మెదా
శివ శరణన్న మేలె తుమ్మెదా ॥శివా॥ (డి-248)

పై కీర్తనల్లో "తుమ్మెదరో' 'తుమ్మెదా" అనే పదాలు ఆవృత్తమైనాయి

అన్నమయ్య కీర్తనలో "తుమ్మెద'శ్రీ వేంకటేశ్వరునికి ప్రతీకగా స్వీకరించబడింది ఒక భక్తుని ఆవేదనను ఆ వేంకటేశ్వరునికి విన్నవించుకోవడమే ఈ కీర్తనలో విశేషం

యాగంటి వారి కీర్తనలో "తుమ్మెద"ఆత్మకు ప్రతీకగా ఉద్దేశించినది ఈ పాటలో శరీర వర్ణనను తాత్వికంగా చెప్పబడింది ఆరురేకుల పూవు షట్చక్రాలకు, వేయిరేకుల పూవు-సహస్రారానికి అష్టదళాలు అష్టవిషయ వృత్తులకు, తొమ్మిది వాకిండ్లు శరీరమందలి నవద్వారాలకు మమ్మూలకోణాలు సౌమ్య వ్యవస్థకు, పది+ఏదేను ఇరువదియైదు పంచవింశతి తత్వాలకు సాంకేతికాలుగా గుర్తించవచ్చు

అన్నమయ్య తుమ్మెద పదంలో భక్తిభావ పూరితం యాగంటి వారి తుమ్మెదపదంలో తాత్త్విక భావం స్పష్టం

5 5 2 4 1 2 చిలుక పదాలు

చిలుక శుకమహర్షిని సూచిస్తుంది సరస్వతి దేవి మూడవ చేతిలో ఉండేది చిలుక తమిళంలో చిలుకపాటను "కిళిప్పాట్టు" అంటారు మలయాళంలో చిలుక పాటల్ని "కిళిప్పాట్టు" అంటారు భగవంతుడు చిలుక రూపంలో ప్రత్యక్షమై రామాయణ భారతాల్ని గానం చేశాడని "ఎళుత్తచ్ఛన్" ఆ పద్ధతిలో వ్రాశాడని అంటారు చిలుక శబ్దానికి ఇంతటి ప్రాధాన్యం ఉండడం వల్ల "చిలుక పదాల్ని" రాయలసీమ పదకవుల్లో కొందరు తాత్త్విక రూపంలో వ్రాశారు

రాయలసీమ పదకవుల్లో చిలుక పదాల్ని అన్నమయ్య యాగంటి వారు వ్రాశారు మిగిలిన వారిలో కన్పించదు

అన్నమయ్య "చిలుక పాటలు"

"జీవాతుమై యుండు చిలుకా-నీ
వావలికి పరమాత్ముడై యుండు చిలుకా
ఆతుకు పంజరములోన నయమునమండి నా
చేతనే పెరిగిన చిలుకా
జాతిగా గర్మపు సంకెళ్లబడి కాల
జేతబేదై తిపే చిలుకా" (1-50)

యాగంటివారి చిలుక పదాలు

"చింతలన్నియు బాసి చెలరేగి ఆశివ చింత మీదనుండు
చిలుకా
మంతనంబున నుండి మతిచెడి యిల జుట్టు మరులుకొని
రాకుమీ చిలుకా
వింత చదువులు చదివి కాయం మీద వేదాంతము బలుకు
చిలుకా" (డి-2494)

పై పాటల పాదాంతాల్లో "చిలుకా" అనే మాట ఆవృత్తి అయింది

అన్నమయ్య కీర్తన సామాన్య మానవుడు ప్రాపంచిక మాయా బంధనాలలో చిక్కుకొని తల్లడిల్లడం, జీవాత్మ పరమాత్మలకు ఐక్యం చెప్పడం మొదలయిన తాత్విక అంశాలు వ్యక్తం చేస్తుంది

యాగంటి వారి పదం కూడ పై అభిప్రాయాన్నే స్పష్టం చేస్తుంది ఈ రెండు కీర్తనల్లో కూడా తాత్త్వికాంశాలను వివరించడం జరిగింది

5 5 2 4 1 3 హంస పదాలు

ఇది "సోహం" యొక్క వికట రూపం హంసకు పాలునీళ్లను వేరు చేసే శక్తి ఉంది సహజంగా విజ్ఞానానికి తెలుపురంగు గుర్తు హంస తెల్లనిది కాబట్టి విజ్ఞానానికి ప్రతీకగా ఈ పదాన్ని చెప్పారని చెప్పవచ్చు విశిష్ట జ్ఞానం పొందినవారు "హంస" నామధేయులవుతారు "రామకృష్ణపరమహంస" మొదలైనవారు సోహం తత్త్వాన్ని అర్థం చేసుకొన్నవారు (అద్వైత సిద్ధాంతాన్ని) హంసలే, కాబట్టి "హంస" అనే పదానికున్న వైశిష్ట్యం వల్ల "హంస పదాల్ని" వ్రాశారని చెప్పవచ్చు

రాయలసీమ పదకవుల్లో హంసపదాల్ని వ్రాసినవారు అన్నమయ్య తరిగొండ వెంగమాంబ మిగిలిన వారిలో ఇటువంటి రచనలు కన్పించవు

అన్నమయ్య - "హంస పదం"

"దిబ్బలు వెట్టుచు దేలిన దిదివో
ఉబ్బు నీటిపై నొక హంసా ||పల్లవి||

అనువుగ గమల నిహారమై నెలపై
వొనరివున్న దిదె వొక హంసా
మని యెడి జీవుల మానస సరసుల
వునికి మన్నదిదె వొక హంసా" ||దిబ్బ|| (1-16)

తరిగొండ వెంగమాంబ-"హంస పదం"

శ్రీగురుని గొనియాడవే ఓరాజహంసా ||పల్లవి||

రాజయోగివై వెలుగుచుండవే ఓరాజహంసా ||అనుపల్లవి||

ఐదు పద్మముల మీద రాజహంస-నీవు

అరవవద్మము చూడవే ఓ రాజహంస ||శ్రీగురుని||
(సుజ్ఞాన రత్నావళి - సం 83)

పై పాటలు పా ంతాల్లో "హంసా" రాజహంసా" అనే మాటలు ఆవృత్తమైనాయి.

అన్నమయ్య పాటలో రెండు హంసలున్నాయి ఒక హంస సరస్సులో విహరించడం, పాలునీళ్లను వేరుచేసి పాలను ఆరగించడం గుడ్లు పెట్టి రెక్కల్లో దాచుకోవడం, మొదలైన పనుల్ని చేస్తే, రెండవ హంస ప్రాణుల మానససరోవరాల్లో విహరించడం, మంచి చెడుల్ని వేరుచేసి మంచిని స్వీకరించడం ఒక్కొక్క రోమ కూపం నుండి విశ్వ సృష్టిని ఆవిష్కరించడం మొదలైన పనుల్ని చేస్తుంది ఇచ్చట రెండవ హంస శ్రీవేంకటేశ్వరునికి ప్రతీక

వెంగమాంబ పాటలో "పంచేంద్రియాలు' 'కుండలినీ' "సత్తు చిత్తు" "యోగముద్ర" మొదలైన యోగపరిభాషల్ని వివరించడం జరిగింది ఇచ్చట రాజహంస ఆత్మకు ప్రతీక

పై రెండు కీర్తనలు కూడా తాత్త్విక భావాల్ని స్పష్టం చేస్తాయి

5 5 2 4,2 ప్రవృత్తి సంబంధి

ప్రవృత్తి అనగా ప్ర ర్తన ఈ లోకంలోని మాయను, వ్యామోహాన్ని నిరసించి శాశ్వత స్థానాన్ని పొందాలని కవులు ప్ర లకు చేసే హిత బోధలే ఈ పాటల్లో సూచితం దీన్నే హెచ్చరించడం అనవచ్చు సంఘాన్ని సరియైన మార్గంలో పయనింప జేసే ఉద్దేశ్యం కూడ ఈ పాటల్లో కన్పిస్తుంది

ఇందులో జీవాత్మకాలు మనసాత్మకాలు హెచ్చరిక పదాలు వస్తాయి

రాయలసీమ పదకవుల్లో కూడ ఇలాంటి రచనలున్నట్లు తెలుస్తుంది

5 5.2 4 2 1 జీవాత్మకాలు

వేదాంతంలో పరమాత్మ చర్చ తర్వాత ప్రాధాన్యం వహించేది జీవాత్మ చర్చ ద్వైతం జీవాత్మ పరమాత్మల భేదాన్ని చెబుతుంది అద్వైతం ఐక్యాన్ని స్పష్టం చేస్తుంది

రాయలసీమ పదకవుల్లో అన్నమయ్య పెదతిరుమలయ్య చిన తిరుమలాచార్యుడు, యాగంటివారు, వెంగమాంబ జీవాత్మక పదాల్ని చెప్పారు

అన్నమయ్య–"జీవాత్మకాలు" :

"చాలునంటే ఇంచుకంతేచాలును జన్మమునకు
చాలకున్న లోకమెల్ల జాలదు
వీలిన యీ యాసా వెట్టివాని చేతిరాయి
చాలు నింక హరినిట్టే శరణుము జీవుడా" ||మాపు|| (6–157)

పెదతిరుమలయ్య–జీవాత్మకాలు

"అందులోనే వున్నవాడు ఆదిమూరితి
అందరాని పదవియైన నందిచ్చువతడు ||పల్లవి||

ఘనులిండ్ల వాకిళ్లు కావబొయ్యేజీవుడా
కని నీయాత్మ వాకిలి కావలాదా
యెనసి పరుల రాజ్యమేల బొయ్యేజీవుడా
అనిశము నీ మనోరాజ్యము నేలరాదా ||అందు|| (21–133)

చిన తిరుమలయ్య–"జీవాత్మకాలు

"ఎన్నటికి నీకు జీవుడా యిదియె బుద్ధివో జీవుడా
మిగ్గించి నీగురవుల పాదము మరువకు వోవోయి జీవుడా
॥పల్లవి॥

మాట చెప్పెద జీవుడా మారు మాట లేటికి జీవుడా
నాటకంబుల పంచేంద్రియముల నమ్మకు వోవో జీవుడా
చాటితి జమ్మీ జీవుడా నీకు జాటువో హరి భక్తి జీవుడా
కూటువ గూడిన కామక్రోధాదుల గూడకు వోవోయి జీవుడా
॥ఎన్న॥ (16–3)

యాగంటి వారి "జీవాత్మకాలు"

నిన్ను నీవే నిజము దెలియరా–వెర్రిజీవి
నీవుగానిది ఒకటి లేదురా
నిన్ను నివు నిజము దెలియుమన్న–ఈ ప్రపంచో
త్పన్న హేతువై వెలుంగు పరబ్రహ్మమీవురా ॥నిన్ను॥
॥పల్లవి॥

తనువు దెలియ నీవు గావు ప్రాణములకు మనసు బుద్ధి నీవు
గావురా
వినుతమంబు నీవు గావురా ఇంద్రియములు విషయ
ములును నీవు గావురా
ఇనుము అగ్ని కలసినట్లు అంతేగాని వాటి నీవు
యెన లెన్పదెలిసి నీవు ఇన్నింటికి సాక్షి నీవు ॥నిన్ను॥
(ది–2494)

తరిగొండ వెంగమాంబ–జీవాత్మకాలు

"జీవా నీవు నిను గానలేవా – నిన్ను

భావించి చూచితే బ్రహ్మమే కావా ||జీవా||

పరగ దేహము మేడివండు–లోన
తరముగ పురుగులు తొలిచెడువండు
తెరచాటు మాంసపుదిండు–దీని
తెలిగెల్ల చక్కగా తెలిసితే వండు ||జీవా||

(సుజ్ఞానరత్నావళి సం 82,

పై కీర్తనలన్నింటిలోను "జీవుడా" "జీవా"అనే మాటలు ఆవృత్త మవుతున్నాయి

కోరికలు అపరిమితాలు విపరీతమైన కోరికలతో మనిషి బాధ పడుతుంటాడు గుట్టాలే కోరికలైతే ఈ లోకమంతా కూడా చాలదు కాబట్టి విపరీతమైన కోరికలతో బాధల్ని తెచ్చి పెట్టుకోక ఆ శ్రీవేంకటేశుని నిర్మలంగా శరణువేడు అనే సందేశాన్ని అన్నమయ్య తన కీర్తనలో వివరించాడు

ఇతరుల సంపదను చూచి అసూయపడడం కన్నా నీ సంపదలో తృప్తిపడడం, ఇతరుల ఇండ్లకు పోవడానికన్నా నీ ఆత్మ అనే వాకిళ్ల తెరిచి పరమాత్మను శోధించడం, స్త్రీల రూపాన్ని చూచి బాధపడే కన్నా తన రూపాన్ని చూచి ఆనందించడం వంటివి చేయడంవల్ల ఆ శ్రీవేంకటేశ్వరుని సేవ చేయడం వల్ల మోక్షం లభిస్తుందనే సిద్ధాంతాన్ని పెదతిరుమలయ్య స్పష్టం చేశాడు

చినతిరుమలయ్య తనకీర్తనలో ఈ జీవితమంతా ఒక నాటకం సంసారమనే మాయలోబడి మనిషి పతితుడవుతున్నాడు కాబట్టి శ్రీవేంకటేశుని సేవించి ఈ మాయనుండి విముక్తి చెంది శాశ్వత పథాన్ని పొందమనే సందేశాన్ని అందిచ్చాడు

పరబ్రహ్మను వెదికితే జీవునిలోనే ఉన్నాడు మనిషి తనలోని

పరమాత్మను చూడగలిగితే బ్రహ్మజ్ఞాని అవుతాడు ఈ విషయాన్నే యోగంటివారు స్పష్టం చేశారు ఈ అభిప్రాయాన్నే వెంగమాంబ కూడా వ్యక్తం చేశారు

పై కీర్తనలన్నిటిలో కూడ ఆధ్యాత్మికతా భావం స్ఫురిస్తుంది అశాశ్వతమైన ఈ లౌకిక సుఖాల్ని వదిలి శాశ్వతమైన మోక్షాన్ని పొందాలి అనే సందేశాన్ని స్తాయి

5 5 2 4 2 2 మనసాత్మకాలు

ఎదుటి వారికి చెప్పడం కన్నా ముందుగా తనకు తాను చెప్పుకోవడం మంచి పద్ధతి అందువల్లే మనసాంత పదాలు వచ్చాయి మనసు కోతిలాంటిది దానికి నిశ్చలత్వం లేదు మనిషి బంధీకావడానికి విముక్తి కావడానికి మనస్సే కారణమవుతుంది అలాంటి మనస్సులో నిశ్చలత్వం సాధించి మోక్షమార్గాన్ని అన్వేషించాలనే ఉద్దేశంతో వాగ్గేయకారులందరూ మనసాంత పదాలు వ్రాశారు

అన్నమయ్య, చినతిరుమలయ్య, సారంగపాణి యోగంటి కవులు బ్రహ్మం మొదలైన రాయలసీమ పదకవులు మనసాంత పదాలు వ్రాశారు మిగిలిన వారిలో ఇవి కన్పించవు

అన్నమయ్య–మనసాత్మకాలు

"హరినామము కడు నానందకరము
మరగవో మరుగవో మరుగవో మనసా ॥పల్లవి॥

నలినాక్షుని శ్రీనామము
కలిదోష హరము కైవల్యము
ఫలసారము బహుబంధమోచనము
తలచవో తలచవో తలచవో మనసా" (II-1 114)

చినతిరుమలయ్య – "మనసాత్మకాలు"

"చెప్పినా మాట విను చిత్తమా
చిప్పిలు నెండమావుల చెరువులనున్నవా ॥పల్లవి॥

వెగటైన విషయాల వేడుక వేడకు మవి
జిగురు గుండెలు సుమ్మీ చిత్తమా
పొగరు ఋూపుదనాల బొరలకు మవి యెల్ల
తగులు విరి పందెల దారివంటివి ॥చెప్పి॥ (16–12)

సారంగపాణి – "మనసాత్మకాలు"

అద్దె కొంప వంటిది ఈ దేహమనిత్యమే మనసా ॥పల్లవి॥

మిద్దె మీది పరుగులు రెణ్ణాళ్లు సుమీ వేణుగోపాలుని సాక్షిగ
॥అద్దె॥ ॥అనుపల్లవి

పువ్వువంటిది యౌవనమనగా పొంగకే మనసా
నవ్వుగాదు సిరులు మెరుపు వంటిది నమ్మకే మనసా
ముమ్మాటికి ॥అద్దె।
(సారంగపాణి పదాలు 189

యాగంటి వారి "మనసాత్మకాలు"

"దిగులేటికే మనసా – దేవుడుండగనూ
పగలు రేయి ఒకటిగా ప్రణవమిడు మనసా ॥దిగు॥

పరధనాపేక్ష యిక పరిహరించవె మనసా
పరనారి తల్లిగా భావించవే మనసా
పరతత్త్వమే వేళ పఠన చేయవలె మనసా

పరమ హంసను నెక్కి వరముగను మనసా" ||దిగు||

(డి-2495)

బ్రహ్మం గారి మనసొత్మకాలు

"కనుము దగ్గఱబోయి కదలకే మనసా
కనుమ దాటిపోదే కలుగునే మనసా
చెడు గుణంబుల చిక్కి చెడబోకె మనసా
చేరి సద్గురుని సేవించవే మనసా ||కను||

ఆడబిడ్డల నమ్మి అల్లాడకే మనసా
ఆనంద ఇంటిలో ఆల్లాడవే మనసా
సంతకూటమిది నతమెంచకే మనసా
నగిపోయ్యే దారి సాధించవే మనసా" ||కను||

(సుజ్ఞాన రత్నావళి సం 1|)

అన్నమయ్య కీర్తనలో "మనసా" అనే పదం చరణాంతంలో ఆవృత్తమవుతుంది శ్రీ వేంకటపతి నామంపవిత్రమైంది ఎహుబంధ విమోచనమైంది అట్టి కళ్యాణ నామాన్ని ఎల్లప్పుడు స్మరించాలని ఈ కీర్తనాంశం

చినతిరుమలయ్య కీర్తనలో ప్రతిరెండు పాదాలకొక్కసారి "చిత్తమా" అనే పదం ఆవృతమైంది పైపై ఆశలకు పోక శ్రీ వేంకటే శ్వరుని నిశ్చలంగా సేవించాలని స్పష్టం చేశాడు

అద్దె కొంప వంటి ఈ దేహం, యౌవనం, సిరులు, సంసారం అంతా మాయ వీటిని విస్మరించి వేణుగోపాలుని మంత్రాన్ని వరించాలని సారంగపాణి ప్రబోధం

పరధనాన్ని పరస్త్రీలను విస్మరించి పరతత్వాన్ని వరించినట్లు

యితే శాశ్వత స్థానాన్ని అలంకరించవచ్చని యాగంటి వారి అభి ప్రాయం

సారంగపాణి, యాగంటికవుల, బ్రహ్మంగారి కీర్తనల్లో ప్రతి పాదాంతంలోను "మనసా" అనేది ఆవృత్తమయ్యింది అన్ని కీర్తనలు ఆధ్యాత్మికాలు

5 5 2 4 2,3 హెచ్చరిక పదాలు

ముందు జరగబోయే ప్రమాదాన్ని గమనించి జాగ్రత్త పడడం హెచ్చరిక అనగా జాగ్రత్తగా ఉండడం సాధారణంగాపి ల్లలను పెద్దలు ఆయా విషయాల్లో తమ అనుభవంతో హెచ్చరికలు చేస్తుంటారు

హెచ్చరిక పదాల్ని గూర్చి యస్వీజోగారావు గారు-

"ఇది యొక సౌఖశాయనిక గీతం ఇందుపాదాంతమున "హెచ్చరిక" యన్నదొకటి ఊతపదంగా వచ్చును"69 అని అన్నారు

రాయలసీమ వదకవుల్లో అన్నమయ్య, పెదతిరుమలయ్య సారంగపాణి హెచ్చరిక పదాల్ని వ్రాశారు మిగిలిన వారి రచనల్లో ఇలాంటివి కన్పించవు

అన్నమయ్య - హెచ్చరిక పదాలు :

"కంటిమి మీ ఇద్దరెందు కట్టిన యెచ్చరికెలు
జంటలై వున్నందుకును చలము లెచ్చరికె ||పల్లవి||

చెలిమి సేసేయందుకు చెనకులే యెచ్చరికె
యెలయింపులకు నవ్వులెచ్చరికె
వలపులకును తలవంపులే యెచ్చరికె
పిలచి చేనుకొనుటకు పెనగులెచ్చరికె" ||కంటి|| (31-472)

పెదతిరుమలయ్య - హెచ్చరిక పదాలు

"సాలీని మతి వడుగు చరిసేసే యందేయుండు
గాలపు జెండు పై పేటకాని కుండును
వాలాయించి దృష్టి వింటికానికి గుఱి పైనుండు
యీ లీల తత్త్వజ్ఞానికి యెచ్చరికై యుండవలెను"
(21-377)

సారంగపాణి - హెచ్చరిక పదాలు

"శ్రీలలనా మణి రమణా! శ్రిత పోషణ గుణా
శీలాఖిలమయ వేణుగో-పాల హెచ్చరికె!
మురళీ రవలోలా సుం-దర లలిత కపోలా
పరమాత్మ శ్రీ వేణుగో - పాలా హెచ్చరికె!
(సా వ సం 197)

అన్నమయ్య సంకీర్తనలో ప్రతి పాదాంతంలో "హెచ్చరిక" అనే పదం ఆవృతం అయ్యింది

సాలీడు దృష్టి వడుగు మీద ఉంటుంది విల్లుకానికి, దున్నేవానికి, జూదరికి, కోమటికి వారి వారి వృత్తుల్లో హెచ్చరికగా ఉంటారు అదే విధంగా తత్త్వజ్ఞానికి కూడా హెచ్చరికగా ఉండాలని పెదతిరుమలయ్య అభిప్రాయం

సారంగపాణి వేణుగోపాలుని వివిధ పేర్లతో వర్ణిస్తూ హెచ్చరిక చేయడం గమనించవచ్చు

5 5 2 4 2 4 గోవింద పదాలు

రాయలసీమ పదకవుల్లో ఒక్క బ్రహ్మంగారిలో తప్ప ఇతర కవుల్లో గోవిందపదాలు కన్పించవు

బ్రహ్మంగారి గోవింద పదాలు

"నడివీధి నాముందు నాటింతురా కొల్కి
నడిమండల ముందు నాటింతురా
సంధితెలియనట్టి బద్దె కుక్కల కట్టి
సంధించి చాకుల కుమ్మింతురా
శివగోవిందా గోవిందా
ఏడు తిత్తుయి వట్టి పూరింతురా
నాడుల మెండంబు నడిమింట భేదింతురా
దండైన నా గురునంట జేరుక పెద్ద
కొండలన్నియు పిండి గొట్టింతురా" ||శివగోవింద||
(కాలజ్ఞాన తత్త్వములు సం 55)

పై కీర్తనలో చరణాంతంలో "గోవిందా గోవిందా" అనే వాక్యం ఆవృత్తమవుతుంది ఇందులో ఆధ్యాత్మిక భావం వ్యక్తమవుంది

రాయలసీమ పదకవులందరిలోను కనిపించే జానపద గేయ రీతుల స్థూల పరిశీలన ఇంతవరకు విశ్లేషించడం జరిగింది అయితే తాళ్లపాక కవుల్లో పై రీతులు మాత్రమే గాకుండా జాలి పాటలు సొసముఖాలు, శోభనపు పాటలు, కోలాటం పాటల, మొదలైనవి విస్తృతంగా వ్రాశారు దీనికి తాళ్లపాక కవులకాలికి సంగీత శాస్త్రం స్వతంత్రంగా అభివృద్ధి పొందకపోవడం, ఆయా పదకవులకు జానపదగేయ రీతుల మీద మక్కువ కావడం ప్రచారానికి ఈ రీతులు సరైనవని భావించడం కారణాలుగా ఊహించవచ్చు ఇతర వాగ్గేయ కారులు ప్రధానంగా ఆధ్యాత్మిక భావ కు అనుపైన కీర్తనలే వ్రాయడంవల్ల తాళ్లపాక కవుల్లో ఉండే జానపద రీతులు వీరిలో ఉండవు

## సంఖ్యా సూచి

1 భరతముని నాట్యశాస్త్రం – అధ్యాయం-32, శ్లోకం 25, 47
2 డా॥ వేటూరి ఆనందమూర్తి – తెలుగు సంకీర్తన లక్షణము–లక్ష్యలక్షణ సమన్వయములు-భారతి (మార్చి 1971) పుట 59
3 సంగీత సంప్రదాయ ప్రదర్శిని (మొదటి సంపుటం) పుట 106–111
4 పదములు క్షేత్రయ్య(ఆంధ్ర పత్రిక చిత్రభాను సంచిక 1942–43) పుట 15
5 పీఠిక శృంగార పదములు పుట, 111 - XXX VIII
6 ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము పుట 75-77
7 7-14, 12-85 1–75
8 16-2-59
9 సుజ్ఞానరత్నావళి-4
10 సుజ్ఞానరత్నావళి-28
11 సుజ్ఞానరత్నావళి-81
12 సారంగపాణి పదములు - 7, 152
13 డి-2487
13ఎ 5-11
14 సుజ్ఞాన రత్నావళి - 9
15 " -30
16 సారంగపాణి పాదాలు 181
17 సుజ్ఞాన రత్నావళి 8
18 డి-2494

19 1-289 , 8-52 , 11-3-123 , 12-378 , 12-78 , 7-260 , 8-239 , 12-166 , 13-223.

20 7-14 , 1-289 , 12-85

21 23-536 , 21-337

22 16-2-59

23 సుజ్ఞాన రత్నావళి-1,4 9,15,8

24 సుజ్ఞాన రత్నావళి 32,28,30,29

25 కోటిలింగయ్య తత్వాలు 1,19,2,4,21,26

26 సారంగపాణి పదములు - 18,7,194 , 131 , 198 , 97 , 130 192

27 సుజ్ఞాన రత్నావళి 82,77,78,81,83

28 యాగంటివారి పదాలు డి-2494 డి-488 , డి-2489 డి-2495 డి-2495 , డి-2494 , డి-2189 , డి-2489 డి- 494 డి-2486 , డి-2489

29 అన్నమయ్య సంకీర్తనల్లో జానపదఫణితులు పుట 219

30 అన్నమాచార్యుని కవిత (వాణి 22-7-65)

31 తెలుగు జానపద గేయసాహిత్యం పుట 400-403

32 తెలుగులో కొత్త వెలుగులు (మొ సం) పుట 185 188

33 మేలుకొలుపులు (వ్యాసం) పుట 202-203

34 ఆంధ్రయక్షగాన వాఙ్మయచరిత్ర పుట 340

35 మేలుకొలుపులు (వ్యాసం) పుట 24

36 ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర పుట 315

37 మధుర కవితలు పుట 107, 109

38 త్యాగరాజ కీర్తనలు, విశేషవివరణము (వ్ర ళా) పుట 200
తెలుగు జానపదగేయ సాహిత్యం పుట 472

40 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర పుట 342

41 తెలుగు కన్నడ జానపద గేయాలు, పుట 136

42 లాలిపాటలు (వ్యాసం) పుట 199-203

43 ఆంధ్ర పత్రిక పుట 18

44 తెలుగు జానపద గేయసాహిత్యము పుట 472

45 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర పుట 324

46 త్యాగరాజ కీర్తనలు-విశేషవివరణము (ప్రభా)పుట 219

47 అన్నమయ్య పాటలలో జానపద రీతులు (వ్యాసం)

48 ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర పుట 281

49 తాళ్లపాక కవుల పదకవితలు, భాషాప్రయోగ విశేషాలు పుట 359

50 పల్లె పదాలు, పుట 92

51 అన్నమయ్య పాటలలో జానపద రీతులు (వ్యాసం)

52 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర పుట 348

53 తాళ్లపాక కవుల పదకవితలు-భాషాప్రయోగ విశేషాలు పుట 340

54 శ్రీజగన్నాథర థార కృతి గళు, పుట 6

56 తెలుగు జానపద గేయ సాహిత్యం పుట 457

57 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర పుట 321

58 తాళ్లపాక కవుల పదకవితలు-భాషాప్రయోగ విశేషాలు పుట 34"

59 ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము , పు 69-70

60 తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 61

61 తాళ్లపాక కవుల పదకవితలు - భాషా ప్రయోగ విశేషాలు పుట 346

62 తెలుగు - కన్నడ జానపద గేయాలు, పుట 162

3 తెలుగు జానపదసాహిత్యము, స్త్రీల గేయములలో సంప్రదాయము
పుట 250

64 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట 327

65 అన్నమాచార్య సంకీర్తనామృతము (ద్వి భా) పుట 2

66 తాళ్లపాక కవుల పదకవితలు -భాషా ప్రయోగ విశేషాలు,
పుట 336

67 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర , పుట 338-340

68 మంగళ గీతములు (వ్యాసం) పుట 421-423

69 ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర

# రాయలసీమ పదకవులు - సమాజం

సమకాలీన జగత్తుకు, సామాజిక సంచలనానికి అతీతంగా ఏ కవి జీవించలేడు అయా కాలంలో జరిగే రాజకీయ సామాజిక, సాంస్కృతిక పరిస్థితుల్ని ఆయా కాలంనాటి కవిత కొంత వరకు స్పష్టం చేస్తుంది కనుకనే సాహిత్యం సమాజానికి దర్పణం లాంటిది

రాయలసీమ పదకవులు తమ చుట్టూవున్న సమాజం కోసం ప్రజల భాషలో తమ రచనల్ని వ్రాశారు వీరి రచనల ఆధారంగా ఆయాకాలాలనాటి రాజకీయ, సామాజిక, సాంస్కృతిక పరిస్థితుల్ని పరిశీలించవచ్చు

## 6 1 రాజకీయ వ్యవస్థ

రాజులు, రాజ్యానికి సంబంధించిన సమస్తం రాజకీయం అవుతుంది ఆనువంశికంగా సింహాసమెక్కిన రాజులు, రాజ్యం నిలబెట్టుకోవడానికి పాటుపడే ఆరాటం, ఇటు దాయాదుల ఆటంకాలు, అటు విరోధుల దండయాత్రలు, వీటివల్ల ప్రజలు ఎదుర్కొనే సమస్యలు మొదలైనవన్నీ రాజకీయ వ్యవహారాల్లో విభాగాలు

ప్రస్తుతం పరిశీలించే రాయలసీమ పదకర్తలు స్థూలంగా 1 శతాబ్దం నుండి 19వ శతాబ్దం దాక జీవించినవారు ఉన్నారు వీ మూడు రకాలుగా విభజించవచ్చు

1 విజయనగర కాలంనాటి వాగ్గేయకారులు

2 నవాబుల కాలం నాటి వాగ్గేయకారులు

3 సంస్థానాధీశుల కాలంనాటి వాగ్గేయకారులు

6.1 1 విజయనగర కాలంనాటి వాగ్గేయకారులు

విజయనగర కాలంలో ప్రధానంగా తాళ్లపాక కవులున్నారు వీ పదరచనల ఆధారంగా ఆనాటి రాజకీయ వ్యవస్థను కొంతవరకు పరి లించవచ్చు

అన్నమయ్య

అన్నమయ్య విజయనగర రాజులైన సంగమ, సాళు వంశీయులతో ప్రత్యక్ష పరోక్ష సంబంధం కలిగినట్లు తెలుస్తుంది

సంగమ వంశీయులు

సంగమవంశంలో హరిహర రాయలు (క్రీ శ 1336 1357 మొదటివాడు అతని అనంతరం రెండవ హరిహరరాయలు (క్రీ శ 137 -1404) పెద్దకుమారుడు ఒకటవ విరూపాక్షరాయలు (క్రీ.శ 1404 1405) పరిపాలించాడు కాని అతని తమ్ముడైన రెండవ బుక్కరాయులు (క్రీ శ 1405-1406) తన అన్నను రాజ్యభ్రష్టుని చేసి సింహాసన తైవసం చేసుకొన్నాడు అయినప్పటికి ఆతని తమ్ముడైన మొదటి దేవరాయులు తన అన్నను వెంటనే సింహాసన భ్రష్టుని చేసి క్రీ శ 1406-1422 వరకు రాజ్యపాలన చేశాడు మొదటి దేవరాయల అనంతరం మొదటి విజయరాయలు (క్రీ శ 1422-1426 సింహాసన

మొక్కాడు తదనంతరం రెండవ దేవరాయలుగా ప్రసిద్ధికెక్కిన ప్రౌఢ దేవరాయలు క్రీ శ 1426 నుండి 1486 వరకు రాజ్యపాలన చేశాడు

ఈ దేవరాయల్ని ప్రతాపదేవరాయలు విందుకు పిలిపించి చంప డానికి ప్రయత్నం చేశాడు దేవరాయల అనంతరం మల్లికార్జున రాయలు (1447-1465) ఆ తరువాత రాజశేఖర రాయలు పాలించారు అప్పుడు రెండవ విరూపాక్షరాయలు (1465-1485) మల్లికార్జున రాయల కుమారుని చంపించి తాను రాజైనాడు ఆ విరూపాక్ష రాయల్ని రాజశేఖరరాయలు చంపేశాడు చివరకు పశ్చాత్తాపపడి మిగిలిన భుజా గాన్ని ప్రౌఢ రాయలకు ధారాదత్తం చేశాడు

సంగమ వంశీయుల చరిత్రలోని కొన్ని విశేషాలు అన్నమయ్య కీర్తనల్లో కన్పిస్తుంది

వెఱు వెఱు నిండు పేదుక వడినిట్టి
కు ఱచ బుద్దుల నెట్టు గూడుదు నయ్యా

దేహ మిచ్చిన వాని దివిరి చంపెడు వాడు
ద్రోహి గాక నేడు దొరయట

తోడ బుట్టిన వారి తొడరి చంపెడు వాడు
చూడ దుష్టు డు గాక సుకృతి యట (1-235)

పై పాదాల్లో సంగమ వంశీయుల నీచకృత్యాలు స్పష్టమవు తుంది

సాళువ వంశీయులు

సంగమ వంశీయులు తర్వాత సాళువ వంశీయులు విజయనగర సింహాసనమెక్కారు వారిలో సాళువ నరసింహరాయలు 1486-1491

వరకు రాజ్యపాలన చేశాడు నరసింహరాయలు తర్వాత నరసనాయకుడు తిమ్మరాజును రాజుగా చేసి రాజ్యపాలన చేశాడు అయితే ఆచూకీ తెలియని వారు తిమ్మరాజును హత్య చేశారు తర్వాత నరసనాయకుడు ఇమ్మడి నరసింహనాయకుడిని రాజుగా చేశాడ, ^రస నాయకుడు 1503లో చనిపోయాడు.

సాళువ వంశరాజుల ప్రస్తావన అన్నమయ్య కీర్తనల్లో ప్రత్యక్షంగా ఎక్కడా కన్పించదు కాని సాళువ నరసింహరాయలు అన్నమయ్యను ఆదరించడం, తన మీద పాట పాడని కారణంగా అన్నమయ్యకు సంకెళ్ళు వేయించడం స్వామి మహత్మ్యంతో ఆ సంకెళ్లు ఊడి పడడం, ఆపై రాజాశ్రయాన్ని వదులుకోవడం మొదలైన అంశాల్ని కాళ్లపాక చిన్నన్న "అన్నమాచార్య చరిత్ర"లో వ్రాశాడు

ఇదేగాక అన్నమయ్య రాజసేవల్ని కూడా పరోక్షంగా నిందించినాడు

"గరిమల పెరగురు గాక మానవుల
సిరుల డియ్యని నోర జేదు మేసేదా
హరినారాయణ యనియెడి నోరను
ధర నితరుల పేళ్లు దడవుబెట్టు
సరవితో వేదములు చదివేటినోరను
నరుల మీది పదాలు పాడేదా" (9–16)

నరుల నాశ్రయించిన తన అవివేకానికి బాధ పడ్డారు

"ఎక్కడ చూచిన నీవే యేలికె వై వుండగాను
యిక్కడా దొత్తుల బంట్ల నేలితి నేను" (5–252)

విజయనగరంపై తురుష్కులు దండెత్తారు ఆ దండయాత్రల్ని స్వయంగా చూచిన అన్నమయ్య ఆనాటి బ్రాహ్మణుల అగచాట్లను,

శిల్పుల దైన్యం, స్త్రీల మానభంగాలు దేవాలయాల స్థితిని వివరంగా వర్ణించాడు

"తురుములై భూసురుల తుండెములు తుండెములు
యిటువలె భూతములు యెట్టిమోనో
అటువాలల రొదల అకాశ మెట్లోరిచెనో
అంగలాచే కామినుల యంగ భంగపుదోప
సింగినాన మింట సూర్యుడెట్టు చూచెనో
పొంగి నానాజాతి చేత భువన మెట్లానెనో
అరుదు గోహత్యలు సేయగ దూడలం గలాన
సరిధర్మదేవతెట్టు సమ్మతించెనో
దేవాలయాలు నానాదేశముల జొచ్చి
దేవగ నెట్టుండిరో దేవతలు" (11-1-133)

గజపతులు విజయనగరంపై ప్రాభవం చూపినపుడు అన్నమయ్య ఒడ్డెభాష నేర్చుకోవలసి వచ్చింది అ విషయాన్ని

"వాగినొడ్డె భాషలాడి నొడ్డె వాడనైతిని
తెగి తెలుంగాడ నేర్చి తెలుగు వాడనైతి
అగడై శ్రీవేంకటేశ అన్నియు విడిచి నేను
తగు నీదాసుండనై దాసరినైతి" (9-90)

అని చెప్పుకొన్నాడు.

ప్రధానమైన రాజ్యాన్ని సంగమ, సాళువ వంశీయులు పరిపాలిస్తున్న రోజుల్లో వారికి అండదండగా ఉన్నవారు, చీటికి మాటికి ఎదురు తిరిగిన మండలాధీశులు కొందరున్నారు వారిలో బోయదొరలు, రెడ్డిరాజులు చెప్పదగినవారు

బోయదొరలు

అన్నమయ్య సంకీర్తనల్లో బోయనాయకుల ప్రస్తావన చాలచోట్ల కన్పిస్తుంది స్వామిని నాయకుడుగా అన్నమయ్య వర్ణించాడు

"పొడవైన శేషగిరి బోయనాయడు
విడువ కిందరి గాచువెడ బోయనాయడు" (I–460)

అన్నమయ్య కాలం నాటి బోయనాయకులు సామ్రాజ్య క్షేమం కంటె స్వార్థానికి ప్రాధాన్యం ఇచ్చినట్టు కన్పిస్తుంది అన్నమయ్య వారి అగడాల్ని కుండబద్దలు కొట్టినట్లు చెప్పాడు

"భూసురుల కామినుల బోయలనామి (యః) కుల
జేసుకొని యాండ్లై చిమ్మురికిరి" (11–2–77)

రెడ్డిపాళెగార్లు

"తిమ్మిరెడ్డి మాట నిచ్చె దిట్టమైన కాలము
బొమ్మిరెడ్డి కప్పగించె బోదిచేసె కాలము" (10–52)

పై కీర్తనలో తిమ్మిరెడ్డి, బొమ్మిరెడ్డి అనే వారి పేర్లు కన్పిస్తాయి అదే విధంగా గండు గంటిదేవిరెడ్డి, వెలిగొండ కాపిరెడ్డి (11-2-41) అనే పేర్ల ప్రస్తావన కూడా కన్పిస్తుంది వీరందరు రాజులో పాళెగాళ్లో అనడానికి

"ఒక్కడవె లోకాన కెడయవు నీవె
దిక్కుగా నెవ్వరు లేరు తిమ్మినాయడా" (11–2–41)

అనే కీర్తన సాక్ష్యం

"విజయనగర ప్రజల దృష్టిలో "పాలనా" వ్యవస్థ"

పాలన రెండురకాలు ప్రజల క్షేమమే పరమార్థంగా భావించడం

మొకటి తన సింహాసనం భద్రంగా ఉండటానికి ఏర్పాట్లు చేయడం రెండవది ఈ రెంటింటిపట్ల ప్రజల మనోభిప్రాయాలు భిన్నంగా ఉంటాయి వాటిని అన్నమయ్య కవిగా, ప్రజాప్రతినిధిగా తన కీర్తనల్లో స్పష్టం చేశాడు

రాజు-రాజ్యం

బలు దుర్గము వానికి భయమేమిటా లేదు
కలిమి గలవానికి కడమలేదు (2-237)

ఈ కీర్తనలో బలవంతులైన రాజుల సమర్థవంతమైన పరిపాలనకు సంబంధించిన విశేషాలు కనిపిస్తాయి

"పట్ట భద్రుడు గూర్చుండె బలుసింహాసనముపై
పెట్టి బంటు పెట్టేవారు వెఱ్ఱులే కారా" (2-17)

ఇందులో అసమర్థులైన రాజుల పాలనా విషాశేలు కనిపిస్తాయి

రాజులు - భటులు .

ఏ రాజైనా ప్రసిద్ధుడు కావాలన్నా అతని రాజ్యంతోబాటు బలగం కూడా ఉండాలి, అన్నమయ్య ఈ విషయాన్ని

"ఏలికకై పగవారినెదిరించి బరాబొకడు
మేలైన పదవులంది యెరసేనట" (2-152)

అనే కీర్తనలో స్పష్టం చేశాడు

పై పరిశీలనవల్ల విజయనగిర రాజుల, ఇతర నాయకుల పాలన వ్యవస్థ అస్తవ్యస్తంగా ఉన్నట్లు తెలుస్తుంది

పెద తిరుమలయ్య

తాళ్లపాక అన్నమయ్య తరువాత సుదీర్ఘకాలం బ్రతికిన పెద తిరుమలయ్య తన రచనల్లో రాజకీయ పరిస్థితిని ప్రత్యక్ష పరోక్ష పద్ధతిలో సూచించాడు ఇతడు తుళువ వంశస్థులైన అచ్యుతరాయలకు సన్నిహితుడుగా కన్పిస్తున్నాడు అయితే ఇతర రాజుల దండయాత్రలను వర్ణించకపోలేదు

కృష్ణదేవరాయలు విజయయాత్రలను మనసా మెచ్చుకొన్నట్టు క్రింది పదం సాక్ష్యమిస్తుంది

విఱిగి పారెడియట్టి వీరిడి యోరిపులాల
తఱి శరణు చొరరో దండాలు వెట్టరో

వీడె వచ్చె గృష్ణుడిదె వేయరో కైదువులు
జాగిన వోట్లు రాగి కదియకురో
వాడమితో భీతివాయ పూరినోళ్ళ గరవరో
అడువారమనుకోరో అతడు దడవడు

గోవిందుడు దాడివచ్చె గుసుకుమ జారరో
కావుమిని మెడల వొగలు వేయరో
వేవేగ బిడ్డలకు విభుని పేర్లు బెట్టరో
వోవో యెంగిలి చేతులొగ్గరో రక్షించని (7-11)

అలాగే రాజసేవను తిరస్కరించినట్లు క్రింది పాదాలు సాక్ష్యమిస్తాయి,

"అడవిలో మృగ జాతియైనా గావచ్చు గాక
వడి నితరుల గొలువగ వచ్చునా" (21-86)

తనపై జరిగిన హత్యాప్రయత్నాన్ని కూడ పెదతిరుమలయ్య వివరించాడు

నరుల రుక్మాంగదు చేతి కత్తిధార దొల్లి
వరుస ధర్మాంగదుపై వనమాలాయ
హరి నీ కృప కలిమినట్లనే అరులచే
కరఖడ్గధార నాకు గలువ దండాయ" (6-85)

చిన తిరుమలయ్య

చిన తిరుమలయ్య కూడా రాజాశ్రయాన్ని తిరస్కరించినట్లు తెలుస్తుంది రాజులను కీర్తించిన కవులను నిందించినట్లు కూడా క్రింది పాదాల వల్ల తెలుస్తుంది

వెలయ రాజులను దీవించే ప్రాణులాల
కల శ్రీ వేంకటనాథు గానగ రాదా
వలెనని యిందరికి వరాలిచ్చే దేవుడేమి
కొలువు నిలువుపాటి గుణమియ్యనోపడా" (16-1-42)

అదే విధంగా చినతిరుమలయ్య రాజుల వల్ల కొన్ని బాధల్ని అనుభవించినట్లు తెలుస్తుంది ఆ బాధలేమిటో స్పష్టంగా లేదు

"యెవ్వరి సొమ్ముగుడిచి యెవ్వరి గుఱ్ఱాలవెంట
కొవ్వు దీర బారాడి కొలిచేది
యివ్వల బుట్టించి పెంచి యేలినదేవుడుండగా
అవ్వలివ్వలి వారిని ఆసపడదగునా" (16-1-55)

అయితే పాలకుల ఉదారస్వభావాల్ని కూడా చినతిరుమలయ్య వర్ణించక పోలేదు. మచ్చుకు

"తానె బుద్దెరిగితే తప్పులేల వచ్చీని

మానవ యేలిక లెవ్వ మన్నింపుమిగాక" (16 1-25)

6 1 2 నవాబుల కాలంనాటి వాగ్గేయకారులు

నవాబుల కాలంలో వీరబ్రహ్మం, దూదేకుల సిద్దయ్య ఉన్నట్లు తెలుస్తుంది

17వ శతాబ్దం తొలిరోజుల దాకా కర్నూలును రామరాయల మనుమడు గోపాలరాజు పాలించాడు తర్వాత బీజపూర్ సుల్తాన్ పంపిన అబ్దుల్ సాహెబ్‌ఖాన్ కర్నూలును ఆక్రమించాడు అతని తర్వాత అతని తమ్ముడు మహమ్మద్ కర్నూలును పాలించాడు 1686లో ఆంగ్లేయులు ఆక్రమించుకొనే దాకా ఈ నవాబులే పాలించారు

1713లో అబ్దుల్ వలీఖాన్ అనేవాడు కడపనవాబు 1 759 వరకు ఈ నవాబుల పాలన సాగింది. సిద్దవటాన్ని గోలకొండ నవాబులు పాలించినట్లు చరిత్రలో ఉంది

వీరబ్రహ్మం, దూదేకుల సిద్దయ్యలు ఈ నవాబులందరిని కలిసినట్లు, వారికి కాలజ్ఞాన బోధలు చేసినట్లు బ్రహ్మంగారి చరిత్ర స్పష్టం చేస్తుంది కాని ఆనాటి రాజకీయ పరిస్థితులను, వీరు తమ పదాల్లో ఎక్కడా స్పష్టంగా పేర్కొనలేదు దీనికి కారణాలు రెండుగా చెప్పవచ్చు వీరబ్రహ్మం, దూదేకుల సిద్దయ్యలు తాత్విక దృష్టితో తత్వాలు చెప్పడం ఒకటి వీరిద్దరు రాజాశ్రయం సందుండగ ప్రచారం చేయడం కూడా మరొక కారణం కావచ్చు

6 1 3 సంస్థానాధీశుల కాలంనాటి వాగ్గేయకారులు

సారంగపాణి, గోవిందసామయ్య తరిగొండవెంగమాంబలు సంస్థానాధీశుల కాలంనాటి వారని చెప్పవచ్చు

"సారంగపాణి"

సారంగపాణి కార్వేటినగర సంస్థాధీశులచే సత్కరింపబడి వారి

ఆశ్రయంలో ఉండినట్లు సారంగపాణి స్పష్టం చేశాడు

"పుట్టినది మొదలు ; భూపాలకుల గొలిచి
వచ్చెదన్నానికై ఎడగులెత్తి" (సా ప 184)

చివరకు రాజాశ్రయం మీద విసుగుచెంది "కోపము జేసే నర నాథుకొలువుగొలిచే దొక రోతా చీచీ" (సా ప 173) అని బాధపడ్డాడు

గోవిందసామయ్య

గోవిందసామయ్య కార్వేటినగర సంస్థానాధీశుల ఆస్థాన కవిగా ఉండేవాడు

కార్వేటినగర సంస్థానాధీశుడు వేంకటపెరుమాళు రాజుగారు వేంకటగిరి రాకుమార్తెను పెళ్ళాడినాడు ఏ కారణంవల్లనో వేంకట పెరు మాళురాజుగారు ఆమెను పుట్టింటిలోనే వదిలివేశాడు,

వెంకటగిరి రాకుమార్తె గురువు గోవిందసామయ్య తన రాకుమార్తె సంసారం చక్కబడడం కోసం రాకుమారి చేత మగవేషం వేయించాడు రాజుగారి కొలువులో ఆమె చేత నాట్యం చేయించాడు తరువాత రాజు గారు ఆమెను అనుగ్రహించాడు

పై పరిశీలనవల్ల రాజుగారి స్వవిషయాల్లో ఇతరులు జోక్యం చేసుకొనేవారని స్పష్టం

తరిగొండ వెంగమాంబ

వెంగమాంబ తత్వాల్లో రాజకీయ పరిస్థితులకు సంబంధించిన అంశాలు కన్పించవు ఆమె రాజాశ్రయంలో ఉండకపోవుటే ఇందుకు కారణం కావచ్చు అంతేగాక ఆమెలో తాత్త్విక దృక్పథం ఎక్కువగా ఉండడం కూడా ఒక కారణం కావచ్చు

6 2 సాంఘిక వ్యవస్థ

మానవుడు సంఘజీవి కవి కూడా సంఘంలో భాగస్థుడే ఏ కవి గూడ సంఘం కట్టుబాట్లను అధిగమించలేడు అంతేగాక సమకాలీన సామాజిక పరిస్థితులు కవిపై అనివార్యం

రాయలసీమ పదకవులు కూడ తమపదల్లో ఆయా కాలాల్లోని సమకాలీన సామాజిక పరిస్థితుల్ని ప్రతిబింబింపచేశారు వీరి రచనల ఆధారంగా సాంఘిక పరిస్థితుల్ని ప్రధానంగా మూడు రకాలుగా వర్గీకరించవచ్చు

1 వర్ణ వ్యవస్థ
2 వృత్తి వ్యవస్థ
3 సాంస్కృతిక వ్యవస్థ

6 2 1 వర్ణవ్యవస్థ

వర్ణం కులం జాతి అనే మాటల్ని నేడు సమానార్థంలో వాడుతున్నాం వర్ణమన్నది బ్రహ్మణాది చాతుర్వర్ణ్యాల్ని, కులమన్నది వంశం తెగను, జాతి అన్నది కులం పుట్టక, చండాలమాతంగ జాతుల్ని విశ్లీకరిస్తుంది

వర్ణమనేది మొట్టమొదట రంగుల బట్టి ఏర్పడింది అయితే క్రమంగా అది వృత్తుల బట్టి మారుతూ వచ్చింది ప్రారంభదశలో ఈ నాలుగు వర్ణాల మధ్య విభేదాలు లేవు కాలక్రమేణా ఒకరి ఆధిక్యం వల్లనైతేనేమి లేదా తాముకూడా ఇతరులకు తీసిపోమనే భావన ఇతరుల్లో రూఢిగా ఏర్పడడం వల్లనైతేనేమి చారిత్రక, రాజకీయ, సాంఘిక వాతావరణంలో చాలా మార్పులు సంతరించుకొన్నాయి

రాయలసీమ వాగ్గేయకారులందరు తమ కీర్తనల్లో జాతి, కుల

ర్థాల్ని ప్రస్తావించారు

జాతి పద ప్రయోగం

అన్నమయ్య

"తమలో నెవ్వరయినా తమజాతి
తమనేర్పు ఎక్కుడై తోచు తక్కువ నరు" (8-262)

"జాతి భేదములు శరీర గుణములు
జాతి శరీరము తోడనే చెడు" (10-144)

"జాతి యిందే దంత్యజాతి యిందేది
జాతులన్నిటా నాత్మ సర్వేశుడు" (2-136)

పెద తిరుమలయ్య

"ఎలుయోనులందు పుట్టి భ్రమసితిని
అలర నేనేజాతి నముకొందువయ్య" (21-85)

"తలయేల కులమేల తపమే కారణము
యెలమి హరిదాసులు యే జాతియైన నేమి" (21-285)

కుల పదప్రయోగం    అన్నమయ్య

"పదిలమగు కులము గల ఫలము తాజదుపుట
చదివిన ఫలం బర్థసారంబుగమట" (1-236)

"కులజుండని యింటనుండి కులహీనుని యింటనుండే
యిలలో నెండకు హీనమయ్యీనా" (6-129)

కులమున జుట్టాలు కోటాను కోట్లు
కలిమిలేమి కొక్కడనే గుటి

పలు లంపటముల ప్రజలే యిందరు
నిలచిన చోటికి నొక్కడనే" (6-99)

చిన తిరుమలయ్య

"కులమేమి సేసిని గుణమేమి సేసిని
నలువైన శ్రీవేంకటనాథుడుండగా
అలరి వాల్మీకికి అలనాడహల్యకు
కులమేమి సేసెనయ్య గుణమేమి సేసెను" (16-1 43)

వీరబ్రహ్మం

"కులము వాసన — కలిమివాసన
కొలిమిలో డగ నూది యనాది
నిష్కలితులై తెలివొంది వారికి
తొలగు నేమోగాని మాయకు" (సుజ్ఞాన రత్నావళి–10)

దూదేకుల సిద్దయ్య

"ఏ కులమని నను వివరమడిగితే యేమని దెల్పుదు
లోకులకు పలుగాకులకు దుర్మార్గులకు నీ దుష్టులకు" ||ఏకుల||
(కాలజ్ఞాన తత్త్వాలు–28)

కుల మెంచవగా నేల గుణమే కారణము
కులబిందు కులమాయె కులమెక్కువేది ||కుల||
(కాలజ్ఞాన తత్త్వాలు–29)

సారంగపాణి

"తన కులాచారము బో విడువక
తల్లిదండ్రిమాట నిగ్రహించేక" (సా 170)

"కులము వెలయ సత్కీర్తి వహించే
కొడుకొక్కడె చాలు" (సా-165)

యాగంటివారు :

"కలయ నెనబదినాలుగు ఘనలక్ష జీవముల
నలయక సహస్ర యోనులందు
తావెడలి మరచి అన్నిటి యెందు మగు
డవుటే గాక యే కులము ఈ ప్రాణికి

యే కులము యేకలిమి యే చెలిమి
యే బలిమి యేనిత్యమే సత్యము
యే తల్లి యే దండ్రి యేరూపు యేరేఖయురుగు
నా వశమా కారణంబున యిల్లు వచ్చి
పోవుటే కాక యే కులము ఈ ప్రాణికి" (డి–2494)

"జనన మరణంబు సప్తధాతువ చిత్తతను
గుణము పంచభూత వికారమై
యెనని దుఃఖముల యీషణత్రయము నను
ఘనమైన కులమేది కానికులమేది"

గతియైన యేగంటి కర్తయని కొలచిన
అతడే వో సత్కులజుడని శ్రుతులు బలుకన్" (డి–2494)

జాతి అన్నమాట అన్నమయ్య పెద తిరుమలయ్య పదాలలో మాత్రం కనిపిస్తే "కుల"మన్న మాట అన్నమయ్య, చినతిరుమలయ్య వీరబ్రహ్మం సిద్ధయ్య, సారంగపాణి, యాగంటివారు రచనల్లో కనిపిస్తుంది

రాయలసీమ పదకవులందరు "వర్ణ" ప్రస్తావన చేశారు

6 2 1 1 బ్రాహ్మణ

చాతుర్వర్ణ విధానంలో మొదట బ్రహ్మణ వర్ణాన్ని చెప్పడం పరిపాటి ఈ ప్రస్తావనను మూడు రకాలుగా విభజించవచ్చు

1 సనాతన విశ్వాస ప్రదర్శన

(ఎ) బ్రాహ్మణాది చాతుర్వర్ణ్య విధానం ఋగ్వేదంలో పురుష సూక్తంలో కన్పిస్తుంది ఈ విషయాన్నే అన్నమయ్య, యాగంటి వారు ప్రస్తావించారు

అన్నమయ్య

"మొగమున బ్రహ్మణమొలచి రట ఆ మూరితి ఊవయవ
రవాతులట" (7-18)

యాగంటివారు

"మొదల అంతముడై మోదమున శూద్రుడై
వదిలముగా వైశ్యుడై, బహువులను క్షత్రియుడై
వదనమున బ్రాహ్మణుడై వారినందరిలోన
చెదరి వంశమున శక్తుడౌటిగాక యేకులము" (డి-2494)

(బి) భగవంతుని బ్రాహ్మణనామాలతో కీర్తించడం

అన్నమయ్య

అంతయు నీమహామే హరిభట్లా

సూరి బట్లాక ఎంక చారని చోట్ల చొచ్చి
వార బియ్యమెత్తి యెత్తివడదాకి

నీరు వట్టుగాని యామి నీళ్లెల్లా నారవట్టి
కేరి కేరి నగవయ్యా కృష్ణ బట్లా (6-70)

సారంగపాణి

ముత్యాలా కుళ్లాయిమాకు—ముందుర బెట్టేది శానా
యిత్యాహ భట్లనా మేలు—ఇక నిన్ను గూడేదమున్న (సా 26)

నరహరిభట్ల వేలి ఉంగరాలు—యెరువు దిసికోని
తిరుగ అడగబోతేనెత్తిన – తిరుమల కొప్పుబెట్టించిన (సా 92)

కృష్ణభట్ల, హరిభట్ల, నరహరిభట్ల మొదలైనవి కేవలం విప్ర నామాలే గాదండా కృష్ణుడు, విష్ణువు, నరహరి రూపాల్ని కూడా తెలియజేస్తాయి

11 పరమార్థ దృష్టితో సమన్వయించడం

అన్నమయ్య

"అణురేణు పరిపూర్ణుడైన శ్రీవల్లభుని
గణుతించు వారు వో బ్రాహ్మలు"

"ఆదినారాయణుని ననయంబు దమయాత్మ
బాదు కొలిచిన వారు బ్రాహ్మలు
వేద రక్షకుడైన వేంకటగిరీశ్వరుని
పాదసేవకులు వో బ్రాహ్మలు" (1-365)

యాగంటి కవులు

"హరుడు బ్రాహ్మణుడు పురహర భక్తులాగ్రజులా
పరదైవతార్చకులు బ్రాహ్మణులన దగునా ||హరు||

ధరను మాతాపితరుద్రుడే దైవమని
అరయ వేదములు పలుక సర్వాధిపతి శివుడు
పరికింప మేటి పరబ్రహ్మమని
ధరనున్న శ్రుతులెల్ల బ్రాహ్మణుడని బలుకన్ ॥హరు॥

పంచముఖ రూపుగా పంచశివులను దెచ్చి
మించి మేధావి నమ్మిబూలి బూసి
పంచాక్షరి మంత్ర భర్గుడే దైవమని
యెంచగాయత్రి పఠియించు బ్రాహ్మణుడు ॥హరు॥

రీతిమతం సత్యం పరబ్రహ్మమనచు
నతుల ఋగ్వేదోక్తి నటు కీర్తిచేయన్
ద్రుతిని బ్రహ్మాధిపతి బ్రాహ్మణోధి
పతి యనుచు యజుర్వేదశ్రుతులు ఘలుకన్ ॥హరు॥(డి-2494)

పై పాదాల్లో బ్రహ్మశబ్దం విశాల అర్థమైన పరబ్రహ్మతత్త్వాన్నే తెలియజేస్తుందిగాని సంకుచితమైన వైష్ణవ స్మార్తులాదుల్ని తెలియ జేయదు

111 స్వభావ ప్రకటన

బ్రాహ్మణుల స్వభావాల్ని పెదతిరుమలయ్య, సారంగపాణి చెప్పారు

పెదతిరుమలయ్య :

"వొరసి విప్రులందు నుండు బహుగుణములు
నిరుల మంచి తనాలే చేపట్టగవలయు" (21-322)

సారంగపాణి

"పగలురేయి జాగ్రత్తగా నడిచి

బ ఎగెండ్ల పూటకూళ్ల గుడిచి" (సె వ 138)

"సంగమ నాయకమిను బీమెడుండాయి
బింగరమెయి బావనోల్లకు" (సాం,వ 147)

పై పంక్తుల్లో సారంగపాణి బ్రాహ్మణులు పూటకూళ్లను నడిపే వారని, ఇతర భయపడేవారని ఇతరులు బ్రాహ్మణులను బాధిస్తుంటారని వారిలో అనేకత్వం కారణంగా కలహాలెక్కువ అని స్పష్టం చేశాడు

6 2 1 2 కోమటి/వైశ్య

వైశ్యులు ఆర్యవైశ్యులని రెండు రకాలు వీరంతా సాధారణంగా వాణిజ్యం కులవృత్తిగా కలవారు

తాళ్లపాక ఎదకవులు, సారంగపాణి తమ పదాల్లో కోమటి ప్రస్తావన చేశారు ఈ ప్రస్తావన రెండు రకాలుగా ఉంది

I సనాతన విశ్వాస ప్రకటన

పురుషసూక్తంలో "వైశ్యుల ప్రశంసను అన్నమయ్య యాధాతథంగా అనువదించారు

"పగటున తొడలను వైశ్యులట ఆ బ్రహ్మము
దేహము బయిటలు' (7-18)

"ఉన్నతి వైశ్యులు వూరువులందును" (9-241)

II, స్వభావ ప్రకటన :

అన్నమయ్య, పెదతిరుమలయ్య చినతిరుమలయ్య, సారంగపాణి కోమట్ల స్వభావాన్ని విశదీకరించారు

అన్నమయ్య

ఉల్లిదిన్న కోమటూరవున్నట్లు

జల్లెడ న వాలు జారిపోయినట్లు (2-194)

పెద తిరుమలయ్య

సన్నుల గోమటి చూపు సరకుల పైనందు
యెన్నగా దత్త్వజ్ఞానికి యెచ్చరికై యుండవలెను (21-377)

చిన తిరుమలయ్య

"యేరా వొద్దన్న ఎల్లరికి నాతోను
మేరి నవ్వేవు కోమటి మెనరికమా" (16-2-38)

సారంగపాణి

"ఏమిసేతు మె సమూరొగా ఆ
యెమ్మెలాడికి సందాయెగా ఇది
కోమటి విశ్వాసమాయెగా-వేణు
గోపాలుడు రాడాయగా యిక" (సా వ 85)

"కొత్త చీర రాతిరి తెచ్చిన
కోమటి చోడివలె నేమైన" (సా వ 139)

6 2 1 3 ఇతరులు

1 యాదవ/గొల్ల, 2 చెంచులు, 3 బోయలు/నాయుడు 4 రెడ్డి/కాపు, 5 పిచ్చైలు, 6 దాసరులు 7 పంచములు ఇందులో వస్తారు

6 2 1 3 1 యాదవ/గొల్ల

గోవులను రక్షించువారు గొల్లవారు వీరి ప్రస్తావన అన్నమయ్య, పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య, సారంగపాణి పదాల్లో కన్పిస్తుంది. మిగిలిన వారి పదాల్లో వీరి ప్రస్తావన కన్పించదు

అన్నమయ్య

"కైవల్యమొసగు ఘననిధికి మ
హా విధి జడులకు యాదవ కులజుడు" (11-3-105)

అనే కీర్తనలో యాదవకులశ్రేష్టత్వాన్ని చెప్పడం జరిగింది.

"వరన మేకపిల్ల జంకబెట్టుక నూత
నరయు గొల్లని రీతి నజ్ఞానినైతి" (5-19)

"గొల్లెతల కేలరా గోవ జవ్వాది నీకు
చెల్లుంగాక యెటు తెంజేసిన నన్నును" (3-489)

"కొనవే గొల్లెతా గబ్బి గొల్లెతా
మతకారి గొల్లెతా మంకులాడి గొల్లెతా
రతులకు మాయింటికి రారాగొల్లడా" (25-13)

పై కీర్తనల్లో గొల్లెతల స్వభావాన్ని చెప్పడం జరిగింది

పెదతిరుమలయ్య

"వల్లగా విటుడవై రేపల్లెలో మండేనాడు
గొల్లెత నయితానన్ను కూడు కొందుగా" (21-6)

"అందముగ నిన్ను వారి యంగములు సోకి తేమ
విందువలె గొల్లముంజు వేయకుండనా" (21-172)

"గబ్బి గొల్లెతల ముద్దు ఘనమాయ నాకునేడు
పుబ్బుచు నే చేత్రకైనా నూతకుండే బాలుని" (23-94)

చిన తిరుమలయ్య

"కింది చూపుల గిలిగించి ఆల
మంద గొల్లెతల మరగించి" (16-2-82)

"వక్కణల మాటలకు వలసివెంటదిరుగ
తక్కరి రేపల్లె గొల్లదానవా యేమి" (16 2 89)

"జట్టిగా గొల్లెతల కేళి చంద్రగావి
గట్టిగాగా నీవే దట్టి గట్టుకొరా" (16-2-100)

"మందలోని గొల్లెతల మరగించి వచ్చెనే వాడు
సందడి పెండ్లి కొడుకు జాణకృష్ణుడు" [16- -110]

సారంగపాణి ॥

"పాలు దినము దెచ్చియిచ్చి
బట్ట శింబోళును బట్టిచ్చి
చేలో మందల దోలిన గొల్ల
"చెంగడి" కే నామము బెట్టిన" (సా ప 97)

"పండ్లు గావలె చెల్లెండ్లకనుచు గొల్ల
యిండ్లిండ్లు పూచెండ్లు కొమ్మని పగ
వాండ్లు నవ్వగా వచ్చేనెండేండ్లదాకవు నిన్నే
పెండ్లాడేనని గూడ నిండ్లకు బిలచేవు" (సా ప 46)

పై కీర్తనలో గొల్లెల స్వభావాల్ని వివరించడం జరిగింది

6 2 1 3 ॥ చెంచులు

చెంచులు అడవుల్లో జీవించే ఒక జాతి ఈ జాతివారు ప్రధానంగా రాయలసీమ, తెలంగాణాలో ఉన్నారు

చెంచుల ప్రస్తావన అన్నమయ్య మాత్రమే చేశాడు మిగిలిన రాయలసీమ పదకవుల్లో కన్పించదు

అన్నమయ్య

అన్నమయ్య సంకీర్తనల్లో ఈ చెంచుల ప్రస్తావన చాలచోట్ల కన్పిస్తుంది దీనికి రెండు కారణాలు ఒకటి లక్ష్మీదేవి కావ్యగ్రస్తమై చెంచుకులంలో పుట్టిందని ఆ అమ్మవారిని నరసింహుడు పెళ్లాడాడని జానపదుల విశ్వాసం

రెండవది అన్నమయ్య అహోబలంలో ఆదివన్ శఠగోప యతీంద్రుల వద్ద విద్యాభ్యాసం చేయడం వల్ల ఆపరిసరాలతోను, ఆ కథలతోను పరిచయం కలిగినవాడు కావడం అందువల్లనే చెంచుల ప్రసక్తి అన్నమయ్య కీర్తనల్లో కన్పిస్తుంది మిగిలిన వారి రచనల్లో కన్పించదు

"మొల్లలేటి నాకు తన్నె ముడుచు కొమ్మనవె నీ
జెల్ల పూవుకొప్పుతావి చెంచుదానను" (4–108)

"చెడ్డ చెడ్డ చెంచువారము అల
దొడ్డి వాడ బోవయ్య దూశి కాళ్లరాక" [12–58 |

"చెంచుల్లో గొల్లెతలా మెచ్చిన యట్టివాడవు
మించి నేనొక్కతెనే మెప్పించేనా" (29–136)

పై కీర్తనల్లో చెంచువారి స్వభావం ప్రస్తావించడం జరిగింది

6 2 1 3 3 బోయలు నాయుడు

అనంతపురం మండంలో "బోయలు" ఎక్కువ వారు కృష్ణదేవ రాయలకు యుద్ధాలలో చాల సహాయం చేసినట్టు ఆధారాలున్నాయి మంత్రతనం, మోటునివాసం వగసాధించే గుణం, నిగ్గుబిడియం లేక పోవడం అనేది వారి గుణాలకు సంబంధించినది అన్నమయ్య బోయి తల సౌందర్యాన్ని బోయల ఆకారాన్ని తన ఆధ్యాత్మ శృంగార కీర్తనల్లో చెప్పాడు పెదతిరుమలయ్య కూడ వీరిని ప్రస్తావించాడు మిగిలిన వారి కీర్తనల్లో వీరిప్రస్తావన కన్పించదు

అన్నమయ్య

భోగేంద్ర శయనుని బోయిలి దివ్య
భోగాలు మరగిన బోయతి
పొదిగొన్న పెనుగొప్పె బోయతి మించు
పొదలిన గుబ్బల బోయతి
పొదల బూవులు చూచి బోయతి యుంప
పొదిసవి పెరచెసె బోయతి
పొడల గందపు మేని బోయతి వప్పి
పొడ కప్పురపు బూత బోయతి" (12 – 175)

"ఎండ బోయిరాండ్ల మానముపై దిట్టుకొంటూ
అంది పోకముడి విడిచాడు కొంటాను
కిన్నెర కలుకుల కెరలి జారెడి గుబ్బ
చన్నుల మాయదు బోయ జవరాలు" (4 – 116)

అని అన్నమయ్య బోయతుల సౌందర్యాన్ని వర్ణించాడు

"పొలుపు మీసాల పెద్దబోయనాయడు
ఉలిగి వీపున గట్టిపుంటు బోయనాయడు
పొలము రాజై తిరిగే బోయనాయడు
వెలయు మోటున నుండే వేట బోయనాయడు" (1 – 460)

పై పాదాల్లో బోయనాయకుల వేషం, గుణాల్ని వర్ణించాడు

పెద తిరుమలయ్య

"దొమ్మి సరసాలాడితే దొరతనాలు సెల్లునా
వుమ్మడిసే సక్కనాయ ఉండవయ్య నాయుడా" (23–128)

6 2 1 3 4 రెడ్డి / కాపు

ఆంధ్రదేశాన్ని పాలించినవారిలో రెడ్డిరాజులు ప్రసిద్ధులు. రాయల

సీమలో రెడ్లకులం వారిదే పైచేయి రెడ్లలో అనేక తెగలున్నాయి అందుకే రెడ్లలో తెగలకు వడ్లలో తెగలకు లెక్కలేదనే సామెత ఉంది

రాయలసీమ పదకవుల్లో అన్నమయ్య, సారంగపాణి పదాలలో రెడ్డిప్రసక్తి ఉంది

అన్నమయ్య

"తిమ్మిరెడ్డి మాకు నిచ్చె దిష్టమైన బొలము
బొమ్మిరెడ్డి కప్పగించె బోదిసేసె బొలము " (10 - 52)
"కాపుటూరి పంగలోజ గడిమీది రాజు జాగా
కాపులెల్లా పనిమాని కందినయట్లు" (11-2-31)

సాధారణంగా దేవుని పేరుకు తమకులం పేరుతో కలిపి చెప్పడం అలవాటే కాని ఆ పేర్లతోనే స్వామిని సంబోధించడం అన్నమయ్య అలవాటు

సారంగపాణి

"దూడతడుపా తిరువళ్ళూరి
అడిగానివలె ముక్కు
సడ్డా తల వణుకా మరగుజ్జా
నల్లపరెడ్డివలె నేనైన" (సా ప 139)

నల్లపరెడ్డి కున్న వంకరలు వేణుగోపాలునికి లేవని సారంగపాణి అభిప్రాయం

62135 ఎల్లెలు

"పిల్లెలు" అనే వాళ్లనే 'కర్ణాలు' అని కూడా అంటారు వీరు లెక్కలు వేయడంలో సిద్ధహస్తులు వీరి ప్రస్తావన సారంగపాణిపదాల్లో మాత్రమే కన్పిస్తుంది

"గ్రామ లెక్కగ్రాశే పిళ్ళకు
గర్భము ధరించెనట" [సౌ వ 96]

6 2 1 3 6 దాసరులు

దాసరులంటే వైష్ణవులని ప్రసిద్ధి వైష్ణవంలో ప్రధానంగా వున్న దాస్యభక్తి భావంవల్ల వీరికి "దాసరులు" అనే పేరు వచ్చింది వీరు విష్ణు సంకీర్తనలు చేస్తూ భిక్షాటన చేస్తుంటారు

సారంగపాణి దాసరుల ప్రస్తావన చేశాడు

"అయ్యతోడె లేదని శనగారుడు
బియ్యమిచ్చె వుగ్రాణపుదాసరి" [సౌ వ 94]

6 2 1 3 7 పంచములు

అన్నమయ్య తన కీర్తనల్లో మాలవారి ప్రస్తావనచేశాడు మిగిలిన రాయలసీమ పదకవుల్లో వీరి ప్రస్తావన కన్పించదు

"మచ్చరించి అల్లనాడు మాలవాడు కాలదన్ని
తెచ్చిన యప్పటి ధర్మదేవతవు" [11-3-21]

చండాలకులాన్ని పురాణకథతో జోడించిచెప్పడం పై కీర్తనలో గమనించవచ్చు అదే విధంగా

"జాతి చండాలము దీరు జన్మాంతరములను
యేతుల గర్మచండాల మెన్నడూబోదు" [8-130]

వర్ణవ్యవస్థ తాళ్ళపాకకవులు, సారంగపాణి పదాల్లోమాత్రమే కన్పిస్తుంది వీరబ్రహ్మం, దూదేకుల సిద్ధప్ప, తరిగొండ వెంగమాంబ, ఆగంటి వారు, కోటిలింగయ్య మొదలైన వారి పదాల్లో వర్ణవ్యవస్థ ప్రస్తావన కన్పించదు వీరు తాత్త్వికంగా, కులాతీతంగా పదాలు చెప్పడం ఒక కారణం కావచ్చు

6 2 2 వృత్తి వ్యవస్థ

వృత్తి అనే పదానికి నిఘంటువుల్లో జీవనోపాయం, బ్రతుకు, అను దారణ, ఉచ్ఛ్వాసం, ఉజ్జీవనం, కాయనం, జీవనం, జీవం, జీవవృత్తి ప్రవర్తనం, ప్రవృత్తి, వర్తనం అనే అర్థాలున్నాయి చిన తిరుమలా చార్యుడు క్రింది సంకీర్తనలో వివిధ వృత్తులను ప్రస్తావించాడు

"భవరోగ వైద్యుడైన జాలువెజ్జు
సవరని పైడి గక్కినకిన గాడు ॥పల్లవి॥

తల్లి పద్దనోరిలోన తగలోకములు చూపి
వెల్లివిరి నింద్రజాల విద్యవాడు
చెల్లుబడినొక్క కొండ చేతబట్టి యెత్తినాడు
ఒల్లిదుడు వాడివో బారి విద్యవాడు" ॥భవ॥

మునుపె సకల భూతములకు నేలికయై
మునసెల్లా గారగిని మంత్రవాది
చనువున జలధిలో సంప దింద్రునికి జూపె
అనువరి వాడివో అంజనగాడు
పట్టరాని కాళింగుపడిగెల మీదుమెట్టి
పట్టినాడు వాడువో పాములవాడు
అట్టి శ్రీ వేంకటనాథుడమరుల నెల్లను జే
పట్టి దైత్యుల జంపంచే పాళగాడు (16 – అ కీ 22)

రాయలసీమ పదకవుల్లో వృత్తి ప్రస్తావన చాలచోట్ల కన్పిస్తుంది వీరు ప్రస్తావించిన వృత్తులు

1 వ్యవసాయం, 2 వైద్యం, 3 మంగలి, 4 చాకలి, 5 కుమ్మరం, 6 ఉప్పరి అమ్మకం, 7 పూత, పూస, బొమ్మలవని, 8 భిక్షుకవృత్తి

9 తలారులు, 10 దొంగతనం, 11 వేశ్యావృత్తి, 12 ఊరి౦ం పెట్టి / సాకిరి, 13 దివ్వరులు

6 2 2 1 వ్యవసాయం

భారతదేశం ప్రధానంగా నాడూనేడూ వ్యావసాయిక దేశం, అన్నమయ్య, పెద తిరుమలయ్య, సారంగపాణి వ్యవసాయసంబంధమైన ప్రస్తావన చేశారు

అన్నమయ్య

అన్నమయ్య వ్యవసాయానికి సంబంధించి చాలాచోట్ల ప్రస్తావించాడు అన్నమయ్య వంశీయులు వ్యవసాయవృత్తి చేసేవారు అందుకే అన్నమయ్య —

"కాపులము మేము కర్తవు నీవు
దాపుదండై మమ్ము నిట్టె దయ జూడవయ్యా" [9 - 198]

అన్నాడు

అన్నమయ్య వివిధరకాల పొలాల పేర్లు చెప్పాడు
"నిండునట్టి మడుగుల నీరువంక పొలము
కొండలు మోచిన పెద గొబ్బరపు పొలము
అండనే పొలము రాజులుండేటి పొలము
చెండి వేసి మాకులెల్లా సెలగిన పొలము" [10 - 52]

అదే విధంగా వివిధరకాల పంటల్ని చెప్పడం

"నిమ్మపంట చేసినాడు నెట్లన నా కొంగుదాకె
యెమ్మెలు చేతులు జల్లె నేలెయింక" [26 - 264]

అన్నమయ్య "పంటలభాగ్యములు వీరాబాహువ్యవసాయులు [9 - 70]
అనే కీర్తనలో వ్యవసాయంలో పంట వేసే విధానాన్ని వివరించాడు

పెద తిరుమలయ్య

"కాపులము నేము నీకు కర్తవు నీవు మాకు
కాపురంబై ఒదికించి జూడవయ్యా" ॥పల్లవి॥

"పంచేంద్రియపు పొలాల పైరు లెల్లా జేసితిమి
అంచె దేహులకెల్ల ఆజ్ఞలేదవయ్యా" [21-128]

పెదతిరుమలయ్య పై కీర్తనలో ఆధ్యాత్మిక దృష్టితో వ్యవసాయవృత్తి వివరించాడు.

సారంగపాణి

సారంగపాణి తన పద్యాల్లో రకరకాల పంటల్ని ప్రస్తావించాడు

"సన్నబియ్యము తేగివాసి సంబావ్వడ్ల గోనెలంపతే" (సా ప 37)
"రాకేందు ముఖి ము క్కరాగులు ఎసరుకొని" (సా ప 87)

"వంకాయకు వచ్చిన చాలేగదా
టెంకాయకు వచ్చేది ముందర" (సా ప 107)

అదే విధంగా ఆనాటికాలంలో పంటలు విరివిగా పండేవని, నీటిపసతి బాగుగా ఉండేదని క్రిందివద్యాల్లో స్పష్టం చేశాడు

"డపతిరో పూరూర పైరులాయె
కడలేని ధాన్యాల కణజలాయె" (సా ప 33)
"ఏ మళ్ళలో జిక్కె ఇన్ని నంద్రకాయలు" (సా ప 121)
"ఊసిరికాయలు నమిలి పూట నీళ్లుదాగి" (సా ప 121)

6 2 2 2 వైద్యం

మనిషికి ప్రధానంగా ఆరోగ్యం ముఖ్యం అందుకే "ఆరోగ్యం మహాభాగ్యం" అన్నారు

రాయలసీమ పదకవుల్లో అన్నమయ్య, పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య, సారంగపాణి పదాల్లో వైద్యప్రస్తావన కన్పిస్తుంది

అన్నమయ్య

"వేదవేద్యులు వెదకేటి మందు
ఆదినంత్యము లేని మందు" (5-2)
సకల జీవులకెల్ల సంజీవి యీ మందు
వెకలులై యిందరు సేవింపరో యీ మందు (5- 83)

పై కీర్తనల్లో వైద్యంపట్ల ప్రజలకు నమ్మకం కలగడం కన్పిస్తుంది అదే విధంగా—

"ధ్రువుడు గొనిన మందు తొల్లియు బ్రహ్లాదుడు
చవిగా గొనిన మందు చల్లిన మందు
భవరోగములు వీడి పారగ బెద్దలు మున్ను
జవకట్టి కొనిన నిశ్చలమైన మందు" (5-140)

పెద తిరుమలయ్య

"చులకగాని వానికి సఖియైన వైద్యుడు
బలుపైన మందిచ్చి బ్రదికించును" (21-297)

"మహా వెఱ్ఱివాడు వెఱ్ఱిమానమందు తాగొనునా
వహి కెక్కమందిచ్చేటి వైద్యుడు మానవుగాక" (21-347)

ఎటువంటి రోగానికైనా వైద్యుడు మందిచ్చి నయం చేస్తాడనే అభిప్రాయాన్ని పెద తిరుమలయ్య పై కీర్తనల్లో స్పష్టం చేశాడు

చిన తిరుమలయ్య

"భవరోగ వైద్యుడైన ఒలువెజ్జు
నవరని పైడివక్షి సకినగాడు"

సారంగపాణి

"కడప వైద్యునికి నీపై మిదుగ కావలసినదాయె" (సా ప 104)
"పెరటిచెట్టు మందుకు గైకోరని
పెద్దల గ వినవూ యిది ఘనమా" (సా ప 60)

అంతేగాక సారంగపాణి వివిధరకాలైన మందుల్ని, ఔషధాల్ని తన పదాల్లో పేర్కొన్నాడు

రకరకాల మందులు

పల్లవి  ఆవాలు గంటి మాటలతని కలి మధురమాయె నన్నింత
మోడి సేతురా

అనుపల్లవి  రావే యూరక పాద-రసమువలె తిరిగేవు
భావము దెలిసి యిప్పటి కోర్చుటే బాగు ॥ఆవాలు॥

బాలరో పతి మనసు  పాషాణమని దెలిసి
ఏల కులుకులాదిని – ఎంత లేదంటివి
చాలునే శుద్ధమద్ది – సాంబ్రాణివే నీవు
ఆలోబాక్షి నెదిరించి – అతివా సాధింతువా ॥ఆవాలు॥

ఎలనాగ కేసరా – లిచ్చితే నీకేమి
చలపట్టి యిప్పుడు రచ్చల కా కాచుకొన్నావు
పలుమారు వేణుగోపాల – వేరు చేయక
కలసి యుందామనుచు బిలువవే రుజువుగా ॥ఆవా॥
(సా ప 4)

రకరకాల ఔషధాలు '

ప ' వరకన్యా తిలకమీ – వనితపిరు దీని
అ ప, ' వరికించ వేణుగోపాలా నా సామి ॥వర॥

బొలతి నెమ్మోము సం-పూర్ణ చంద్రోదయము
అలకాళిరుచి వినో-దాంజనంజు ||వర||

దాని మృదు మధురోక్తి - ద్రాక్షాదిరస మెంచ
మాలవతి చూపుమ-న్మథ బాణసమము ||వర||

చెలియదాని గుణంబు - చింతామణి స్ఫూర్తి
అలరించు పాట శ్రుతి - కానంద రసము ||వర||

సరసాంగి పొక్కిలివ - సంత కుసుమాకరము
అరయగా చనులు బి-ల్వాది నెరసించు ||వర||

తరుణి సర్వాంగ సుం-దర రసము రతినేలు
కరుణ రాజమృగాంక - కలయుమిక రతిని ||వర||

(సా వ 7)

6 2 2 ఙ మంగలి

మంగలి వారినే నాయీబ్రాహ్మణులని అంటారు అన్నమయ్య, సారంగపాణి వీరి ప్రస్తావన చేశారు

అన్నమయ్య

కాపుటూరి మంగలోజు గడిమీది రాజుకాగా
కాపులెల్లా పనిమాని కందిన యట్లు (11-2-31)

సారంగపాణి

చెంగినా గుజ్జాల అ-చ్చయి వల్ల కేనుగల
జంగమాల్లా బేదే-మంగలోల్లు వాశేదే (సా వ. 146)

నగరంలో తెప్ప తిరునాళ్ళు జరిగేటపుడు మంగలివాళ్ళు మద్దెల వాయించే వారని సారంగపాణి స్పష్టం చేశాడు

6 2 2 4 చాకలి

మానవుడు అనాగరికజాతి నుండి నాగరికజాతిగా స్థిరపడినరోజుల్లో సమకూర్చుకొన్న నిత్యావసర వస్తువుల్లో వస్త్రాలు ప్రధానమైనవి ప్రాచీనకాలంనుండి బట్టలు ఉతకడానికి ప్రత్యేకంగా ఒక వృత్తివాళ్ళు వున్నారు వీరిని వృతిరీత్యా చాకలి వాళ్ళు అంటారు నిఘంటువుల్లో "చాకల" అనే మాటకు చాకి, బట్టలు ఉతికి జీవించేజాతి, చాకలత, చాకిత, రజకి, దూతికల్లో ఒకతి, చాకలది, చాకల స్త్రీ, చాకలి, చాకి, చాకలవాడు రజకుడు అనే అర్థాలున్నాయి

అన్నమయ్య చాకలి ప్రస్తావన చేశాడు—

ఒకచోట ఒక వస్తువు వేసి "మరచిపోయి మరొకచోట వెతికే ప్రయత్నం

"కోకి చాకియింట వేసి కక్కిరాల వెంటబోతే
అకట పురుషార్థ మంటినా జీవుడు" (8-175)

అట్లే చాకలివాడు ప్రవృతిని గూర్చి—

సైకాని బిలువగ వలుకగ వచ్చేవు
చాకలవాడు ముంచవద్దానీవు [?] (27-20)

అనే పాదాలలో వర్ణించాడు

6 2 2 5 కుమ్మరం

కుండలు తయారుచేయడంవల్ల వీరిని కుమ్మరవారంటారు చిన తనంలో పిల్లలు ఆడుకోవడానికి చేసే మట్టిబొమ్మలు, పెళ్ళిళ్ళో అయిరేణి కుండలు అవసరం జాతర్లలో ఊరేగించే గ్రామ దేవతల్నికూడా వీరేచేస్తారు ప్రత్యేకించి తిరుమలలో రోజూ ప్రసాదాలకు కొత్తకుండల్ని వాడడం, ప్రసాదం "పోటు"లో ఇవ్వడం ఈనాటికి ఆనవాయితీ

అన్నమయ్య, పెదతిరుమలయ్య, సారంగపాణి కుమ్మర ప్రస్తావ, చేశారు

అన్నమయ్య

అన్నమయ్య అనేకచోట్ల కుమ్మర ప్రస్తావన చేశాడు
"కుమ్మరదాసుడైన కురువరతి నంబి
యిమ్మన్న వరములెల్ల నిచ్చినాడు" [5-94]

"కుమ్మరవాడు లేకే కుండ దాబుట్టునా
నెమ్మి నీవు పుట్టించక నేనే పుట్టితినా" [2-130]

పెద తిరుమలయ్య

"యెడనై యుండనీ యి చ్చైన యోగీశ్వరుడు
వాడలో కుమ్మరి పురువువలె నెందునంటడు" [21-425]

సారంగపాణి

సారంగపాణి కూడ కుమ్మరి ప్రస్తావన చేశాడు కార్వేటినగరంలో మొదట్లో కుమ్మరివాళ్ళు లేరట కార్వేటినగర ప్రభువు వారిని ప్రత్యేకం రప్పించారని అక్కడి ప్రజల్లో ప్రతీతి ఆ విషయాన్నే సారంగపాణి

"వాడుకొనే వొకటొక పత్ర
వాడకు చేయించ దలంచి
మూడు నెలలాయె గదే
కుమ్మరవాడి వూళ్ళో బంగారాయె" (సా ప 131)

అదే విధంగా

"అమ్మోరంటితల్లి కమ్మ ఉంగరాలు
దెమ్మనిస్తి శీల్లతిమ్ముకాతా

కుమ్మరకు దోట గురుపు ాగు మూడెల్నిచో
చొమ్ముగ సూడాలే చోద్దెం గుండాలే" (సౌ వ 153)

అని స్పష్టం చేశాడు

కుమ్మరవారు చేసేవి కుండలు. ఆనాటి సమాజంలో ప్రజలు వీటిని వాడేవారని సారంగపాణి స్పష్టం చేశాడు.

" తుండుగుడ్డ కట్టి మొద్దుకు
కండె చీరాయె పురిటి
కుండలు తిరిపిమెత్తే తొత్తుకు
వెండి పత్రలాయె" (సౌ వ 93)

" కుండలు గోకింది తలచుకోదట" (సౌ వ, 114)
" కుండలు చట్లన్ని జల్లగడిగి" (సౌ వ 140)

వేదాంతధోరణిలో :

"కలిమి లేములనగ కావటి కుండలు" [సౌ వ 59]

అని అన్నాడు

6 2 2 6 ఉప్పు అమ్మడం

షడ్రసాలలో లవణం ఒకటి రకరకాల ఆహారపదార్థాల్నితయారు చేయడానికి ఉప్పు అవసరం ఆహారపదార్థాల్లో ప్రధానమైనది ఉప్పు. ఈ ఉప్పు [illegible] చేసే వాళ్ళు ఉప్పరవాళ్ళు అంటారు

అన్నమ [illegible]

[illegible]
పూరికే శ్రీవేంకటేశ వోపిక తోడ" (6-39)

"చేరి వుప్పమ్మేనాడు వొకదరా చేరి కూడిన యుద్ధము గాచుకొనె

నట" అనే పాదాలలో ఉప్పు అమ్మేవారు ఒకచోట వస్తువులను భద్ర పరచి ఒండ్లమీదనో, జంతువులమీదనో, బస్తాలు వేయించుకొని వాడ వాడల తిరిగి అమ్మి బతకడం స్పష్టమవుతుంది

సారంగపాణి పదాల్లో ఉప్పమ్మడం

"వగయింత లేక వాని గూడితి
పునూరు వుంటే వుప్పమ్ముకోగల" (సా ప, 58)

అదేవిధంగా వేశ్యలు ఉప్పుపొట్లనుగూడ అమ్మిస్తారని సారంగపాణి వివరించినాడు

"ఉప్పుచట్టి అమ్మించు చెవులు
వుండేది కుదువబెట్టించు " (సా ప 8 )

6 2 2 7 పూత, పూస, బొమ్మలవని

అన్నమయ్య సారంగపాణి సామాన్యంగా మానవుడు చేసి వృత్తులేకాకుండా హస్తకళావిశేషాల్నికూడ ప్రస్తావించారు అన్నమయ్య ప్రతిచిన్నపనిని సూక్ష్మంగా పరిశీలించినాడని క్రిందిపదాలవల్లచెప్పవచ్చు

పూత "చెంబుమీది కనకపు బూత" (7-1)
పూస "అక్కపూస కపురులు" (7-34)

బొమ్మలాట

మానవుని మొట్టమొదటి రూపకం బొమ్మలాట ఇది ప్రాచీనకళా రూపం పండిత పామర జనరంజకమై ఆరుబయట చీరమరుగున ప్రదర్శించేది తోలుబొమ్మలాట

అన్నమయ్య, సారంగపాణి బొమ్మలాటల ప్రస్తావన చేశారు

అన్నమయ్య

"ఆటవారి గూడి తొరా

ఆటకారి గూడి అన్ని చోట్ల బొమ్మ
లాటలాడించ నధికుండ నైతిని" [1-163]

అనే కీర్తనలో బొమ్మలాటలు చూసి ఆనందించేవారే కాని దానం చేసే వారు కాదని అన్నమయ్య స్పష్టం చేశాడు

ఈ బొమ్మలాటల వారు ఊరూరు తిరిగే వారని అన్నమయ్య క్రింది పదాల్లో స్పష్టం చేశాడు

" కోరొ కోరొ యన్నుమలాల బొమ్మలాట వారము
యీరసాన మమ్ము నిచ్చె యేమిసేసేరు
ఊరులేని పొలిమేర వాడలు మోచుకొని నేము
తేరదేహ మెక్కుకొని తిరిగేము" [11-3-7]

సారంగపాణి

" బొమ్మల పెండ్లికి బొమ్మలు వేగ వే
రమ్మన నే సంతోషమ్మున బోవగ" [సా.ప 46]

6 2 2 8 భిక్షుక వృత్తి

భారతదేశం అభివృద్ధి చెందుతున్న దేశం దారిద్ర్యరేఖకు దిగువున వున్నవారు మనదేశంలో ఎక్కువ. కాబట్టి భిక్షుకులు నాటికినేటికి మనకు కన్పిస్తూనే ఉన్నారు

సారంగపాణి

సారంగపాణి పదాల్లో భిక్షుకుల ప్రస్తావన కన్పిస్తుంది

" అక్షయపాత్రకు కొరకే కలదని వోక
భిక్షవేయరయ్యా - మూలల
నిక్షేపము త్రవ్వినెత్తి ని బెట్టదరా
కుక్షింభరులు వేణుగోపాలస్వామి'' [సా ప 193]

నాటి సమాజంలో భిక్షకుల్ని అవహేళనచేసేవారని పై కీర్తనలో సారంగపాణి స్పష్టం చేశాడు

అదే విధంగా భిక్షకులు ఎలా ప్రవర్తించాలి అనే విషయాన్ని క్రింది కీర్తనలో చెప్పాడు

> ఉంఛవృత్తిలో బ్రతికే వారికి
> వుగ్రము కారాదు ॥పల్లవి॥
>
> పంచ సాయకు గన్నవేణుగో
> పాల దేవ యెండన వగలేక ॥అనుపల్లవి॥
>
> అమ్మా! అక్కా! అయ్యా యనవలె
> బొమ్మంటే తలవంచుక పోవలె
> రొమ్మున తంబుర మీటుచు బాడుచు
> రోసము వడక యిల్లిల్లు దిరగవలె ॥ ఉంఛ॥ (సా ప 19½)

6 2 2 9 తలారులు

ప్రాచీన కాలంలో గ్రామస్థాయిలో వీరికి ప్రాధాన్యం ఉండేది ప్రతిపల్లెకు ఒక తోటి, తలార్లు అనేవారు ఉంటారు దొంగతనాలు మొదలైన నేరాలు జరుగకుండా రాత్రులందు వీథుల్లో తిరుగుతూ కావలి కాచేవాళ్లను "తలారులు" అంటారు నిఘంటువుల్లో తలారి అంటే తలవరి, ఆరెకుడు, అరక్షమడు, తలయారి, కావలి కాచేవాడు అనే అర్థాలు ఉన్నాయి స్థలవారః తలారో తలారి, అని సంస్కృత వాక్యం

ముఖ్యంగా వీరి వృత్తి గ్రామ రక్షణ తాళ్లపాక అన్నమయ చిన తిరుమలయ్య వీరిని గూర్చి ప్రస్తావించారు

అన్నమయ్య

> "కాయమనే వూరికి గంతలు తొమ్మిది యాయు
> పొయక తిరుగా డేరు పావపు తలారులు" (1-487)

"తలారులు ముగ్గురు తగువాదులే బైయారు
నొలసి ఆనొజ్ఞ కింపు ఔటేదయ్యా" (9-175)

చిన తిరుమలయ్య

"ఈల గద్ద మూకలోన యించుక కోడిపిల్లకు
మూల మూలలదలారి శములు చెల్లునా' (16-1-33)

6 2 2 10 దొంగతనం :

కళల్లో దొంగతనం ఒకటినై పుణ్యంతో దొంగతనం చేయడం మచ్ఛకటికంలో ప్రస్తావించబడింది ప్రజలు ప్రాణ, మాన, ధనరక్షణ మొదలైన వాటివల్ల దోపులకు భయపడడం నాటికి నేటికి సమానం

రాయలసీమ పదకవుల్లో అన్నమయ్య, సారంగపాణి, పదాల్లో దొంగతనం ప్రస్తావన కని స్తుంది

అన్నమయ్య

భగవంతుని దొంగగా చిత్రీకరించడం భాగవతంలో కన్పిస్తుం అన్నమయ్య కూడా శ్రీకృష్ణుని దొంగగా చిత్రీకరించాడు

"వీడివో యిదె వింత దొంగ
పేడిపాలు వెన్న పెరజిన దొంగ" (1-322)

అతడితడా వెన్నలంతట దొంగియాతాడు
యెతులకు ముద్దులు రెండిలదోనినాడు (10-6)

చొంగిలి మాగుట్టులెల్లా దోచవేసి మరుజారి
భంగపెట్టి తిరిగావో భామలారా" (11-3-37)

అంతే గాక తనకాలం నాటి దొంగతనాన్ని అన్నమయ్య ఎ రించాడు

"అంగడినెవ్వరు నంటఁగదో యీ
దొంగల గూడిన ద్రోహులను" (1-241)

"కోటకూర దొంగలాల కొయ్యలు లాల
కాటుకపు మీ మోహమున నమ్మవెట్టవచ్చునా" (11-3-53)

సారంగపాణి

సారంగపాణి వేణుగోపాలుని దొంగగా క్రింధిపదాల్లో చిత్రీకరించాడు

అ ప "గొంటుకాయై తిరిగే వేణుగోపాలుడలి వేటి కూతురి
"గంటీలు దొంగిలిచి చిత్రగంటి చేమచేరనట
కంచుచీర చంకలో యిరికించుకొని గడియదీసి
కంచి కావల తెల్లవారకదిలెనట కాలికొద్ది" (సా ప 65)

"పొట్ట నిండితె శౌరి పొరుగిండ్ల జొరబడి
పొంచి వెన్న ముచ్చిలునా ఓచెలులార" (సా ఫ 172)

"జారచోరత్వముల — చతురరుడై నావు
ధీరుడై యిల్లిల్లు - దూరివచ్చేవు
వారు కోపించితే - వగలటొయ్యేవు
దూరగావలె నముచు - దుడుకు జేసేవు" (సా వ 198)
కన్నుసైగ జేస గారడము లాడేవు
వెన్న ముచ్చలిదిన్న వేణుగోపాలనే (సా ప 46)
"నారాయణుడనుచు నిన్ను-సారెకు వేడితిగాని
చీరలు దొచిందెరిగితే-చేరనిత్తునా" (సా వ 185)

6 2 2 11 వేశ్యావృత్తి

ఆచారనికి వ్యతిరేకంగా చరించడం వ్యభిచారం లేక వేశ్యావృత్తి

ఆశ్రితుంది మన షుయు మూర్ఖత్వానికి ప్రతీకగా మతం పేరుతో దేవుళ్ల కొరకు సృష్టింపబడిన దేవదాసీ వ్యవస్థ వేశ్యావృత్తి దేవుళ్లకు దేవతలకు అంకితం చేయబడిన కన్నెపిల్లలు దైవసేవలో మునిగి తేలుతూ దేవదాసీలనే పేరుతో పిలువబడినారు కాలక్రమంలో వీరే వేశ్యలుగా మారినారు

మానసికోద్వేగానికి అతీతంగా స్త్రీలు ధనార్జన కోసం చేసే వృత్తిని పడుపువృత్తి అనవచ్చు

తాళ్లపాక పదకవులు, సారంగపాణి ఈ వేశ్యావృత్తిని ప్రస్తావించారు వాటిని మూడు రకాలుగా చెప్పవచ్చు మొదటిది తనకాలం నాటి సామాజిక స్థితిని చెప్పడం

అన్నమయ్య

మేదరింటి లంజబోయి మేదినీకు దుగులగ
గోదిలకు నిటులెల్ల గుల్లినయట్లు (11-2-31)

సారంగపాణి

"లంజవారి తమ్ములకే యివ్వాడు
రాజరీపులన్ని యెందుకు" (సా వ 117)

కులకాంతలు పున్నరనగ వేశ్యల
గూడే దొకరోతా – చీచీ (సా వ 173)

గుత్త లంజలను మరగిన వారికి
దుత్తే కడవటను వరాల [సా.వ 190)

రెండవది ఆనాటి సమాజంలోని ప్రజల మనఃప్రవృత్తిని చెప్పడం

అన్నమయ్య

చేసుకొన్న యిల్లాలు చేరువనే వుండగాను
వె సరక వెలయాలి వెతకినట్లు [6-5]

సారంగపాణి

గుత్త లంజలను మరగిన వారికి
ముత్తె కడవటను వరాల
తిత్తి పుత్తడైన వెనకటోతే
బెత్తమె వేణుగోపాల" (సా వ 190)

కులకాంతలు వుస్సురనగ వేశ్యల
గూడే దాక రోతా – చీచీ" (స్వా వ 173)

మూడవది దేవతలకు కూడా సానివాసం వున్నట్లు చెప్పడం

అన్నమయ్య

కొండవంటి దొరవని కుంచ నీకు వేయగాను
న్నండ గూచుండ మనుచు నానపెట్టేవూ
దండితోడ నూడిగపు దాసెనయ్యే నంటి నీల
చండివోరె నీ దేవుల నోది జేసేవయ్యా" (17 – 504)

పెద తిరుమలయ్య

" వట్టిమంచ మెక్కించక వసల్లుగో గుద్దుమంటా
తొట్టి పాదాలు చాచితే తొడలమీద
అట్టి శ్రీ వేంకటేశుడాసపడి నన్నుగూడె
జట్టిగా ప్రియము చెప్పి చాలునన్నామనడు" [23–391]

చిన తిరుమలయ్య

గోమున నోయని యుంటె గొబ్బున నోయనునవ్వా
కోమలపు వసంతపు కోవిల రీతి
కామించి మమ్మును శ్రీ వేంకటనాథుడు గూడె
దామలలో, బాధ్యులేని ధ్యాయించవే లెను" (16–2–115)

సారంగపాణి

" వారస్త్రీ నీ ప్రక్కలోకి
యూరకే వచ్చునా
తెరకు దాచ్చేనని జూచేవో
వోరా వో వేణుగోపాల" (సా వ 92

" వేణుగోపాలుని గూడేదట
వేశ్యవలెను నీగసు సేయవలెనట" (సా వ 124)

6 2 2 12 ఊడిగం / వెట్టి / సాకిరి

పై మూడింటి అర్థాలు ఒక్కటే ఊడిగం, పరిచర్య, దాస్యం, పరిచారికుడు, సేవకుడు అనే అర్థాలు చెప్పవచ్చు తాళ్ళపాక కవుల్లో వీటి ప్రస్తావన ఉంది

అన్నమయ్య

అన్నమయ్య సంకీర్తనల్లో వీటి ప్రస్తావన చాలాచోట్ల కనబడు తుంది ఊడిగం అనేది శృంగార సంకీర్తనల్లోనే కనబడుతుంది వెటి అనేది ఆధ్యాత్మిక కీర్తనల్లోను, సాకిరి అనేది అధ్యాత్మ, శృంగార సంకీర్తనల్లోను కనబడుతుంది.

ఊడిగం

ఊడిగపు వారినేల వొంటి నానులురేచేవు
వాడు పదిలోలోన తమకించిరతికి (19-317 ]
ఊడిగాలు చేయు చూచి నాగి కొంకి చెలియ
వెడుకతో వోకముడి వీడినంటాను (29-403)
మేరమీరి వూడిగపు వారి మీద నిందగట్టి
గౌరవించి అతనినే కౌగిలించేవు 31-289)

వెట్టి / సాకిరి

చుట్టమైనవాడు తన చోటికి నమ్మికెగాక
వెట్టివాడు సతమౌనా వేగినంతను (8-395)

ఒట్టిన మోపులు మోవరోవక పూరువిడిచి
వెట్టివాడు పారిపోగా వెదకినట్టు (11-2-31)

సాకిరి వయసు సంసారము గోరు
చకురు వాయులు జీడిమాను గోరు (10-107)

బలువుడ వందు మీద వనిగొన నోపుదువు
చలివాసి మమ్మేల సాకిరి వెట్టేవు (15-223)

పెదతిరుమలయ్య

ఊడిగం

"వూడిగము సేసేచెలి వొద్దనగ వచ్చునా" (23-219)

వెట్టి / సాకిరి

"తేరకాడు మోపి మోచి తెచ్చినగరి కొప్పించి
నేరుపుతో వెట్టివాడు నెమ్మది నిద్రించును" (21-424)

"చుట్టమైనవాడు తనచోటికి నమ్మికె గాక
వెట్టివాడు సతమౌనా వేగినంత తాను" (21-446)

"నీకుబోదువాకుటోదు నీవెట్టు సేసినాజేయి
సాకిరి వంటిది నా జవ్వన మిందుకును" (23-388)

చినతిరుమలయ్య

ఊడిగం

"వాయ్యనె నీ వాపెకు వూడిగాలు సేయగాను
నెయ్యపు నాకపుడెంత నెగులాయరా" (16-2-71)

పెట్టి / సాకిరి

"వెట్టి సాకిరి చెప్పేవు విత్తూ దిమ్మిరి వేసి
నెట్టనగరి గోరేమూ నేడు నిన్నును" (16-2-77)

6 2 2 1 3 దిమ్మరులు

వీరు ఆదిమవాని జాతివారు బందిపోటు, దొంగతనం హత్య మొదలైన నేరాలకు పేరుపొందినవారు వీరు సంచార జీవనులు అందుకే వీరిని దేశదిమ్మరులు అంటారు

తాళ్లపాక పదకవులు, సారంగపాణి రచనల్లో దిమ్మరులు ప్రస్తావన కన్పిస్తుంది

అన్నమయ్య

దిమ్మరివలె నిటులం దిరుగదులే
చిమ్ముల వలపు నిప్పైం జిలికించు కృష్ణుడు (3-339)

దిమ్మర మాటలనె యూ పెక్కుల నీ సుద్దివింటే
యెమ్మెల నేమిసేసునో యెరగము సుమ్మీ (31-13)

పెదతిరుమలయ్య 1

"ఎమ్మెకాడవై తిరుగ నింతదొర కేటికి
దిమ్మరి మాటల నాచే దిద్దించుకోవలెనా" (23-80)

చినతిరుమలయ్య

"చిమ్మిరేగె జగడాల జీకటైన మోహము

దిమ్మరి యెడ మాటలడెట వారెరా" [16-7-76]

సారంగపాణి

దిమ్మరివలె యిల్లిల్లు దిరుగ వద్దంటి [సా ప 34]

6 3 సాంస్కృతిక వ్యవస్థ

ఒక వ్యక్తి అభివృద్ధికి చేసే ప్రయత్నాన్ని సంస్కారం అనవచ్చు అదే విధంగా జాతులుగాని, సంఘాలుగాని, భౌతికంగా మానసికంగా ఉచ్చదశ పొందడానికి చేసే ప్రయత్నాన్ని సంస్కృతి అనవచ్చు

సంస్కృతి రెండు రకాలు సౌజన్యం, దాక్షిణ్యం, నిస్వార్థం మొదలైనవి "సంస్కృతి" అనిపించుకుంటే దౌర్జన్యం, నిర్దాక్షిణ్యం, స్వార్థం అనేవి "అసంస్కృతి" సంస్కృతిని కొందరు నాగరికత అని కూడా అంటారు

రాయలసీమ వదకవుల వదాల్లో వ్యక్తమయ్యే సంస్కృతిని రెండురకాలుగా వర్గీకరించవచ్చు

1 జీవన సంస్కృతి

2 కళా సంస్కృతి

6 3 1 జీవన సంస్కృతి

మానవుని జీవితానికి అవసరమయ్యే హంగులన్నీ జీవన సంస్కృతిలో చేరతాయి ఈ దృష్టితో చూచి పుడు గృహోపకరణాలు' వంటకాలు, పండుగలు, ఆచారాలు, నమ్మకాలు ఇంకాలో చేరతాయి

6 3 1 1 గృహోపకరణాలు

మనిషికి ప్రధానంగా తిండి, బట్ట, నీడ అవసరం అవిఋడైన

మానవుడు అభివృద్ధి చెందిన తర్వాత స్థిర నివాసం ఏర్పరచుకున్నాడు స్థిరంగా జీవించడానికి ఇల్లు అవసరం అయ్యింది ఆ తర్వాత ఆ ఇంటికి కావలసిన ఇతర హంగులన్ని అనివార్యమయ్యాయి

పదకవులు సామాన్యుల సంస్కారానికే ప్రయత్నించినవారు అందువల్ల ఆధ్యాత్మ కీర్తనల్లో గాని శృంగార కీర్తనల్లో గాని వారు ప్రజలకందరికి అందుబాటులోవున్న అంశాల్ని ఎత్తిచూపి చెప్పారు అంచేత వారి రచనల్లో ఆయా కాలాలనాటి జనజీవితం ప్రస్ఫుటమవుతుంది

మూకుడు

పూర్వం "మూకుడు" అనే మట్టి పాత్రలో ఆహారం భుజించేవారు ఈ పాత్రను అన్నమయ్య పెదతిరుమలయ్య చినతిరుమలయ్య ప్రస్తావించారు

అన్నమయ్య

"ఏమైన నాడే వారినే మందును
మేము చూచితే చెరువుముయ్య మూకుడున్నదా" (25-275)

పెదతిరుమలయ్య :

నిక్కి అద్దము దోమితే నీడగాన వచ్చుగాక
ముక్కమూకుడు దోమితే మోముగాన వచ్చునా" (21-167)

చినతిరుమలయ్య

"మెచ్చుల వరుసమున మించినట్టి బొంగరాచి
ముచ్చట ఇచ్చాకున మూకుడు మూసి" (15-2-101)

కంచం

భుజించడానికి ఉపయోగించేది కంచం దీన్ని అన్నమయ్య

పెదతిరుమలయ్య, సారంగపాణి ప్రస్తావించారు వీరబ్రహ్మం పదాల్లో వళ్లెం కనిపిస్తుంది.

అన్నమయ్య

గుత్తముగా నెల్లవారు గుడిచేటి కంచము
ఎత్తుకలో బెట్టుకొనె నెవ్వడె దొంగ (12–154)

పెదతిరుమలయ్య

"మంచము మీదట మఱపు నిద్దురలు
కంచము లోపలి కలగూళ్ళు" (21-196)

సారంగపాణి .

"కంచము దీసియమంటే కండ్లెఱ్ఱ జేసుకొనేవు" (సా వ 26)

వీరబ్రహ్మం

అగ్నేయ బిందు అధారవళ్లెము నందు
ఆశామానసవర్తి అపుడే వెలిగించి (కాలజ్ఞాన తత్త్వాలు-24)

మంచం

అన్నమయ్య పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య సారంగపాణి పదాల్లో మంచం ప్రస్తావన చేశారు

అన్నమయ్య :

పయ్యని నీమేని జాజిపువ్వుల చప్పరము
తొయ్యలి నీకొగిలిది తూగు మంచము (12–206)

ాదతిరుమలయ్య

"మంచము మీదట మఱపు నిద్దురలు" [ 21-196 ]

ఒనతిరుమలయ్య

"మచ్చిక తోడుతదాగు మంచపుద సు మీద" (16-2-95)

సారంగపాణి

"మంచము మీద పాదాలు-దించనీకు పదిరూకలు" (సా ప 26

కుండ

కుండలు నీళ్లు ఉంచడానికి, భోజనం తయారు చేసుకోవడానికి, ప్రధానంగా ఉపయోగిస్తారు కుండల్ని అన్నమయ్య, చినతిరుమలయ్య బ్రహ్మంగారు, యాగంటివారు ప్రస్తావించారు

అన్నమయ్య ,

దొంతుల కడవలోన దొరలి దాచిన పెద్ద
పొంత తూటికుండ గొంట బోయె నెవ్వడో (12-154)

చినతిరుమలయ్య ,

యెక్కువ బయ్యెదలోని పేటిపె యింతి-అవి
పక్కన వలపు నింపే పైడి కుండలు (16-2-49)

వీరబ్రహ్మం

నీళ్లకుండల నడుమ నిక్షేపమున్నది-ననబోణులారా
నీళ్లలో మునిగి తన ప్రవేశ్ళనెంచినలేదు-వెలదులారా
(సుజ్ఞానరత్నావళి-8)

యాగంటివారు

కుండలోను బయటలోననూ అంతటాను
నిండివున్న బయలువోలెను [ డి-2494 ]

రాయలసీమ పదకవుల పదాల్లో గృహోపకరణాల ప్రస్తావన చాల చోట్లఉంది ఎక్కువమంది వాగ్గేయకారుల్లో కన్పించేగృహోపకరణాలు

ఉట్లు

ఏదైనా ముఖ్య వస్తువుల్ని దాచుకోవడానికి ఉపయోగించేది ఉట్లు. వీటిని అన్నమయ్య, పెద తిరుమలయ్య, సారంగపాణి ప్రస్తావించారు

అన్నమయ్య

" ఉట్ల మీదటనున్న పాలువెన్న
చట్లతోడనే సాధించి '  (29-331)

పెద తిరుమలయ్య

" వొంటి గోపికల చన్నులుట్లపై కుండలంటా
అంటుచు జేతులు చాచినదే కృష్ణుడు  (23-206)

సారంగపాణి

పాల కడలియందు పవళించి యుండి
బాలుడై యుట్లగ బ్రాకితివి  (సా ప 162)

దీపం

దీపం ప్రస్తావన అన్నమయ్య, సారంగపాణి, యాగంటి వారిలో ఉంది

అన్నమయ్య

" తెలియనట్టి చూపు దీపాలు గలుగగ
కలికి తురుము చీకటి నెరసె"  (27-462)

సారంగపాణి

పాలు నీ కిచ్చేను గూటవీ
పాలు బెట్టే వేళ కైన (సా వ 12)

యాగంటి వారు

" దేహమనియేటి చీకటింటిలో తెగువతో వున్నట్టి దీపము "
(డి-2494

ఇవేగాక రాయలసీమ పదకవులు మరికొన్ని గృహోపకరణాలు తమ తమ పదాల్లో ప్రస్తావించారు

అన్నమయ్య

అటక 7-54, కడవ 4-114, కగు 4-114, గంప 7-260, గొడుగు 25-140, చాప 30-13, చెంబు 10-135 దొంతి 7-113, సిట 3-406 దివ్వె 29-127, బండి 5-119, బాన 12-226, బిందె 5-159, బుడిగి 30-267, ముంత 10-25, రోకలి 10-23, రోలు 4-154, అద్దం 30-218, ఉయ్యాల 27-111, దోమతెర 29-130, నిలువుటద్దం 26-7, పరుపు 27-175 మొదలైనవాటిని అన్నమయ్య ప్రస్తావించాడు

పెద తిరుమలయ్య

చాప 21-90, రోలు-రోకలి 23-145, గంప21-218, నిలువుటద్దం 23-86 మొదలైన వాటిని ప్రస్తావించాడు

చిన తిరుమలయ్య

గంప 16-1-14, గాదె 16-2-70, తూగుమంచం 16-2-95, మొదలైన వాటిని ప్రస్తావించాడు

సారంగపాణి

అటక 57, చలివేంద్ర 148, ఊతచాప 131, కొడవలి 36, కత్తెర 65 మొదలైన వాటిని ప్రస్తావించాడు

6 3 1 2 వంటకాలు

రాయలసీమ వదకవులు వివిధరకాలైన వంట పదార్థాల్ని ప్రస్తావించారు ఆపదార్థాలు తాళ్ళపాకకవుల్లో నైవేద్యరూపాలుగా కన్పిస్తాయి మిగిలిన వారిలో సామాన్య పదార్థాలుగా కన్పిస్తాయి

అంబలి

ఈ పదార్థాల్ని అన్నమయ్య, సారంగపాణి ప్రస్తావించారు

అన్నమయ్య

బొంకపు జూపు లంబళ్లు కారి నవ్వుల వడప్పళ్ళు
అంతెలాయ నేడిట్టె ఆరగించవయ్యా (14-168)

సారంగపాణి

అంబలి దాగేవు నెత్తి వ్రాత నీకు
అన్నము సైచదటే పాత (సా వ 87)

బువ్వ

దీన్ని అన్నమయ్య, పెదతిరుమలయ్య ప్రస్తావించారు

అన్నమయ్య

" కందువ నీమోవి నాకై బువ్వము లాయ
విందువలె చెఱకు నొక్క వేరే యేల" (26-435)

పెద తిరుమలయ్య

" సతి గౌగిలించి వట్టి వవులు నోరి కియ్యగ
రతి బువ్వ మారగించి రమణి మెచ్చె" (23-107)

పులగం '

ఈ పదార్థాన్ని అన్నమయ్య, సారంగపాణి పేర్కొన్నారు

అన్నమయ్య

కలకంటకములు పులుగములు దుగ్ధాన్నములు
పలుదెరగులైన అప్పముల ముగములు (5-80)

సారంగపాణి

" వడతి పులగము మీది - వప్పసామితె అయె " (సా వ 36)

జున్ను

దీన్ని అన్నమయ్య, సారంగపాణి ప్రస్తావించారు

అన్నముయ్య

చొక్కమైన కొప్పెర జున్నులు జున్నులును
చిక్కిన నిడుతురా చిన్నబిడ్డలు (12-196)

సారంగపాణి

పులిజున్ను పుట్టతేనె మొదలుగ
చెలికి నడవలేదా - నీకు (సా వ 29)

చక్కిలాలు

ఈ పదార్థాన్ని అన్నమయ్య, పెద తిరుమలయ్య ప్రస్తావించారు

అన్నమయ్య

చక్కిలాలు సురుగులు జలజలరాలగాను
వుక్కుమీరి కొట్టి గృష్ణుడుల్లాను (28-240)

పెద తిరుమలయ్య

పతులపెద్దకొప్పులు చక్కిలాల గింపటంటూ
బతిమాలి పేడనప్పటి గృష్ణుడు [23-206]

పానకం

దీన్ని అన్నమయ్య, పెద తిరుమలయ్య, సారంగపాణి ప్రస్తా వించారు

అన్నమయ్య

తడయక అధరామృత పానకము నేడు
యడనెడ మారుకు మార్చితివి నీవు (24-109)

పెద తిరుమలయ్య

" పానకాలు శిఖరుల పటికంపు గొప్పెరల
పూని వాసనలుగాగ పువ్వు గట్టించి " (23-316)

సారంగపాణి

మోవిపానక మిచ్చునా కొసరికొసరి
ముద్దులాడ నిచ్చునా [సా ప 33]

పై చెప్పిన వంటలేగాక రాయలసీమపదకవులు వివిధరకాలై నవంటకాల్ని ప్రస్తావించారు

అన్నమయ్య :

అటుకులు 6-27, అట్లు 29-331, అప్పాలు 12-197, అన్నం 30-119, ఇడ్లీ 9-10, ఊరగాయ 5-80, కారాలు 14-66, కుడుములు 12-14, కూర 2-165, చక్కెర 27-117, వారవప్పు 5-159 దధ్యన్నము 30-119, నాన బియ్యము 5-159, పచ్చళ్లు 14-166

పొంగలిం ౦ 8-320, పాలు 21-100, పెరుగు 30-165, బూరెలు 17-38, బెల్లము 5-80 రొట్టెలు 30-137, వడపప్పు 10 27 మొ॥నవి

పెద తిరుమలయ్య

వెన్న 21-40, చల్ల 23-10, పులుసు 23-54, కూరలు 3-316 అన్నం 21-46 మొదలైనవి

చిన తిరుమలయ్య

పాలు 16-1 6, గుగ్గిళ్ళు 16-1-33, తోటకూర 16-1-53 గుజ్జనగూడు 16-2-101, కూరలు 16-2-101 మొదలైనవి

సారంగపాణి

వెన్న 46, పొంగలి 58, పంచదార 65, గంజి 83, అన్నం 87, కలిచారు 129, రాగినంకటి 135 మొదలైనవి

యాగంటివారు పెరుగు 2194 ను ప్రస్తావించారు

6 3 1 3 పండుగలు

పండుగలు మానవజాతి జీవనంలో చైతన్య విలాసాలు అనుభవ విశేషాలు ప్రకృతి పరిణామసూచికలు మతానికి పట్టుగొమ్మలు అవి మన సంస్కృతికి సర్వస్వామి సంపాదాయ పోషకాలు

పండుగలు కుటుంబములోని కష్టాల్ని మరచి నూతనోత్సాహాన్ని కలుగజేస్తాయి. పరస్పరం కలుసుకొనేందుకు అవకాశం కలుగజేసాయి ఆధ్యాత్మికచింతనను, సోదర ప్రేమ పట్ల సౌహార్దభావాన్ని ఇవి పెంపొందిస్తాయి

వైష్ణవమత సంబంధమైన కొన్ని పండుగల్ని అన్నమయ్య, పెద తిరుమలయ్య సారంగపాణి తమ పదాల్లో ప్రస్తావించారు

1 శ్రీకృష్ణ జయంతి / శ్రావణ బహుళాష్టమి

రామకృష్ణావతారాలు మహావిష్ణువు సంపూర్ణ అవతారాలు శ్రీకృష్ణుని జన్మదినోత్సవం శ్రావణబహుళాష్టమి రోజున జరుపుకొంటారు. అష్టమినాడు రోహిణీ నక్షత్రంలో రాత్రి జన్మించాడు అందుచేత అష్టమి నాడు పగలంతా ఉపవాసం చేసి సాయంకాలం కృష్ణ విగ్రహం ఊరేగించడం, పూజించడం, ఉయ్యాలలు కట్టి ఆడించడం వంటివి జరుగుతాయి.

ఈ పండుగను తాళ్లపాక కవులు ప్రస్తావించారు.

అన్నమయ్య

భూమిలోన గొల్లలాయలు బుత్రోత్సవ మిదివో
నేమపు కృష్ణ జయంతి నేడే యిమ్మా (8-17)

అదే విధంగా

"ఆది కాలమున గృష్ణుడవతరించిన యట్టి
ఆదట శ్రావణ బహుళాష్ట మాయను" (8-181)

పెదతిరుమలయ్య

అవతారమందె నిదె అర్ధమ రేతిరికాడ
బవహరుడు శ్రావణ బహుళాష్టమిని (23-144)

చినతిరుమలయ్య

నడురేయి రోహిణి నక్షత్రమున బుట్టి
వడిగృష్ణుడిదివో దేవతలందు (16-1-32)

అదే విధంగా కృష్ణజయంతి సందర్భంలో బాలకృష్ణుని లీలల్ని చినతిరుమలయ్య క్రింది కీర్తనలో వర్ణించాడు

"బ్రహ్మగన్న వాడు పసిబిడ్డ

బ్రహ్మమైనవాడు వసిబిడ్డ
"వగపు లేక చంపవచ్చిన బూతకి
పగసాధించిన వాడు వసిబిడ్డ
వగుల దన్నినవాడు వసిబిడ్డా" (16-1-11)

నోములు / వ్రతాలు

కొందరు నోముల్ని, వ్రతాల్ని, పండుగలుగా జరుపు కొంటారు పీటిని అన్నమయ్య, సారంగపాణి ప్రస్తావించారు.

అన్నమయ్య

ఎంతనోము నోచెనో
వంతుల నీకర పల్లవములు ముంచె" (30-535)

"ఏలిమితో దిరువేంకటేశు కౌగిటగూడి
లలితాంగి నిచ్చ కల్యాణంబునోమె" (12-127)

సారంగపాణి

"నీకు మే మంచి నోము నోచితె
నీకెదయరాదా యిక మీద" (సా వ 60)
అలయించిన నాదాయ మెంతనే
వలచి పేలునాకి వ్రతము జెరుచుకొంటినే (సా వ 50)

ఇవేగాక మరికొన్ని పండుగల్ని అన్నమయ్య సారంగపాణి పేర్కొన్నారు

అన్నమయ్య

శ్రీ జయంతి (10-27), నారసింహ జయంతి (11-1-14), విజయదశమి (9-183), లక్ష్మీదేవి పండుగ (17-184), ఉగాది (29-450) దీపావళి (17-184) మొదలైనవి

సారంగపాణి

అగ్ని తిరునాళ్లు (152), తెప్పతిరునాళ్లు (146) గౌరీపూజ మొదలైన వాటిని ప్రస్తావించాడు

8 3 1 1 ఆచారాలు

ఆదరింపబడేది ఆచారం ఇది కుల, సామాజిక దేశాల్ని బట్టి మారుతూ ఉంటుంది సమాజంలోని సదస్యులు ఆచరించే పనుల్ని ఆచారాలంటారు ఆచారం, అనాచారం, సదాచారం, డంభాచారం, మూఢా చారం అనే పదాల్ని వేర్వేరు సమయాల్లో వాడుతారు

తాళ్లపాక కవులు ఈ ఆచారం అనే పదాన్ని వాడినట్లు కన్పిస్తుంది

అన్నమయ్య

"వట్టి యాచారాల బోగావడినాకు సిగ్గువచ్చె
యెట్టైనా నీకు జెల్లు నేలయ్య" (31-240)

పెదతిరుమలయ్య

"ఏసతి బొందవలసోయిదొక నెవము వేసి
రాసి కెక్క వట్టి యాచారాలు సేసేపూ" (23-140)

చినతిరుమలయ్య

"ఎటువంటి దొరవైతి వేమయ్య నీవు
అటమటముల నీకు నాచారమేది" [16-291]

అంతేగాక అన్నమయ్య, మతాచారాలను గూడ తమ కీర్తనలో ప్రస్తావించాడు మచ్చుకు-

"షోడశ కళ నిధికి షోడశోపచారములు

జడతోడ నిచ్చలుమ నపి.ర్వయామి" (1 134)

6 3 5. నమ్మకాలు

ఆదిమకాలంనుండి ఆధునిక నాగరిక కాలం దాకా ఈ నమ్మకాలు జీవన గమనంలో అనివార్యమైన అంశాలు

నాగరిక ప్రపంచంలో కూడ నమ్మకాలకు కొరతలేదు ముహూర్తం శకునం, మొదలైన వాటికి సంబంధించిన నమ్మకాలు ఇంకా కొనసాగు తూనే ఉన్నాయి యజ్ఞయాగాదులు జాతరలు వ్రతాలు మొదలైనవి ధార్మికమైన నమ్మకాలు అన్నమయ్య సారంగపాణి తమ రచనల్లో అనేక రకాలైన నమ్మకాలను ప్రస్తావించారు

శకునాలు :

శకునాల ప్రస్తావన అన్నమయ్య, సారంగపాణి చేశారు

అన్నమయ్య

మందులో మంత్రాలో నీకు మరి వంపు చేసుకొనే
సందడి నీ పెండ్లాడిన సగినాలు మంచవే (31 64)

సారంగపాణి

యెన్ని శకునములో జూడవంటి
యెమ్మెకా డిటకు రానండన సా వ 73)

ఎపుడు వత్తువని యెదురే జూచుచు
యెవరు వచ్చినా శకునములడుగుచు (సా వ 74)

అంతేగాక అన్నమయ్య మరికొన్ని నమ్మకాలను ప్రస్తావించాడు నొసటి వ్రాతను నమ్మడం (1 419) భూతవిశ్వాసం [1-109] బాలలకు సంబంధిచిన నమ్మకం (12-247) మొదలైన వాటిని ప్రస్తావించాడు

6 3 2 కళాసంస్కృతి

కళలు 64 అని ప్రసిద్ధి నిశానికి కళలు అపరిమితాలు కళల్లో చాలా దశలున్నాయి కళ అనేది మానవుని సృజనాత్మకశక్తికి ప్రతిబింబం మనిషి జీవితం పరిపూర్ణం కావడానికి కళ దోహదపడుతుంది సౌందర్యం, ప్రయోజనం అనేవి కళ ధర్మాలుగా చెప్పవచ్చు

రాయలసీమ పదకవుల పదాల్లో కళాసంస్కృతికి సంబంధించిన ప్రస్తావన కన్పిస్తుంది

అన్నమయ్య "కళ" అనే పదాన్ని పలుచోట్ల ఉపయోగించాడు.

" కమ్ముకొన్న నీ మోము కళలు దీవారగాను " (31-69)

చెక్కుల కళలు మించె చేతులజెమట నిండె (31-286)

" చూపుల గళలు నిండె సురతము వంటవండె

వోపిక నిన్నాపె నోరూరించెనయ్యా" (29-222)

కళా సంస్కృతిలో వాస్తు సంస్కృతి, ఆభరణాలు, అలంకరణలు, ఆయుధాలు, వాయిద్యాలు మొదలైనవి చేరుతాయి

6 3 2 1 వాస్తు సంస్కృతి

వాస్తు అనే శబ్దం "వస" (నివాసం) అనే ధాతువు నుండి పుట్టింది గృహం కట్టడాగకి తీసుకొనబడిన స్థలాన్నికూడ వాస్తువంటారు వాస్తు శాస్త్రం అంటే గ్రామనగరదేవాలయం మొదలైన వాటినిర్మాణలక్షణాల్ని తెలిపే శాస్త్రం

రాయలసీమ పదకవుల్లో తాళ్ళపాక పదకవుల, సారంగపాణి పదాల్లో వాస్తు శాస్త్రానికి సంబంధించిన కొన్ని విశేషాలు కన్పిస్తాయి.

ఇల్లు

ఇంటిని అన్నమయ్య, సారంగపాణి పేర్కొన్నారు

అన్నమయ్య

" మా యింటికి రావోయి మాధవా
మాయలెల్ల గంటి మిదే మాధవా " (2-245)

సారంగపాణి

" ఇంటిదోవ తొంగి చూడడాయె
సొంట్లు వెదుకుటాయె " (సా వ 54)

తలవాకిలి

తలవాకిలిని అన్నమయ్య, పెద తిరుమలయ్యలు పేర్కొన్నారు

అన్నమయ్య :

" తెలిగన్నుల చూపు దీని చేతలనె పో
తలవాకిటికి దెచ్చె దరుణి ప్రాణములు " (4-133)

పెద తిరుమలయ్య

" తప్పక చూచుకొంటా తలవాకిటి దిక్కు
చెప్పి పంపినాతనికి చెప్పరాని మాటలు " (23-476)

గోడలు :

గోడలకు సంబంధించిన ప్రస్తావన అన్నమయ్య, సారంగపాణి పదాల్లో కన్పిస్తుంది

అన్నమయ్య

గోటగడుగ వచ్చునా కొనరగనికనేల
కూడిన తన సతుల గుంపులలోని దానను (13-228)

సారంగపాణి

గొప్పవారి కడుపున బుట్టిందట
గోడలు బుట్టాక నిక్కి చూచునట (సా వ 130)

వీధి

అన్నమయ్య, సారంగపాణి "వీధి" ప్రస్తావన చేశారు

అన్నమయ్య

గరుడవాహనుడు కనక రథము పై
యిరవుగ వీథుల నేగిని [10-260]

సారంగపాణి

" పిలువబోకు నాలుబోల్లి మాటలు
చెలియ మీ వీధికి యొక దండము " (సా.వ 12)

6 3 2 2 ఆభరణాలు :

రాయలసీమ పదకవులు తమ పదాల్లో కొన్ని ఆభరణాల్ని ప్రస్తా వించారు

ఉంగరం

ఇది అన్నమయ్య, పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య, సారంగపాణి పదాల్లో కన్పిస్తుంది.

అన్నమయ్య

"వేలమున్న వుంగరము వేడుకలు రేచగాను " (30-221)

పెద తిరుమలయ్య :

కాలిపైగాలు వేసి కడుమువ్వరక నొరగి
వేలి వుంగరాలు చూపి వేసాలబీడు " 1-179]

చినతిరుమలయ్య

"ముద్దియ వేలనె ముందర నుండేటి ముద్దురవుంగరము

సారంగపాణి

కట్టుకొంగున మూట - గట్టుకోవె యని యు
క్కట్టు గూడిరా - కట్టు వుంగరమిచ్చి (సా ప 14)

గాజులు

అన్నమయ్య, పెద తిరుమలయ్య, సారంగపాణి వీటి ప్రస్తావన చేశారు

అన్నమయ్య

కంకణాల గాజుల చేయి ఘనుని నందిటి జిక్కె.
అంకపు సాముల చేయి ఆకె పంది జిక్కెను 6-309)

పెదతిరుమలయ్య

"ఘన మాణిక్యము మాని గా జులూన గట్టుకొని" (21-120)

సారంగపాణి

నన్నాదనే నిట్టూరాలాడితే గాజుల
తిప్పిశెట్టి పిలువగానే (సా ప 100)

అంతేగాక మరికొన్ని ఆభరణాలను తాళ్ళపాక పదకవులు, సారంగపాణి ప్రస్తావించారు

అన్నమయ్య

అందెలు 2-24, కంకణం 12-158, కిరీటం 5-73, కుండలాలు 6-207, కుప్పెలు 12-103, గజ్జలు 12-218, చెవిపోగులు 27-353,

పగడాలు 9-288, పచ్చలు 12-208, మంగళసూత్రం 26-121 మాణిక్యాలు 28-79, ముత్యాలు 12-121, రత్నాలు 3-276, వజ్రాల కమ్మలు 3-523, హారం26-121, వైడూర్యం 9-223

పెద తిరుమలయ్య

వజ్రాలకమ్మ 23-83, వజ్రాలు 21-167, రత్నాలు 21-151, ముత్యాలు 21-285 మొదలైనవి

చిన తిరుమలయ్య

రత్నాలు 16-1-15, కుల్లాయలు 16-1-33, బొగులు 16-2-96, మొదలైనవి.

సారంగపాణి

సారంగపాణి అనేకరకాలైన ఆభరణాల్ని క్రిందిపదంలో పేర్కొన్నాడు

పల్లవి కంకణము గట్టినాడు-గడవే నా మీద సుంత

అనుపల్లవి కొంకు కొసరు లేక వేణుగోపాలుడే వేళనాపై ॥కంక॥
కమ్మలు దానికి వ్రాయి-కారణమేమన్నందుకు
సమ్మతి గాకుంటే బోచీ-బొమ్మైని నిరాకరించి ॥కంక॥
(సా వ 8)

అంతేగాక పతకం 2 కమ్మ, 6, మెట్టెలు 3-7 ముక్కర 71, గజలు 81 నత్తు 90 మొదలైన వాటిని ప్రస్తావించాడు

6 3 2 3 అలంకరణములు

"అలంకార ప్రియో విష్ణుః" అని హిందువులు విశ్వసిస్తారు అలంకరణ మానవుని సహజలక్షణం కూడ తన అవసరానికుపయోగించే

వస్తువుల్ని మనస్సుకు నచ్చే విధంగా చేసుకోవడం అలంకరణ. అలంకరణ మనిషి హృదయాన్ని రంజింపజేస్తుంది ఆహ్లాదాన్ని ఇస్తుంది కూడ

రాయలసీమపదకవులు వివిధరకాలైన అలంకారాలను ప్రస్తావించారు

చీర

ఇది ఆడవాళ్ళు కట్టుకొనే బట్ట చీరను అన్నమయ్య, పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య, సారంగపాణి ప్రస్తావించారు

అన్నమయ్య

" చీరవెలిగా నవ్వేవు సిగ్గువిడిచేవు " (4-128)

చెలిగట్టిన చెంగావి చీర కొంగుగాన వచ్చి
మలసి నీ పచ్చడము మాటునను (30-540)

పెదతిరుమలయ్య

దువ్వటపు చీర యిది తొల్లే కడునునుపు
పువ్వువలె జారి నిట్టె పోపో విడవోయి [23-120]

చిన తిరుమలయ్య '

"చెలియ మునుపు ంగారించుకొన్న చెంగావి చీర యిది"
(16-2-57)

సారంగపాణి

"పట్టు చీరకు పళ్ళి-పట్టు వరహాలయిదు" [సా వ 14]

కొప్పు

కొప్పును అన్నమయ్య, పెద తిరుమలయ్య, చిన తిరుమలయ్య సారంగపాణి తమ పద ల్లో పేర్కొన్నారు

అన్నమయ్య

చేసినదే చేతా చెల్లుబడిగల చోట
సేస కొప్పు విభుడ నీ చిత్తమింతే (30-174)

పెద తిరుమలయ్య

"కొనచూపు దెలుపైన కొప్పు గడునలపాయ" (23-544)

చినతిరుమలయ్య .

"కురులు నలగిన నీ కొప్పు చూచి వెరగయ్యా" (16-2-86)

సారంగపాణి :

"నెలత కొప్పు నిండా యిక" (సా ప 60)

పీతాంబరం

తాళ్లపాక కవులు, సారంగపాణి పీతాంబరం ప్రస్తావన చేశారు

అన్నమయ్య ,

"నిరతి హేమ వర్ణాకె నీవు పీతాంబరుడవు" [26-201]

పెద తిరుమలయ్య

"రంగుమిద పీతాంబరము మొలగట్టుకొని" (21-185)

చిన తిరుమలయ్య

"పీతాంబరము చెల్లపిల్ల రాయడా" [16-2-80]

సారంగపాణి

"అరసి పీతాంబర-ధరుడనుకొందురే" [సా ప 9]

దోవతి

పెద తిరుమలయ్య, సారంగపాణి దోవతి ప్రస్తావన చేశారు

పెద తిరుమలయ్య

దోవతి నూర్పులు నించి తలగగ గొగిట జేర్చి [23-390]

సారంగపాణి

"ధోవతి ఒరవై తోచకముసుపి" (సా వ 167)
అంతేగాక తాళ్ళపాక కవులు, సారంగపాణి మరికొన్ని అలంకారాలను ప్రస్తావించారు

నెమలిపింఛం 29-148, వందిలి 26-579, పచ్చతోరణం 11 3 53, పూలదండలు 26-325 ముగ్గులు 30-16, సవరం 12-2 మొదలైనవి

చిన తిరుమలయ్య

కుంకుమ 16-2-4 సవరం 16 2-40, దట్టి 16-2-57 తిలకం 16-2-117 మొదలైనవి

సారంగపాణి

తిలకం 84, శాలువ 90, పావడ 102, తంబళి 104 మొదలైనవి

6 3 2 4 వాయిద్యాలు :

రాయలసీమ పదకవుల్లో వివిధరకాలైన వాయిద్యాలు కనిపిస్తాయి

కిన్నెర

కిన్నెర వాయిద్యం అన్నమయ్య, పెద తిరుమలయ్య, సారంగపాణి పద్యాల్లో కన్పిస్తుంది

అన్నమయ్య

గక్కన కిన్నెరకాయ గూండ్ల

దొక్కపట్టి తంత్రులు మీటిని (30-63)

పెద తిరుమలయ్య

" కిన్నెర మీటిన మలికి కిమ్ముల సూరకె పలికి
వన్నెల నాతనికో కళకళ మిది గాబోలు (23-390)

సారంగపాణి

" తందాన పదాలు బహు మెండాయె
తగినట్లే కిన్నెర వశటాయె" (సా వ 127)

దుందుభి

అన్నమయ్య, వీరబ్రహ్మం దుందుభి ప్రస్తావన చేశారు

అన్నమయ్య

దేవదుందుభులు నలుదిక్కులందు
తావులనే వేవేలు ధ్వనులియ్యగాను (30-30)

వీరబ్రహ్మం

" నందీశ దుందుభులు నట రేగి కూయ
పుష్ప వర్షము గురియ పురహర ప్రియుని "
(కాలజ్ఞాన తత్త్వములు - 8)

వీణ

అన్నమయ్య, సారంగపాణి తమ పదాల్లో వీణను పేర్కొన్నారు

అన్నమయ్య

మచ్చిన నీవు సేసితే మాటలాడ నేరుచు

ఇచ్చగించితే పీణవాయించనేగుచు (29-303)

సారంగపాణి

"వీణెలు మీటుచు-ఒకరికొకరు
జాణతనము లాడుచును" (సా ప 31)

పిల్లన గ్రోవి

తాళ్లపాక కవులు పిల్లనగ్రోవి ప్రస్తావన చేశారు

అన్నమయ్య

'పిల్లగ్రోవి రవములు చెరయించగా నేనదే
గొల్లెతల మట్టెలకు గుండెమతి" (10-114)

పెదతిరుమలయ్య

పూచిన మాని కింద బోటి పెట్టుక తానుండే
యేచి పిల్లంగోవి యూదీ యేటికి వీడు (21-179)

చిన తిరుమలయ్య

చల్లనైన గాలిచేత జాతిరేచె వలపు
పిల్లగోవి వట్టవాడు పెచ్చురేచేని [16-2-44]

అదే విధంగా అన్నమయ్య గంట (12-3), తాళాలు (30-63) తుత్తురుకొమ్ము (12-96), భేరులు (8-194), శంఖం (27-4-88) మొదలైన వాటిని ప్రస్తావించాడు

చినతిరుమలయ్య శంఖాన్ని (16-1-32) ప్రస్తావించాడు. సారంగపాణి మద్దెల (89), తంబుర (1), ప్రస్తావన చేశారు. వీరబ్రహ్మం నాదస్వరం [సుజ్ఞాన రత్నావళి-18]మృదంగం

(కాలజ్ఞానతత్త్వాలు 21) ప్రస్తావన చేశాడు.

6 3 3 పరిశిష్టం

ఈ విభాగంలో ఆటలు, వనసంపద, జంతుజాలం, సంతలు, ఆయుధాలు మొదలైనవి చేరుతాయి

6 3 3 1 ఆటలు

మనిషికి జీవితావసరాల్లో వినోదం కూడ ఒకటి ఆవినోదాల్లో ఆటలు ఒకటి

రాయలసీమ పదకవుల్లో తాళ్లపాక కవులు, సారంగపాణి ప్రస్తావించారు

అన్నమయ్య

ఇసుకగల్లాట 2-37, ఏలాట 29-36, కోలాటం 25-349 గడారు 2-294, గుజ్జనగూళ్లు 26-45, గవిసి ఆట 8-179 చక్రపు బిల్లాట 3-114 చదరంగం 3- 39, జూదం 26-20 పిల్లదీపు ఆ 8-179, పుట్టచెండ్లు 14-149, బిల్లగొట్లాట 9_31, బొమ్మరింట్లాట 5-270, వామనగుంటలాట 27-45 శింపాలాట 12-24 స్తంభాలాట 3-114, సిరిసింగన్నవత్తి 10-172 మొదలైనవి

పెదతిరుమలయ్య :

వామనసేంట, బొంగరాలాట, చక్రపుబిల్లాట, కంబాలాట అప్పాలాట, ఆలిమగలాట 23-173, చదరంగం 23_198 బొమ్మలాట 21-59 మొదలైన వాటిని ప్రస్తావించాడు

చినతిరుమలయ్య

గుజ్జనగూడు (16 2-101)

సౌరంగపాణి

చదరంగం (111)

6332 వనసంపద

రాయలసీమ పదకవుల్లో వనసంపద ప్రస్తావన కన్పిస్తుంది ఈ విభాగంలో చెట్లు, పూలు, కాయలు, పండ్లు చేరుతాయి

చెట్లు

రాయలసీమ పదకవులు రకరకాలైన చెట్లను ప్రస్తావించారు మచ్చుకు-

అన్నమయ్య

రావిమాను 6-105, తాటిమాను 7-34, వేపమాను 8-71, మర్రిమాను 11-1-47, పున్నాగతరువు 12-177 అంపలి చెట్టు 15-66, అంటుడచ్చలి 18-243 పెల్లిచెట్టు 25-435 మద్దులు, ఘారేట్లు 26-2-233 మొదలైనవి

పెదతిరుమలయ్య

వేప 21-440, రావి 21-172, తాటి 21-3 మొదలైనవి

యాగంటివారు

చింతమాను డి-2489, జెటచెట్టు డి-2489

పువ్వులు

రాయలసీమ పదకవుల్లో రకరకాలైన పువ్వులను మనం గమనించవచ్చు మచ్చుకు-

అన్నమయ్య

తమ్మిపూవు 3-118, తిలపుష్పం 8-47, కలువ, కపి లం పం పెంగ, జాజులు, దొంతర, మల్లె మొగ్గలు, మంకెన పుష్పం 12-59' గొజ్జగపూవు 13-426, బొగడపూవు 12-368, కెందామర 12-176, దరిశనపువ్వు 12 367 మొగలి 13-273, సురపొన్న 13-169 మొదలైనవి

పెదతిరుమలయ్య

మల్లెలు, మొల్లలు, కలువలు, సంపెంగ 21-200 తమ్మిపూవు 23-177 దొంతర పైడి పువ్వులు 23-412 మొదలైనవి

చిన తిరుమలయ్య

మొల్ల 16-2-84, చెంగలువ 16-2-92, కుంకుమపూవు 16-2-96, మల్లెలు 16-2-100, చేమంతి 16-2-101 మొగిలి 16 2 103 తామర 16 2-103, నల్లగలువ 16-2-105 మొదలైనవి

సారంగపాణి

లువ 37, గన్నేరు 46, విరజాజి 61, మల్లెపూలు 120 మొదలైనవి

వీరబ్రహ్మం

కమలం (సుజ్ఞానరత్నావళి-2, చేమంతి, చెంగల్వ (సుజ్ఞాన రత్నావళి8,) నాగమల్లె (కాలజ్ఞాన తత్త్వాలు-1) మొదలైనవి

యాగంటివారు

తమ్మి డి-2491, కమలం డి-2487 కలువలు డి-2494 మొదలైనవి

కాయలు

రాయలసీమ పదకవుల పదాల్లో వివిధ రకాలైన కాయలున్నాయి మచ్చుకు-

అన్నమయ్య

బీరకాయ 9-24, నేతిబీరకాయ 7-260, వెలంకాయ 13-596, గుమ్మడికాయ 25-407, బోకకాయ 13-391 కలబెరికాయ 13-298 టెంకాయ 15-177, పువ్వుకాయ 14-131 కాకర 27 468, చింతకాయ 27-125 మొదలైనవి

పెదతిరుమలయ్య

గచ్చకాయ 12-425, ఉమ్మెత్త కాయ 21-171

సారంగపాణి

వంకాయ, టెంకాయ 107, ఉసరికాయ 121

యాగంటిగారు

గచ్చకాయ డి 2487, పేవకాయ డి-2194 ఉమ్మెత్త కాయు డి-2491, మేడికాయ డి-2489

పండ్లు ।

రాయలసీమ పదకవులు అనేక రకాలైన పండ్లను ప్రస్తావించారు

అన్నమయ్య

పాలపండు, అరటిపండు చింతపండు, దొండపండు, నేరేడు పండు, గురివిందపండు, ఈతపండు, మామిడిపండు, దేవదారు పండ్లు, 13-284, జీడిపండు 27 427 మేడిపండు 28-25

చినతిరుమలయ్య

మేడివందు 16 2-19, నిమ్మవందు 16 2-22 దొండపండు మొదలైనవి.

సారంగపాణి

మామిడి పండు 161

ధ్దప్ప

మామిడి [సుజ్ఞానరత్నావళి 38]

యాగంటివారు

దొండపండు ఓ 2494

తరిగొండ వెంగమాంబ

మేడిపండు (సుజ్ఞాన రత్నావళి-82)

పై పరిశీలన వల్ల తేలిన అంశాలు

గుంటుపల్లి కోటిలింగయ్య పదాల్లో వనసంపద ప్రస్తావన కన్పించదు

అన్నమయ్య, పెదతిరుమలయ్య, యాగంటివారి పదాల్లో మాత్రమే చెట్ల ప్రస్తావన కన్పిస్తుంది

అన్నమయ్య, పెదతిరుమలయ్య, చినతిరుమలయ్య సారంగపాణి వీరబ్రహ్మం, యాగంటివారు పుష్పాల ప్రస్తావన చేశారు కలువ, కమలం మొదలైన పుష్పాలు అందరిలోను కన్పిస్తాయి

అన్నమయ్య, పెదతిరుమలయ్య, సారంగపాణి, యాగంటివారు

రకరకాలైన కాయుల ప్రస్తావన ఫేశారు గచ్ఛకాయ ఉమ్మెత్తకాయ పెదతిరుమలయ్య, యాగంటివారి పదాల్లో మాత్రమే కన్పిస్తుంది అన్నమయ్య పదాల్లో రకరకాలైన కాయలు ప్రవన కన్పిస్తుంది

అన్నమయ్య చినతిరుమలయ్య, సారంగపాణి, సిద్ధప్ప యాగంటి వారు, వెంగమాంబ పదాల్లో పండ్ల ప్రస్తావన కన్పిస్తుంది

తాళ్లపాక కవులు, సారంగపాణి వనసంపదను శృంగార అధ్యాత్మిక దృష్టితో ప్రస్తావించగా వీరబ్రహ్మం, సిద్ధప్ప, యాగంటివారు, వెంగమాంబ తాత్త్విక దృష్టితో ప్రస్తావించారు,

6 8 3 8 జంతుజాలం

రాయలసీమ పదకవుల రచనల్లో జంతుజాల ప్రస్తావన కన్పిస్తుంది జంతుజాలాన్ని నాలుగు రకాలుగా వర్గీకరించవచ్చు 1) భూచరాలు, 2) ఖేచరాలు 3) వనచరాలు 4) జలచరాలు

భు చరాలు

భూమి మీద నివసించేవి భూచరాలు

అన్నమయ్య

దూడ 2-197 ఎద్దు 2-291, తేలు 5-190, కుక్క 5-190 మేక 5-19 గుఱ్ఱం 7-110 చీమ 9-179 ఎలుక (11-3-108, కోడి 16-33, పాము 22-4/5, పొట్టేలు 18-237 మొదలైనవి

పెదతిరుమలయ్య

ఆవులు 21-74, మేక గొఱ్ఱులు 21-4 సర్పం 21-61, కుక్క 21-135, గుఱ్ఱం 21-137, చీమ 21-420 కోడి 21-210, కోడె 23-260

చినతిరుమలయ్య

గుఱ్ఱం 16-1-17 గాడిదపిల్ల 16-1-60, కోడి 16-1-32

సారంగపాణి

చిలుక 38, ఎద్దు 1'0, గుఱ్ఱాలు 146, కోడి 79, ఆవులు 17?, పిల్లి 120, పాము 172, దూడ 139

వీరబ్రహ్మం

గుఱ్ఱం (సుజ్ఞానరత్నావళి-25) కుక్క (సుజ్ఞానరత్నావళి-27) పాము (సుజ్ఞానరత్నావళి-?)

సిద్ధప్ప

పాము (సుజ్ఞానరత్నావళి-21)

యాగంటివారు

పాము డి-2489, చీమ డి-2489, కోడి డి-2489 ఆవు డి-249 , కుక్క డి-248?, ఎల్లి డి-2489 మేక డి-2489

వెంగమాంబ

కుక్క (సుజ్ఞాన రత్నావళి-84)

ఖేచరాలు

ఆకాశంలో తిరిగేవి ఈ విభాగంలో చేరుతాయి మచ్చుకు-

అన్నమయ్య

ఈగ 6-29, దోమ 5-185, చిలుక 6-214, తుమ్మెద 7-5?, ఉసుళ్లు 9-51, పిచ్చుక 9-285, మిడుత 10-66 మొదలైనవి

పెదతిరుమలయ్య

చిలుకలు 21-48, జటాయువు 21-23 తుమ్మెద 21-87 గరుడు 21-109, కాకము 21-285 పావురము 23-156

చినతిరుమలయ్య

తుమ్మెద 16-2-31, కోయిల 16-2-44, చిలుకలు 16-2-47 పావురము 16-2-115

సారంగపాణి .

చిలుక (28), గద్ద (94), కాకి (192)

వీరబ్రహ్మం

చిలుక (సుజ్ఞాన రత్నావళి-1), గూబ (సుజ్ఞానరత్నావళి-4), కాకి (కాలజ్ఞానతత్త్వాలు-16)

సిద్ధప్ప

కాటుక పక్షులు [సుజ్ఞాన రత్నావళి-31], దోమ సుజ్ఞానరత్నావళి-33)

యాగంటి వారు

మిణుగురు డి-2489, కాకి డి-2489, చిలుక డి-2494, తుమ్మెద డి-2489

వెంగమాంబ

హంస [సుజ్ఞానరత్నావళి-83]

వనచరాలు

అడవిలో సంచరించే వాటిని ఈ విభాగంలో చేర్చబడ్డాయి.

మచ్చుకు —

అన్నమయ్య :

జింక 5-337, సింహం 6-17, ఏనుగు 10-227

పెద తిరుమలయ్య

పులులు 21-56, కుందేలు 21-58, ఏనుగు 21-225, సింహం 21-119, కోతి 21-56

చిన్న తిరుమలయ్య

పులి 16-1-60, ఏనుగు 16-2-102.

సారంగపాణి

పులి 29, ఉడుము 56, నక్క 60, కోతి 191, ఏనుగు 105

సిద్ధప్ప

ఏనుగు (సుజ్ఞానరత్నావళి-33), సింహం[సుజ్ఞానరత్నావళి 33]

యాగంటి వారు

ఖడ్గమృగం డి-2494, ఏనుగు డి-2494

జలచరాలు :

నీటిలో ఉండేవి ఇందులో వస్తాయి

అన్నమయ్య

చేప 6-139, జలగ 8-208, తాబేలు 15-130

పెద తిరుమలయ్య

కప్ప 21-35, మకరం, మీనం 21-90, మొసలి 23-230, తాబేలు 23-240

సారంగపాణి

రొయ్య 94, సంద్రకాయ 121

వీరబ్రహ్మం

చేప [సుజ్ఞానరత్నావళి-21]

సిద్ధప్ప

మొసలి, చేప (సుజ్ఞానరత్నావళి-33)

యాగంటి వారు

నత్తగుల్ల డి-2494

పై పరిశీలనవల్ల తేలిన అంశాలు

అన్నమయ్య, పెదతిరుమలయ్య, చిన తిరుమలయ్య, సారంగపాణి, వీరబ్రహ్మం దూదేకుల సిద్దయ్య యాగంటి వారు, తరిగొండ వెంగమాంబలు జంతుబలం ప్రస్తావన చేశారు గుంటుపల్లి కోటిలింగయ్య జంతుబలం ప్రస్తావన చేయలేదు

తాళ్ళపాకకవులు, సారంగపాణి, వీరబ్రహ్మం, సిద్దప్ప, యాగంటి కవులు, వెంగమాంబలు తమ పదాల్లో భూచరాల ప్రస్తావన చేశారు పాము, చీమ, కుక్క, కోడి, గుఱ్ఱం మొదలైన జంతువులు అందరి పదాల్లోను కన్పిస్తాయి

తాళ్లపాకకవులు, సారంగపాణి, వీరబ్రహ్మం, సిద్దప్ప, యాగంటి కవులు, వెంగమాంబలు, ఖేచరాల ప్రస్తావన చేశారు తుమ్మెద, చిలక, మొదలైనవి అందరిలోను కన్పించగా సిద్ధప్ప "కాటుక పక్షులు" అనే ఖేచరాన్ని ప్రత్యేకంగా చెప్పాడు యాగంటివారిలో కూడ "మిణుగురు" అనేది ప్రత్యేకంగా కన్పిస్తుంది ఇవి మిగిలిన వారిలో కన్పించవు

తాళ్లపాక కవులు, సారంగపాణి, సిద్ధప్ప, యాగంటి వారు, వనచరాల ప్రస్తావన చేశారు వీరబ్రహ్మం, వెంగమాంబ వీటి ప్రస్తావన చేయలేదు "ఏనుగ" అందరిలోను కన్పించగా సారంగపాణి పదాల్లో "ఉడుము" యాగంటివారి పదాల్లో ఖడ్గమృగం ప్రత్యేకంగా కనిపిస్తాయి

అన్నమయ్య, పెద తిరుమలయ్య, సారంగపాణి, వీరబ్రహ్మం సిద్ధప్ప, యాగంటివారు జలచరాల ప్రస్తావనచేశారు చినతిరుమలయ్య వెంగమాంబ వీటి ప్రస్తావన చేయలేదు యాగంటి వారు "నత్తగుల్ల" అనే జలచరాన్ని ప్రత్యేకంగా చెప్పారు

6334 సంతలు

నిత్యావసర వస్తువులు ప్రజలందరికి అందుబాటులో ఉండడానికి జనసమూహం ఏర్పరచుకొన్న వాణిజ్య కేంద్రాలు సంతలు పట్టణాలు అభివృద్ధి చెందిన తరువాత, రాకపోక సాధనాలు విస్తరించడంవల్ల సంతలు క్రమంగా తగ్గిపోయాయి అయినా నేటికి కొన్ని పల్లెటూళ్లలో సంతలు జరుగుతూనే ఉన్నాయి

అన్నమయ్య

అన్నమయ్య, సారంగపాణి సంతల ప్రస్తావన చేశారు మచ్చుకు

సంతలే చొచ్చితిగాని సరకు గొననైతి
వెంకట శ్రీహరి నీవే యిట్టు దయ జూడవే (2-27)
పొందిడి సంతలలో నీ సుద్దులెల్ల విని విని
విసరములెల్ల బాపే విభుడెవ్వడో (11-257)

సంత కూటముల జాణకాడవు
మంతనపు రతుల మానటీడవు (25-12)

సారంగపాణి సంతలో అమ్మే అనేకరకాల వస్తువుల్ని వర్ణించాడు

పల్లవి  నాన్నారము చంత్లో నానాదింమందె టు
నయము గిచ్చేరంటనె – సూడే –

అనుపల్లవి  ఈశ్నే పొద్దెక్కనే–యీాడేడుండా–దెంటి
కోట్ని గొండపోతే–కొండ దేవాగుదైన ॥నాన్నా॥

ఇఁనేద సూత్లెదె యీాసుల్లె మగ్గవే
ములగు శాకలాడ మస్తంటనె

తలయొంటికె తాళ్లు నిలువు పొడుగైయ్యానే
అలసొచ్చేతల్కిడ అంబలొండుండెరే ॥నానా॥
[సా వ 153]

6335 ఆయుధాలు .

తాళ్లపాక కవులు, సారంగపాణి అనేకరకాల ఆయుధాల్ని ప్రస్తావించారు మచ్చుకు—

అన్నమయ్య

అంపపొది 26-230, ఇంద్రధనుస్సు 26-101, కరారు 6-101, చక్రం 8-281 పంచాస్త్రాలు 30-33 శంఖచక్రాలు 26-191, కత్తి 12-209, ఖడ్గం 6-93, బాణం 30-38, గడ్డపార 5-119, గొడ్డలి 27-392 మొదలైనవి

పెద తిరుమలయ్య

శంఖం 23-1, బిల్లకత్తి 23-280, చక్రము 21-18

చినతిరుమలయ్య :

బాణం 16-1 38, ఈటె 16-2-73, గడ్డపార 16-1-54.

సారంగపాణి .

బాణం 7, పట్టాకత్తె 122, కొడవలి .6, కత్తెర 65

తాయులపిమ పదకవులు రచనల్లో ప్రతిబింబించే రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక పరిస్థితుల్ని ఇంతవరకు పరిశీలించడం జరిగింది తాళ్లపాక కవులు ప్రజలకు సన్నిహితంగా ఉండటంవల్ల, సంచారం చేసి పదాల్ని ప్రచారం చేయడంవల్ల వారు నాటి ప్రజల అలవాట్లను

ఆచారాల్ని క్షుణ్ణంగా వ్యక్తపరిచారు పీరబ్రహ్మం, దూదేకుల సిద్ధయ్య, ఆరూగంటి కవులు, కోటిలింగయ్య, తరిగొండ వెంగమాంబ మొదలైన పదకవులు తాత్త్విక దృక్పథంతో పదాలు చెప్పడంవల్ల వీరి పదాల్లో రాజకీయ, సామాజిక పరిస్థితులకు సంబంధించిన విషయాలు అంతగా కన్పించవు



# ఉపసంహారం

ఈ సిద్ధాంత గ్రంథంలో కనుగొన్న విశేషాంశాలు 1 వాగ్గేయ సాహిత్యం ముందుగా సాగరసీమలో పుట్టినా రాయలసీమలోనే పు వనం పొందింది

2 సంఖ్యా దృష్టితో పరిశీలించినా ఇతర ప్రాంత వాగ్గేయకా కంటే రాయలసీమ వాగ్గేయకారుల సంఖ్య గణనీయంగా ఉంది పై వాగ్గేయకార సాహిత్యాన్ని సాముహికంగా పోషించిన కుటు లుండడం (తాళ్లపాక) విశేషాంశం జననం ఆధారంగా లభ్య పదకవులు కడప, కర్నూలు, చిత్తూరు జిల్లాల్లో మాత్రమే కన్పిస్తా అనంతపురం జిల్లాలో కన్పించరు

3 ఇతర ప్రాంతీయ వాగ్గేయకారుల్లో తాత్త్వికులు ఎక్కు రాయలసీమ వాగ్గేయకారుల్లో వైష్ణవ, శైవపదకవులు తాత్త్వి కన్పిస్తారు ప్రత్యేకించి పదకర్తలలో స్త్రీలు (తరిగొండ వెంకమా ఉండడం విశేషం

4 ఇతర ప్రాంతీయ వాగ్గేయకారులకంటే రాయలసీ కగ లు అసంఖ్యాకంగా పద సృష్టి చేయడం ఇతర సాహిత్య

(తాళ్లపాక కవులు) కూడా చేపట్టడం గుర్తించ దగ్గ విషయం

5 రచనా దృష్టితో పరిశీలిస్తే తాళ్లపాక కవుల్లో ఉత్తమ ఉదాత్త కవితా శిల్ప చమత్కారాలు విశేషంగా గోచరిస్తాయి ఈ సిద్ధాంతం తాళ్లపాక కవుల, సారంగపాణి రచనల్లో ప్రస్ఫుటంగా కన్పిస్తుంది వెంగ్రహ్మం, సిద్ధయ్య, యాగంటికవులు గుంటుపల్లి కోటిలింగయ్య వెంగమాంబ మొదలైనవారు ఆస్తికులుగా గోచరిస్తారు

6 శృంగార ఆధ్యాత్మిక పద విభజన తాళ్లపాక కవుల్లో, సారంగపాణిలో మాత్రమే కన్పిస్తుంది ఇతర రాయలసీమ పదకవుల్లో ఇలాంటి విభజన కన్పించదు

7, పదరచనా దృష్టితో పరిశీలిస్తే తాళ్లపాక కవులు, సారంగపాణి రచనల్లో పల్లవి అనుపల్లవి, చరణాల విన్యాసం క్రమ పద్ధతిలో ఉన్నట్లు అర్థమవుతుంది ప్రత్యేకించి తాళ్లపాక పదకవులలో జానపద ధోరణులు విస్తృతంగా ఉన్నాయి ఇతరుల్లో తక్కువ

8 భాషా దృష్టితో పరిశీలిస్తే తాళ్లపాక కవుల రచనల్లో రాయలసీమ పలుకుబడులు, జాతీయాలు, సామెతలు, జంట పదములు జానపద వ్యవహారానికి దగ్గరివిగా కన్పిస్తాయి సారంగపాణి పదాల్లో గ్రామీణ భాష విరివిగా వాడబడింది.

9 తాళ్లపాక కవుల రచనల్లో విభిన్నప్రదేశ ఆలయాల చారిత్రక విశేషాలు, సాంఘికాచారాలు స్పష్టంగా గోచరిస్తున్నాయి, ఇతర వాగ్గేయకారుల కంటే తాళ్లపాక కవులు రాజులకు ప్రజలకు దగ్గరి వారు కావడం దీనికి కారణం కావచ్చు

# ఉపయుక్త గ్రంథసూచి

## తెలుగు


రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, రామ సుబ్బశర్మ గౌరిపెద్ది (పరిష్కర్తలు) శృంగార సంకీర్తనలు, అన్నమాచార్య విరచితములు సంపుటం-19, 20-1965, సంపుటం-22-1975 తి తి దే ప్రచురణలు, తిరుపతి

అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి, శ్రీనివాసాచార్యులు, ఉదయగిరి (పరిష్కర్తలు) ఆధ్యాత్మ సంకీర్తనలు, అన్నమాచార్య విరచితములు సంపుటం-7-1951 సంపుటం-8-1952, తి తి దే ప్రచురణ తిరుపతి

అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి (పరిష్కర్త) ఆధ్యాత్మ సంకీర్తనలు, అనమాచార్య విరచితములు - సంపుటం 9 10-1952 సంపుట-11-1955 తి తి దే ప్రచురణ తిరుపతి

అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి (పరిష్కర్త) శృంగార సంకీర్తనలు, అన్నమాచార్య విరచితము, సంపుటం 13-1960 సంపుటం 14-1961, తి తి దే ప్రచురణ తిరుపతి

అనంతకృష్ణశర్మ, రాళ్ళపల్లి వేమన ఆంధ్రా యూనివర్సిటీ ప్రెస్ వాల్తేరు -1929

ఆనందమూర్తి, వేటూరి తాళ్లపాక పదకవుల కృతులు వివిధ సాహితీ ప్రక్రియలు, ప్రభాకర

| | |
|---|---|
| | ప్రచురణలు - హైదరాబాద్ - 1974 |
| ” | తాళ్లపాక కవుల పదకవితలు భాషా ప్రయోగ విశేషాలు (ద్విభా) ప్రభాకర ప్రచురణలు హైదరాబాద్-1976 |
| ” | తొలి సంకీర్తన కవులు, ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి, కళాభవన్ హైదరాబాదు - 1975 |
| ” | వైష్ణవాంధ్ర వాఙ్మయము మాస్టర్ ఆర్ట్ ప్రింటర్స్, 1-1-694/2/ఎ, గాంధినగర్, హైదరాబాదు -1986 |
| ఆరుద్ర | మన వేమన (శ్రీతల్లం పుల్లన్నగుప్త ధర్మనిధి ఉపన్యాసాలు, మరికొన్ని వ్యాసాలు శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రచురణ తిరుపతి-1985 |
| కృష్ణమూర్తి, కె జె | తరిగొండ వెంగమాంబ కృతులు పవిమర్శక పరిశీలనము ముత్యాల హారతి ప్రచురణలు తిరుపతి (ప్ర ము) 1983 |
| కృష్ణశ్రీ | దేశిసారస్వతము - పల్లెపదాలు ఆంధ్ర సారస్వత పరిషత్తు-హైదరాబాదు |
| గంగప్ప, ఎస్ | తెలుగులో పదకవిత, శశీ ప్రచురణలు సి-73, శ్రీనివాసనగర్, గుంటూరు 1983 |

| | |
|---|---|
| | సారంగపాణి పదసాహిత్యం శశి ప్రచురణలు సి 73 శ్రీనివాసనగర్ గుంటూరు (ప ము ) 1980 |
| | భాషా వ్యాసాలు., శశి ప్రచురణలు_ సి 73 , శ్రీనివాసనగర్, గుంటూరు (ప ము ) 1985 |
| గంగాధరం, నేదునూరి (సంకలనం) | సారంగపాణి పదములు., ప్రాచీన గ్రంథావళి సరస్వతీ ప్రెస్ , రాజమహేంద్రవరం (ప ము ) 1963 |
| గోపి, ఎన్. | ప్రజాకవి వేమన, చైతన్య ప్రచురణలు హైదరాబాదు-1980 |
| గోవిందరాజు, సి | తాళ్లపాక అన్నమయ్య సంకీర్తనలో ఉత్సవ విశేషాలు , శ్రీనివాస ప్రచురణలు, రామసముద్రం 1987 |
| చిన్నన్న, తాళ్లపాక | అన్నమాచార్య చరిత్రము తి తి.దే ప్రచురణ తిరుపతి |
| జంగమయ్య, రామిశెట్టి | తరిగొండ వెంకమాంబ జీవితరాత్మాకరము విల్లగోపుల వాలిపల్లె, వాయల్పాడు తాలూకా |
| జగన్నాథరావు, ౦ టి, (పరిష్కర్త) | శృంగార సంకీర్తనలు అన్నమాచార్య విరచితములు సంపుటం- 8 ,తి తి దే ప్రచురణ తిరుపతి 19‌.4 |
| జగన్నాథరావు, పి జి. | అధ్యాత్మ సంకీర్తనములు, తాళ్ళపాక |

| | |
|---|---|
| (పరిష్కర్త) | పెదతిరుమలాచార్య విరచితములు సం 21 తితిదే ప్రచురణ తిరుపతి 1974 |
| జగన్నాథరావు, పి టి | శృంగార సంకీర్తనలు తాళ్ళపాక, పెదతిరుమలాచార్య విరచితములు సం 23 తితిదే ప్రచురణ తిరుపతి 1971 |
| జనార్దనం, కె | యాగంటి పదాలు ఒకపరిశీలన శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి ఎంఫిల్ డిగ్రీ కొరకు సమర్పించిన లఘు సిద్ధాంత వ్యాసం (ముద్రితం)తిరుపతి 1986, |
| జోగారావు, యస్వీ | ఆంధ్రయక్షగాన వాఙ్మయ చరిత్ర ఆంధ్ర విశ్వకళా పరిషత్తు–వాల్తేరు (ప ము ) 1961 |
| దోణప్ప, తూమాటి | ఆంధ్ర సంస్థానములు–సాహిత్య పోషణము ఆంధ్ర విశ్వకళాపరిషత్తు, వాల్తేరు -1969 |
| | తెలుగులో కొత్త వెలుగులు (మొదటి సంపుటం, డిలైట్ ప్రింటర్స్, విశాఖపట్నం (ప్ర ము ) 1972 |
| నాగేశ్వరరావు, మారిశెట్టి | సిద్ధయ్య జీవితము సి వి కృష్ణాబుక్ డిపో మద్రాసు |

ప్రభాకరశాస్త్రి, వేటూరి — శృంగార సంకీర్తనలు, అన్నమాచార్య విరచితములు సం 4., తి తి దే ప్రచురణ తిరుపతి 1947

ప్రభాకరశాస్త్రి వేటూరి — అన్నమాచార్య జీవిత చరిత్ర-పీఠిక తి తి దే ప్రచురణ 1949

పార్థసారధి, ఆర్ — ఆంధ్రప్రదేశ్ జానపద పాటలు, రాజేశ్వరీ ప్రింటర్స్, కాచీగూడ స్టేషన్ రోడ్, హైదరాబాదు. 1982

మోహన్, జి యస్ — తెలుగు జానపద విజ్ఞాన వ్యాసావళి శ్రీనివాస పబ్లికేషన్స్, మలయనూరు 1981

రంగనాధాచార్యులు, కె కె (సంపాదకుడు) — తెలుగులో తొలి సమాజకవులు ఆంధ్ర సారస్వత పరిషత్తు ప్రచురణ, తిలక్ రోడ్ హైదరాబాద్-1983,

రజనీకాంతరావు, బాలాంత్రపు — ఆంధ్ర వాగ్గేయకార చరిత్రము విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ విజయవాడ (ద్విము) 1975

రామానుజశర్మ, గౌరిపెద్ది (పరిష్కర్త) — శ్రీతాళ్లపాక అన్నమాచార్యుల జీవిత చరిత్రము శ్రీతాళ్లపాక చిన తిరువెంగళనాథ విరచితము తి,తి దే ప్రచురణ (మూ ము:) 1980

అధ్యాత్మ సంకీర్తనలు, అన్నమాచార్య విరచితములు సంపుటం

| | |
|---|---|
| | -1-1980, సంపుటం 2-1981 తి తి దే ప్రచురణ, తిరుపతి |
| రామసుబ్బశర్మ, గౌరిపెద్ది (పరిష్కర్త) | శృంగార సంకీర్తనలు, అన్నమాచార్య విరచితములు సంపుటం-125 1976, సం 24-25, 1977, సం 26,27 1979, సం 28,29, 1983 సం 31-1983 సం 30-1984 తి తి దే ప్రచురణ, తిరుపతి |
| రామలక్ష్మి ఆరుద్ర | కొల్లపాక వారి పలుకుబళ్ళు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి హైదరబాద్ 1971 |
| రామసుబ్బయ్య, మజ్జి బోయిన | బ్రహ్మ జిజ్ఞాస (చతుర్థ భాగం) కర్నూలు - 1980 |
| రామరాజు, బిరుదురాజు | తెలుగు జానపద గేయసాహిత్యం జానపద విజ్ఞాన ప్రచురణలు-హైదరాబాద్ (ద్వి ము) 1978 |
| రామకృష్ణమాచార్యులు, కొండూరి | శ్రీతరిగొండ వెంకమాంబ చరిత్రము (I) గ్రీవ్స్ కుస్సస్ అండ్ కో స్కాటిష్ ముద్రణ మద్రాసు (ద్వి ము) 1915 |
| లక్ష్మీరంజనం, ఖండవల్లి బాలేందు శేఖరం, ఖండవల్లి | ఆంధ్రుల చరిత్ర-సంస్కృతి బాల సరస్వతీ బుక్‌డిపో కర్నూల్ 1951 |
| లక్ష్మణయ్య, సముద్రాల | అన్నమాచార్య సంకీర్తనామృతము (ప్రథమ ద్వితీయ భాగాలు) ప్రిడమ్ ప్రెస్ మద్రాసు (ప్ర ము) 1983 |
| లక్ష్మీనారాయణ, కొడాలి | చారిత్రక దృక్పథంలో శ్రీపోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి |
| లీలావతమ్మ, హొన్నా | అన్నమయ్య సంకీర్తనల్లో జానపద |

గేయ ఫణితులు, విశాలాంధ్ర పబ్లికేషన్స్ హౌస్ — పానకం 1986

వసుంధర, జి. — తెలుగు జానపద సాహిత్యము-స్త్రీల గేయములలో సంప్రదాయము ఉస్మానియా విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత వ్యాసం అముద్రితం 1980

వాణి, కేసర్ల — తాళ్ళపాక అన్నమాచార్యుల పదకవితల్లోని అలంకారాలు-పరిశీలన శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సమర్పించిన సిద్ధాంత వ్యాసం (అముద్రితం) తిరుపతి-1982

విజయరాఘవాచార్యులు, బి ఆదినారాయణుడు, జి (పరిష్కలుర్త) — ఆధ్యాత్మిక సంకీర్తనలుఅన్నమాచారలీ విరచితములు సం 2 1936 మహంతు దేవస్థాన ప్రచురణ మద్రాసు

విజయరాఘవాచార్యులు, బి (పరిష్కర్త) — శృంగార సంకీర్తనలు, అన్నమాచారలీ విరచితములు సం 3 తి తి దే ప్రచురణ తిరుపతి 1937

విజయరాఘవాచార్యులు, బి ఆదినారాయణుడు, జి (పరిష్కలుర్త) — తాళ్ళపాక లఘు కృతులు (సంకీర్తన లక్షణం) సం 1 తి తి దే ప్రచురణ మద్రాసు 1935

విద్యావతి ఏ — తాళ్ళపాక కవుల సాహిత్యసేవ ఈడేపల్లి మచిలీ పట్టణం-1979

వీరభద్రశాస్త్రి కల్లూరి — త్యాగరాజ కీర్తనలు విశేష వివరణము (ప్ర సం) స్వధర్మ స్వారాజ్య సంఘము సికింద్రాబాదు 1975

వీరేశలింగం పంతులు, కందుకూరి — ఆంధ్ర కవుల చరిత్రము శ్రీచింతామణి ముద్రాక్షరశాల రాజమహేంద్రవరము 1911

| | |
|---|---|
| వెంకటశేషయ్య, పెనుమాడు | తాళ్ళపాక కవులు, శ్రీ బాలాజీ ప్రెస్ చిత్తూరు, 1979 |
| వెంకటరెడ్డి, మేడపాటి | తెలుగుయోగులు, వేమనయోగ పరిశోధనాలయం, సికింద్రాబాదు, 1987 |
| శ్రీనివాసాచార్యులు, ఉదయగిరి (పరిష్కర్త) | ఆధ్యాత్మికసంకీర్తనలు అన్నమాచార్య విరచితములు సం 3 తి. తి దే ప్రచురణ, తిరుపతి, 1951 |
| | ఆధ్యాత్మిక, శృంగార సంకీర్తనలు తాళ్ళపాక చిన తిరుమలాచార్య విరచితములు తి తి దే ప్రచురణ సం 16 తిరుపతి, 1962 |
| " | శృంగారసంకీర్తనలు అన్నమాచార్య విరచితములు, సం 15 – 1961, సం17 1963 తితిదే ప్రచురణ తిరుపతి |
| శేషయ్య, చాగంటి | ఆంధ్రకవి తరంగిణి, సం 7 హిందూధర్మశాస్త్ర గ్రంథ నిలయం కపిలేశ్వరం తూర్పుగోదావరి, 1952 |
| సర్వోత్తమరావు, కె | తాళ్ళపాక కవుల పదసాహిత్య విజ్ఞాన సూచిక (అముద్రితం) |
| " | అన్నమయ్య దశావతార కీర్తనలు ఒక పరిశీలన (అముద్రితం) |
| సీతారామమ్మ, ఓరుగంటి | తాళ్ళపాక పెదతిరుమలయ్య కృతుల సవిమర్శక పరిశీలన – సుభద్రా |

గ్రంథమాల, 75, సరోజినీదేవి రోడ్ తిరుపతి, 1985

సుందరం, ఆర్వీయస్ — తెలుగు కన్నడ జానపద గేయాలు జానపదవిజ్ఞానభారతి, మైసూరు 1979

” — జానపద సాహిత్య స్వరూపం జానపద విజ్ఞాన సమితి బెంగుళూరు, 1976

సుబ్బరామయ్య, కె బి — యాగంటి క్షేత్ర మహాత్మ్యము కొలకుల గ్రామం, మార్కాపురం 1986

సుబ్బరామ దీక్షితులు — సంగీత సంప్రదాయ ప్రదర్శిని (మొ సంపుటం) ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమి ప్రచురణ హైదరాబాద్

సుబ్బారావు, వంగూరి — శతక కవుల చరిత్ర

— — — సుజ్ఞాన రత్నావళి యను వేదాంత కీర్తనలు ఎస్ వి గోపాల్ అండ్ కో మదరాసు - 1984

— — — కాలజ్ఞాన తత్త్వములు సి వి కృష్ణా బుక్ డిపో, మద్రాసు

ఆంగ్లం

Edgar Thurston — Castes and Tribes of Southern India, Cosmo Publications Delhi 1975

| | |
|---|---|
| Kumara Swamy Reddy, G (E O of T T D) | Souvenir Golden Jubilee Celebrations (1933 83), T T D Publication, 1984 |
| Parabrahma Sastry, P V | Inscriptions of Andhra Pradesh Cuddapah District Part II Govt of Andhra Pradesh Hyderabad 1978 |
| Ramesan, N | The Tirumala Temple Tirumala Tirupati Devasthanams, Tirupati, 1980 |
| Sarvottama Rao, K | Vaishnavism of Annamacharya Saptagiri monthly edition TTD' Tirupati October 1984 |
| Subramanya Sastry, Sadhu | Report on the Inscriptions of the Devasthanams, Tirupati Sri Mahanta s Press 21 Anderson Street Madras 1930 |
| Vijaya Raghavacharya, V | T T D Inscriptions Vol III Sri Mahanta s Devasthanam's Press, 21 Anderson Street Madras 1935 |
| | T T D Inscriptions Vol IV & V T T D Press 13, 14 Second Line Beach Madras 1936 1937 |

వ్యాసాలు

| | |
|---|---|
| అరుణాచలం, పి వి | అజ్ఞాత వాగ్గేయకారుడు-సారంగపాణి ఆంధ్రపత్రిక 5-12-1976 |

| | |
|---|---|
| ఆనందమూర్తి, వేటూరి | తెలుగు సంకీర్తన లక్షణము లక్ష్య లక్షణ సమన్వయము భారతి మార్చి 1971 |
| " | పదకవితలు ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక, 1975 |
| " | జానపద సాహిత్యోద్ధారకుడు పరిశోధన – ఆగష్టు — 195 |
| కృష్ణకుమారి, నాయని | జానపదసాహిత్యం ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక–1975 |
| " | జానపద భాష భారతి, ఆగష్టు–1972 |
| కృష్ణమూర్తి, కె జె | సారంగపాణి పదాలు ప్రవంతి, డిశెంబర్ – 975 |
| కృష్ణశ్రీ | మేలుకొలుపులు – లాలిపాటలు భారతి, మార్చి – 1953 |
| " | మంగళ గీతములు భారతి మే – 1953 |
| కోదండరామయ్య, తిమ్మావజ్ఝల | చిత్తూరు మండల ప్రాచీన సాహిత్య చరిత్ర చిత్తూరు జిల్లా రచయితల మహాసభల ప్రత్యేకసంచిక అక్టోబర్ 1968 |
| గంగప్ప, ఎస్ | అన్నమాచార్యుల సంకీర్తనలు రాయలసీమమాండలికపదప్రయోగం భారతి, డిసెంబర్–1982 |

గంగప్ప, ఎస్ — అన్నమయ్య జోల పాట సప్తగిరి, ఏప్రిల్, 1982

” — అన్నమాచార్య సంకీర్తన కవిత భారతి, ఫిబ్రవరి - 1981

గోపాలకృష్ణమూర్తి శ్రీపాద — యాగంటి వారి రచనాకాలం కలగూరగంప, భారతి, నవంబర్-1961

గోప, ఎస్ — వీరబ్రహ్మం మతం అచలం ఆంధ్రప్రభ దిన పత్రిక 4-7-1982

బాలకృష్ణారెడ్డి ఎడ్ల — తాళ్లపాక కవుల వైష్ణవ సాహిత్యసేవ సప్తగిరి, మే-1982

మహారాజు, దేవరాజు — హృదయాల్లో ముద్రలు వేసే జానపదగీతాలు భారతి, అక్టోబరు - 1971

రజనీకాంతరావు, — అన్నమయ్య ఆధ్యాత్మికత

బాలాంత్రపు — ఆంధ్రప్రభ దినపత్రిక 16-6-1985

రామరాజు, బిరుదరాజు — అన్నమయ్య పాటలలో జానపద రీతులు (573వ తాళ్లపాక అన్నమాచార్య జయంతి మహోత్సవములు) మే-18,19,20 1981

లక్ష్మీనరసమ్మ, యస్ — మేలుకొలుపులు జానపదం త్రైమాసిక పత్రిక జూన్ 981

వరహానరసింహాచార్యులు, — గోవిందసామయ్య

వింజమూరి — ఆంధ్ర పత్రిక-1945-4



| | |
|---|---|
| వీరరాఘవాచార్యులు, | కులతత్త్వం పై ధ్వజమెత్తిన వీరబ్రహ్మేంద్ర |
| కొండూరి | యోగి.,ఆంధ్రప్రభ , దినపత్రిక 14-5-1978 |
| వెంకటరమణ, ఆదిభట్ల | మన వాగ్గేయకారులు సప్తగిరి మాసపత్రిక, నవంబర్-1985 |
| వెంకట సుబ్బారావు, | జానపద గాయకులు |
| తంగిరాల | ఆంధ్రజ్యోతి వార పత్రిక 5-3-1971 |
| శ్రీనివాసులుశెట్టి, | పదకవితా పితామహుడు తాళ్లపాక అన్నమయ్య |
| కామిశెట్టి | సప్తగిరి నవంబర్-డిసెంబర్-1975 |
| " | తెలుగులో పదకవిత |
| " | తెలుగు, జూలై, సెప్టెంబర్ 1978 |
| " | అన్నమయ్య దేశికవితాగానం చందమామ పాట-ఆంధ్రప్రభ వారపత్రిక 22-6-1983 |
| శ్రీనివాసులుశెట్టి, | అన్నమయ్య దేశకవితాగానం తుమ్మెదపాట |
| కామిశెట్టి | ఆంధ్రప్రభ వారపత్రిక 13 7-83 |
| సరస్వతీదేవి, ఇల్లిందల | లాలిపాటలు-జోలపాటలు ఆంధ్రపత్రిక, అక్టోబర్ 26, 1949 |
| సుధాకర రెడ్డి, తిరుమూరు | కృషీవలుడు అన్నమయ్య సప్తగిరి, మాస పత్రిక, మే, 1986 |